## సరదాగా....

### కోపం వస్తే...

ఒక భర్త తన భార్యగురించి చెబుతూ..

"నా భార్యకి గానీ కోపం వచ్చిందంటే నా మీద, పిల్లల మీద, చివరికి కుక్కల మీద కూడా అరిచేస్తుంది. ఎవ్వరూ తిరిగి ఒక్క మాట కూడా మాట్లాడలేరు."

"మరి నీకు కోపం వస్తే..."

"గోడలవైపు, కిటికీలవైపు తిరిగి గట్టిగా అరిచేస్తా! అవి తిరిగి సమాధానం చెప్పలేవు తెలుసా!!"

### ఒక ప్రశ్న?

శాంతి నివాసం...రాఘవయ్య గారు పైసా పైసా కూడబెట్టి, అపురూపంగా కట్టుకున్న ఇల్లు. కొడుకులూ, కూతుళ్ళూ విదేశాల్లో స్థిర పడటంతో అంత పెద్ద ఇంట్లో ఒక్కరే ఉంటు న్నాడాయన. భార్య సుగుణ పోయి ఏడాది దాటింది. ఒంటరితనం పీడిస్తున్నా, ఆ ఇంటిని మాత్రం వదలడు. కొడుకులు ఎంత మొత్తు కున్నా, కూతుళ్ళు ప్రేమగా తమ వద్ద వచ్చి ఉండమన్నా ససేమిరా అంటాడు. ఇక కాల క్షేపం ఎలా అంటే, ఉన్నాయిగా పార్కులు, పుస్తకాలు... అంటూ నవ్వుతారు. కానీ ఓ రెండు నెలలనుంచీ ఆయన కాలక్షేపం ఎదురిల్లే అయింది. రాఘవయ్యగారు తన బెడ్రూమ్ కిటికీ నుంచి చూస్తే, ఎదురింట్లోని హాలు స్పష్టంగా కనిపిస్తుంది. ఎదురింట్లోకి రెండు నెలల క్రితమే ఓ కుటుంబం అద్దెకు దిగింది. ముఖ్యంగా ఆ ఇంట్లో నలుగురు పిల్లలూ ఆయన్ను ఆకర్షించారు. వాళ్లు నలుగురూ చేసే పనులు చూస్తూ, తనకు తానే రకరకాల ప్రశ్నలు వేసుకుంటుంటాడాయన. ఆ ప్రశ్నలకు సమాధానాలు వెతకటంలోనే రోజంతా గడిచి పోతుంది. ఒకరోజు వాళ్ళ ఎత్తుల మీద ఆయన మనస్సులో ఓ ప్రశ్న తలెత్తింది. "ఆ నలుగురు పిల్లలూ ఒక్కొక్కరు ఒక్కో ఎత్తులో ఉన్నారు కదా. నలుగురి సరాసరి ఎత్తు 74 అంగుళాలు. ముగ్గురు అన్నదమ్ములకు మాత్రం ఎత్తులో రెండు అంగుళాల తేడా ఉంటుంది. మూడోవాడు, నాలుగోవాడి మధ్య ఎత్తు తేడా ఆరు అంగుళాలు. ఒక్కొక్కరి ఎత్తు ఎంత?" ఇదీ ఆయన మనస్సులో మెదిలిన ప్రశ్న. రాఘవయ్యగారు కిటికీలోనుంచి వాళ్ళను చూస్తూ, లెక్కలు వేసి వాళ్ళ ఎత్తులు ఎంతెంతో తెలుసుకున్నారు. మరి మీరూ తెలుసు కోండి.

**సమాధానం**

నలుగురి అన్నదమ్ముల్లో మొదటివాడి ఎత్తు 70 అంగుళాలు. రెండోవాడు 72, మూడోవాడు 74, ఇంక నాలుగోవాడి ఎత్తు 80 అంగుళాలు.













8

## ఆడదే ఆధారం.. కథ ఆడనే ఆరంభం

విభిన్న రంగాల్లో భారతీయ మహిళ మేలైన విజయాలు సొంతం చేసుకుంటోంది. వివక్ష వెనక్కిలాగుతున్నా పరిధి విశాలం చేసుకుంటూ ఎదుగుతోంది. మార్చి 8 అంతర్జాతీయ మహిళా దినోత్సవం సందర్భంగా ప్రత్యేక కథనం

50

### ఆధునిక కర్మయోగి రామ్‌దేవ్‌బాబా

సన్యాసంటే కేవలం ఆధ్యాత్మికతే కాదు, దేశ, ధర్మాలు రక్షించేవాడని చాటి చెప్పారు రామ్‌దేవ్‌బాబా. ఈ ఆధునిక కర్మయోగి గురించి ఓ వీక్షణం..

72

### ఇంటర్వ్యూ

ఘంటసాల అవధానాలతో జాతీయ రికార్డు స్థాపించి సరికొత్త ఒరవడిలో దూసుకుపోతున్న వైద్య నిపుణుడు డాక్టర్ రహమతుల్లా గురించి...

## సీరియల్స్



## కథలు



## ఫీచర్స్



ముఖచిత్రం: అను ఇమ్మాన్యుయేల్
ఫొటో: గోపీకృష్ణ


రచనలు, కథలు పంపవలసిన చిరునామా
నవ్య వీక్లీ, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం.76, అశ్వనీ లేఅవుట్, హుడా హైట్స్, రోడ్ నెం.70, జూబ్లీహిల్స్, హైదరాబాద్33. email: navyaweekly@andhrajyothy.com





### ఛీ

ఓ మూడేళ్ళ పిల్లాడు తల్లితో పాటుగా ప్రసూతి ఆసుపత్రికి వచ్చాడు. అక్కడ తల్లి పక్కగా కూర్చున్న నిండు గర్భిణిని చూశాడు. అమాయకంగా ఆమెను అడిగాడిలా.

"ఆంటీ! మీ పొట్ట ఎందుకు ఇంత పెద్దగా ఉంది?"

"ఎందుకంటే ఇందులో బుజ్జిబాబు ఉన్నాడు కాబట్టి."

"బాబున్నాడా లోపల" ఆశ్చర్యపోయాడు పిల్లాడు.

"అవును"

అయోమయంగా చూశాడామెను పిల్లాడు. మళ్ళీ అడిగాడిలా.

"బుజ్జిబాబు అల్లరి చెయ్యడు కదా, మంచివాడేకదా?"

"చాలా మంచివాడు."

"అంత మంచిబాబుని తినడానికి మీకు పాపం అనిపించలేదా, ఛీ" అన్నాడు పిల్లాడు. భయంభయంగా ఆమె దగ్గర నుంచి వెనక్కి జరిగాడు.

### దేవుడు

ఆశ్రమపాఠశాలలో పిల్లలంతా భోజనం చేసేందుకు పళ్ళాలు పట్టుకుని వరుసగా నిల్చున్నారు. అక్కడి టేబుల్ మీద ఆహార పదార్థాలతో పాటు అరటిపళ్ళూ, బిస్కట్లూ ఉన్నాయి. అయితే అరటిపళ్ళున్న ట్రే దగ్గరగా ఇలా రాసి ఉంది.

అరటిపండు ఒకటే తీసుకోవాలి. ఎక్కువ తీసుకునేందుకు ప్రయత్నించారో! పైన దేవుడు చూస్తున్నాడు.

పిల్లలు బాధగా పళ్ళ ట్రే దాటి ముందుకు వచ్చారు. అక్కడ బిస్కట్ల ట్రే దగ్గర ఓ కొంటె కుర్రాడు ఇలా రాసి పెట్టాడు.

బిస్కట్లు కావాల్సినన్ని తీసుకోవచ్చు. అరటిపళ్ళనే దేవుడు చూస్తున్నాడు.

### మూడుకోరికలు

బాగా డబ్బున్న వ్యక్తి నాలుగైదు కంపెనీలు నడుపుతున్నాడు. అతని పుట్టినరోజు సందర్భంగా మొసళ్ళచెరువు గట్టున పార్టీ ఏర్పాటు చేశాడు. పార్టీలో ఇలా చెప్పాడు.

"ఈ చెరువులో మొసళ్ళు ఉన్నాయన్న సంగతి మీ అందరికీ తెలిసిందే! ఎవరైతే ఈ చెరువులోకి దూకి, ప్రాణాలతో బయటపడతారో అతనివి, ఎలాంటివైనా మూడుకోరికలు తీరుస్తాను. సాహసవంతులు ప్రయత్నించవచ్చు."

ఎవరూ సాహసించేందుకు ముందుకు రాలేదు. ఛీఛీ అని అతిథులను చీదరించుకున్నాడతను. ఇంతలో దబ్బున శబ్దం అయింది. ఎవరో చెరువులోకి దూకారు. చూస్తూండగానే అతను మొసళ్ళ నుంచి చాకచక్యంగా తప్పించుకుని గట్టుకు చేరుకున్నాడు. అతనిని అభినందించాడు డబ్బున్నవ్యక్తి.

"నీ మూడు కోరికలేంటో చెప్పు, తీరుస్తాను." అడిగాడు.

"అర్జంట్‌గా షాట్‌గన్, బుల్లెట్స్ ఇవ్వండి, నన్ను ఆ చెరువులోకి తోసిన వెధవెవడో చూపించండి, చాలు." అన్నాడు ఆ వ్యక్తి.

–వైనతేయ

www.navyaweekly.com

పుస్తక పఠనం ఎంతటి బాధనయినా మరపిస్తుంది.

నవ్య

సంపుటి: 14 సంచిక: 2

15-3-2017



మేనేజింగ్ డైరెక్టర్
వేమూరి రాధాకృష్ణ

ఎడిటర్
ఎ.ఎన్.జగన్నాథశర్మ

# మొదటి పేజి

## ఎందుకంటే?

అయిదుగురు అక్కచెల్లెళ్ళూ, ఆరుగురు అన్నదమ్ములూ వెరసి పదకొండుమందీ పక్కపక్కనే ఇళ్ళుకట్టుకున్నారు. చెట్టూచేమా పెంచుకున్నారు. పువ్వూనవ్వూ పంచుకున్నారు. సరదాగా ఉంటున్నారు. కాలనీ అంటే అది! అక్కడ అద్దెకు ఇల్లు దొరికితే హాయిగా ఉంటుంది. అయితే అక్కడ అద్దెకు ఇల్లు దొరకడం కష్టం. జి ప్లస్ టు కట్టారంతా. గ్రౌండ్‌ఫ్లోర్ కలుపుకుని మూడు ఫ్లోర్లు వేశారు. గ్రౌండ్‌ఫ్లోర్‌లో ఓనర్లు ఉంటూ, పైఫ్లోర్లు రెండూ అద్దెకు ఇస్తున్నారు. ఆ లెక్కన అక్కడ అద్దెకు ఇరవైరెండు ఫ్లోర్లు దొరుకుతాయి. కాని దొరకవు. ఎందుకు దొరకవు అంటే దిగినవాళ్ళు ఖాళీ చేయరు. సొంతొత ఇల్లు కట్టుకున్నా, కొనుక్కున్నా కదల రేవరూ. మాటసాయం, మనిషిసాయం కావాలంటే ఆ కాలనీని మించింది లేదు. అలాంటి ఆ కాలనీలో చిత్రంగా ఓ ఫ్లోర్ ఖాళీ అయింది.

ఆ ఫ్లోర్ ఓనర్ జానకిరావుగారు. ఆయనకి డెబ్బయి ఏళ్ళు. ఇంటి ముందు చెట్టునీడలో, బెంచీ మీద కూర్చున్నారాయన. పేపర్ చదువుతున్నారు. మనవలేమో క్రికెట్ ఆడుకుంటున్నారు. ఎవరో భార్యాభర్తలు వచ్చారు. అద్దెకు దిగుతాం, ఫ్లోర్ ఓసారి చూపిస్తారా? అడిగారు. వెళ్ళి చూసుకోండి, అంతా తెరిచే ఉంది అన్నారు జానకిరావుగారు. వెళ్ళి వాళ్ళు చూసి వచ్చారు. ఇల్లు బాగుందండి! విశా లంగా ఉంది. చుట్టుపక్కల వాళ్ళు కూడా ఎలాంటివాళ్ళో చెబితే తర్వాత మిగిలిన విషయాలు మాట్లాడుకుందాం అన్నారు. ముందు మీరు ఇప్పుడు ఉంటున్న చుట్టుపక్కల సంగతి చెప్పండి. అక్కడ అంతా మంచివాళ్ళేనా? అడిగారు జానకిరావుగారు. ఏం మంచివాళ్ళండీ బాబూ! అక్కడెవరూ వాళ్ళింటి సంగతులు వాళ్ళు పట్టించుకోరు. పక్కింటి సంగతులే పట్టించుకుంటారు. వాళ్ళబ్బాయి తాగుబోతట! వీళ్ళమ్మాయి భర్తకి విడాకులిచ్చేసిందట! ఎదురింటాయన తక్కువవాడా? లంచం తీసుకుంటూ దొరికిపోయాట్ట... ఇలా పక్కింటి సంగతు లన్నీ పట్టించుకుని, వేళాపాళా లేకుండా ఒకటే వాగుడు. కష్టానికీ, సుఖానికీ కలసిరారు, గొప్పలు చెప్పుకోవడంలో మాత్రం ముందుం టారు. మా అన్నయ్య ఐఏఎస్. మా అక్కయ్య పెద్ద సింగర్! మొన్న పాడుతాతీయగాలో కూడా పాడింది అని లేని పోని గొప్పలు చెప్పుకుంటారు. నిజానికి వాళ్ళన్నయ్య, ఏ బట్టలషాపులోనో పనిచేస్తూ ఉంటాడు, వాళ్ళక్కయ్య మూగదై ఉంటుంది. అంతా అబద్ధాలపుట్ట. ఆ నరకంలో ఉండలేకపోతున్నాం. దూరంగా వచ్చేయాలని ప్రయత్నం. అందులో భాగమే ఇప్పుడు ఈ ఫ్లోర్ చూడడం చెప్పారు వాళ్ళు. ఇక్కడ కూడా అంతేనండీ! తేడా ఏం లేదు. తర్వాత మీ ఇష్టం అన్నారు జానకిరావుగారు. అలాగా! అయితే వద్దండి అని వెళ్ళిపోయారు వాళ్ళు. వెనక్కి తిరిగి చూడలేదు. జానకిరా వుగారు మళ్ళీ పేపర్ చదువుకోసాగారు.



అంతలో మరో జంట వచ్చిందక్కడికి. పేపర్ చదువుతున్న జానకిరావుని పలకరించింది. సార్! ఇక్కడ ఓ ఫ్లోర్ ఖాళీగా ఉందని విన్నాం. ఉందాసార్! చూపిస్తారా? అడిగారు. పైకి వెళ్ళి చూసుకోండి, తెరిచే ఉంది అన్నారు జానకిరావు గారు. వెళ్ళి చూసి వచ్చారు వాళ్ళు. ఫ్లోర్ బాగుందండీ! చుట్టుపక్కల వాళ్ళ సంగతేంటండీ? బాగానే ఉంటారా? కలసి పోతారా? అడిగారు. ముందు మీరు ఇప్పుడు ఉంటున్న చుట్టుపక్కలవారి సంగతి చెప్పండి, వాళ్ళు ఎలాంటివారు? అడిగారు జానకిరావుగారు. చాలా మంచివాళ్ళండీ. కష్టానికీ, సుఖానికీ ముందుంటారు. పెళ్ళన్నా, పేరంటవన్నా పదిమందీ కలు స్తారు. మొన్న మా కాలనీలో ఓ పెళ్ళి జరిగింది. కాలనీ కాలనీ అంతా పెళ్ళివారమైపోయాం. ఆనందించాం అన్నారు. తప్పనిసరి పరిస్థితుల్లో ఆ కాలనీని విడిచి వస్తున్నాం, లేకపోతే జీవితాంతం అక్కడ ఉండాలనే మా కోరిక అన్నారు. ఈ కాలనీకి వచ్చినా మీకు అలాగే అనిపి స్తుంది, రండి! వెల్‌కం అన్నారు జానకిరావుగారు. థేంక్స్ అని వాళ్ళలా వెళ్ళగానే జానకిరావుగారిని ఇలా చుట్టుముట్టారు మనవలు.

ఎందుకు తాతయ్యా ముందువాళ్ళకి అబద్ధం చెప్పావు? అడిగారు. ఎందుకంటే... నువ్వేమిటో, నీ మనసేమిటో నీ మాటలూ, నీ దృష్టికోణం చెబుతాయి. వాటిని బట్టే మంచిచెడులు నిర్ణయిస్తారు. ముందు వచ్చిన వాళ్ళు మంచివాళ్ళు కాదనిపించారు. దేవుడు మనకి రెండు కళ్ళూ, రెండు చెవులూ ఇచ్చి, నోరు ఒక్కటి మాత్రమే ఎందుకిచ్చాడో తెలుసా? ఎక్కువగా చూడు, ఎక్కువగా విను, తక్కువగా మాట్లాడమని, అని నవ్వారు జానకిరావుగారు. మనవల్ని కూడా నవ్వించారు.




చింతకింది శ్రీనివాసరావుకు అవార్డు అందజేస్తున్న శీలా వీర్రాజు.
చిత్రంలో సుధామ, రఘు, దాసరి అమరేంద్ర, మాడభూషి లలితాదేవి ఉన్నారు.

# చింతకింది శ్రీనివాసరావుకు మాడభూషి రంగాచార్య పురస్కారం

తెలుగు కథది ఎప్పుడూ సమున్నతస్థానమే! నిత్యం ఎన్నో సాహిత్య సంస్థలు ఇతోధిక పురస్కారాలతో తెలుగు కథను గౌరవించుకుంటూనే ఉంటాయి. ఆ కోవలోనే మాడభూషి రంగాచార్య స్మారక కమిటీ పుష్కరకాలంగా ఏటా ఒక కథా రచయితకు కథా పురస్కారం అందజేస్తోంది. 2016 సంవత్సరానికిగాను కథా రచయిత చింతకింది శ్రీనివాసరావు కథా సంపుటి 'కాన్పులదిబ్బ'కు ఈ పురస్కారం లభించింది.

హైదరాబాద్‌లోని ఎమెస్కో బుక్స్ సమావేశ మందిరంలో ఫిబ్రవరి 26 ఆదివారం ఉదయం మాడభూషి రంగాచార్య స్మారక కథా పురస్కార ప్రదానోత్సవం–2016 జరిగింది.

పదివేల రూపాయలు నగదు, జ్ఞాపిక, శాలువాతో పురస్కార విజేత చింతకింది శ్రీనివాసరావును స్మారక కమిటీ అధ్యక్షుడు శీలా వీర్రాజు ఘనంగా సత్కరించారు.

సాహిత్య పిపాసి, కథా రచయిత మాడభూషి రంగాచార్య రైల్వే నేపథ్యంలో అద్భుత కథలు రాశారనీ, లహరి సంస్థ ద్వారా కార్యక్రమాలు చేస్తూ సాహిత్య సేవ చేశారనీ ప్రముఖ రచయిత సుధామ స్వాగతోపన్యాసంలో తెలియజేశారు. రంగాచార్య ఆశయాలు నెరవేర్చేదిశగా ఈ స్మారక కమిటీ త్రైమాసిక సమావేశాల ద్వారా ప్రతి ఏడాదీ వెలువడే తెలుగు కథలను ఎలాంటి దరఖాస్తు ఫారాల లావాదేవీలు లేకుండా స్వచ్ఛందంగా సమీక్షించి ఏటా ఒక ఉత్తమ కథారచయితను ఎంపికచేసి కథాపురస్కారం అందజేస్తోందని వివరించారు సుధామ.

కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కార గ్రహీత సలీమ్, ప్రముఖ కథా రచయిత, నవ్య వారపత్రిక సంపాదకుడు ఎ.ఎన్.జగన్నాథశర్మ, రచయితలు సన్నపురెడ్డి వెంకటరామిరెడ్డి, కాట్రగడ్డ దయానంద్, డాక్టర్ వి.చంద్రశేఖర్ తదితర పన్నెండు మంది ప్రముఖులు ఇప్పటివరకు ఈ పురస్కారాలు అందుకున్నారు. 60 ఏళ్ళలోపు కథా రచయితలకు మాత్రమే ఈ పురస్కారాలను పరిమితం చేశారు.

## స్కూలు పిల్లలకు కథల పోటీలు

భాషా సాహిత్య సేవలందించాలన్న తన భర్త కల నెరవేర్చేందుకే ఇప్పటికి పదమూడేళ్ళుగా ఈ సాహిత్య కార్యక్రమాలు చేస్తున్నట్టు రంగాచార్య సతీమణి శ్రీమతి లలితాదేవి చెప్పారు. ఆమె ఇంకా ఇలా చెప్పారు. 'తెలుగు భాష, భవిష్యత్ రచయితల నైపుణ్యం అడుగంటిపోకుండా వారిని తీర్చిదిద్దేందుకు 2004 నుండి విద్యార్థులకు కథా రచన పోటీలు నిర్వహిస్తున్నాం. ఈ కథా పురస్కారాల్లో ప్రముఖులు చేసిన స్మారక ప్రసంగాలను మూడు పుస్తకాలుగా తెచ్చాం.

స్కూలు పిల్లలకు ఏటా కథలపోటీలు పెట్టి 15 కథలకు బహుమతులు ఇస్తున్నాం. ఇలా ఆరేళ్ళలో వచ్చిన 90 బహుమతి కథల్ని పుస్తకంగా తెచ్చాం. మరో ఆరేళ్ళ కథల పుస్తకం రానున్నది' అని చెప్పారు లలితాదేవి.

'తెలుగు కథ–2016' అనే అంశంపై ప్రముఖ కథా రచయిత దాసరి అమరేంద్ర మాడభూషి రంగాచార్య స్మారక ప్రసంగం చేశారు. యువ కథకుల్లో భాష, సాహిత్య పఠనం కొరవడిందని యంగ్ బ్రిగేడ్ కథల్లో తేటతెల్లమైందన్నారు. కథ ప్రయోజనంపై గురి లేకపోవడం, ఉమ్మడి జీవితాలను చిత్రించకపోవడం లోపాలుగా పేర్కొన్నారు.

'కాన్పుల దిబ్బ' కథా సంపుటిలో పాత్రల ద్వారా రచయిత తన ప్రజాస్వామ్య దృక్పథం, దళిత వైఖరి, వారి ఆత్మగౌరవాన్ని ఆవిష్కరించారని ప్రొఫెసర్ రఘు పుస్తకసమీక్షలో పేర్కొన్నారు.

పద్మశ్రీ పురస్కారానికి కూడా దరఖాస్తు చేసుకోమంటున్న ఈ రోజుల్లో అడక్కుండా పిలిచి, కథా పురస్కారం ఇచ్చిన మాడభూషి స్మారక కథా పురస్కార కమిటీ సాహిత్య సేవలను పురస్కార గ్రహీత చింతకింది శ్రీనివాసరావు ప్రశంసిస్తూ, కృతజ్ఞతలు తెలియజేశారు. పలువురు ప్రముఖ కథా రచయితలు ఈ కార్యక్రమానికి హాజరయ్యారు.

నవ్య

# మెయిల్ బాక్స్

## మొదటిపేజీ తీరే వేరు

సావి వన్, సావి టూ, సావిత్రి అంటూ సాగిన మొదటిపేజీ కథ 'తీరేవేరు' మా హృదయాల్ని కలుక్కుమనిపించింది. అల్ప పదాలతో అనల్ప భావార్థాలు పలికించే మొదటిపేజీ తీరే వేరు. శివశంభో, స్వయంభూ అంటూ వివరించిన శివరాత్రి పర్వదిన ప్రాశస్త్యం మనసు దోచింది. లేటు వయసులో విడాకులు ఆరోగ్యప్రదం అనడం భారతీయతకు విరుద్ధం.

–శాంతిచంద్రిక, సామర్లకోట

## రసరమ్యమైన వీక్లి

మొదటి చివరి పేజీలు ముందుగా చదివించే రీతిలో నవ్య వీక్లీని రసరమ్యంగా మలుస్తున్న సంపాదక వర్గానికి అభినందనలు. మార్నింగ్ కాఫీ శీర్షిక మెదడును తట్టిలేపితే, పదగారడీ, ఇవన్నీ నిజాలే గుర్తుంచుకోవాల్సిన విషయాలను మనసును తట్టిచెప్పింది. మాతృభాషాధ్యయనం అమలుచేసే విధానంలో మెళకువలను రాజశుక చక్కగా వివరించారు.

–డాక్టర్ శివభూషణం, కర్నూలు

## మహాశివరాత్రి విశిష్టత

ఈ వారం ముఖచిత్రం అందంగా, ఆకర్షణీయంగా ఉంది. శివశంభో, స్వయంభూ వ్యాసం మహాశివరాత్రి విశిష్టతను చక్కగా తెలియజేసింది. సంపాదకీయాలు వారం వారం ఆకట్టుకుంటున్నాయి.

–ఎల్.ప్రఫుల్లచంద్ర, ధర్మవరం

## 'సినీవాలి' సీరియల్ లక్కీడిప్ పట్టుచీర అందింది

నేను సినీవాలి సీరియల్ లక్కీడిప్‌లో ఫ్యాన్సీ చీర గెలుచుకున్నాను. కూపన్ 11 లో (జనవరి 11వ తేదీ, 2017) పట్టుచీర పొంది విజేతగా నిలిచాను. నిన్ననే అనగా ఫిబ్రవరి తొమ్మిదవ తేదీన మాకు బహుమతిగా పంపించిన పట్టుచీర మాకు అందినది. నేను, మా కుటుంబం ఎంతో సంతోషించాం. నవ్య వీక్లీ ఒక సాధారణ పాఠకుణ్ణి కూడా గుర్తుపెట్టుకుంటుందనీ, వారిని సముచితంగా గౌరవిస్తుందనీ ఈ బహుమతి ద్వారా ఋజువైంది. మీకు కృతజ్ఞతలు.

–గొట్టాపు దుర్గారావు, ఏలూరు

## శశికళపై రివ్యూ బాగుంది

రివ్యూ శైలి, ఆలోచన బాగుంది. శశికళపై రాసిన రివ్యూ బాగుంది. దీపం ఉండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలనే ఆత్రంతో ఆమె అలా ప్రవర్తించి వుంటుంది. నేను టాప్ పొజిషన్‌లో ఉన్నాననుకునేవాడు తన నాశనానికి తనే శ్రీకారం చుట్టుకుంటాడని కోట శ్రీనివాసరావు చెప్పడం బాగుంది.

–లక్ష్మి, బృందావనం, తూ.గో.జిల్లా

# పండగ చేసుకుందాం!

పిల్లలూ పెద్దలూ తేడా లేకుండా ప్రతి ఒక్కరూ హుషారెత్తి పోయే పండుగ హోలీ. హోలీ అంటే టక్కున గుర్తుకు వచ్చే విషయాల్లో రంగులు చల్లుకోవడం ఒకటి. రంగునీళ్ళను సిద్ధం చేసుకుని ఎప్పుడెప్పుడు ఎవరిమీద చల్లుదామా అనుకుంటూ రోడ్లమీదకు వచ్చేస్తారు. పూర్వం రోజుల్లో హోలీ అంటే మోదుగు పూలకు ప్రత్యేక స్థానం ఉండేది. కాని మారుతున్న కాలాన్ని బట్టి మనకు అందు బాటులో ఉండే వాటికి ప్రాధాన్యం పెరిగింది.

ముఖ్యంగా కృత్రిమ రంగులతో హోలీ ఆడడం వలన వాటిలోని కెమికల్స్ నేత్ర, చర్మ, జీర్ణకోశ సంబంధిత అవయవాలపై ప్రభావం చూపు తాయి. కాబట్టి రంగులు వాడే ముందు అవి సహజ రంగులా, కెమికల్స్ కలిపినవా అని చూసు కుంటే సరిపోతుంది. కెమికల్స్ కలిపిన రంగులు కంటిలో, నోటిలో, చెవుల్లో పడటం వలన శరీరంపై తీవ్ర ప్రభావం చూపుతాయి.

హోలీ రంగుల్లో దుమ్ము, ధూళి ఎక్కువగా ఉండటం వలన కొందరికి ముక్కునుంచి నీరు కారడం, ముక్కు బిగుసుకునిపోయి శ్వాస ఆడక పోవడం, తుమ్ములు రావటం, దగ్గుతో పాటు ఆయాసం రావటం, ఛాతి బరువుగా అనిపించటం, కళ్ళు ఎర్రబడి నీరు కారడం, ఒంటిపై దద్దుర్లు, చర్మం పొడిగా మంటగా అనిపిస్తుంది. అలాగే కలుషిత రంగు నీళ్ళను చల్లుకోవటం వలన నీరు నోట్లోకి పోయి ఉన్నట్లుండి వాంతులు, విరేచనాలు



అవుతుంటాయి. అలాగే నీటిలో ఎక్కువసేపు గడ పటం వలన దగ్గు, జలుబు, జ్వరం, గొంతునొప్పి లాంటివి వస్తాయి. అందుకని నీటిలో ఎక్కువసేపు ఉండకుండా చూసుకోవాలి. సాధ్యమైనంత వరకు కెమికల్స్ కలిపిన రంగులకు దూరంగా ఉంటే మేలు. ప్రకృతిసిద్ధ రంగులే మేలనే విషయం ప్రతి ఒక్కరూ గుర్తుంచుకోవాలి. ఈ సందర్భంగా హోలీ రోజు తీసుకోవాల్సిన జాగ్రత్తలేంటో చూడండి!

1. తడిసిన బట్టలు ఎక్కువ సేపు ఒంటి మీద ఉండటం వలన చర్మవ్యాధులు వస్తాయి. హోలీ అనంతరం తడిసిన బట్టలను వెంటనే మార్చుకోవాలి.
2. హోలీ రంగుల దుమ్ము, ధూళి వలన ఆయాస పడుతున్న వ్యక్తిని వెల్లకిలా పడుకోపెట్టకుండా, తల ఎత్తులో పెట్టి, కూర్చున్న స్థితిలో ఉంచాలి.
3. హోలీ ఆడడానికి వెళ్ళే ముందే స్నానం చేసి వెళ్ళడం మంచిది. అలాగే చర్మానికి నూనె రాసుకుని వెళ్లాలి.
4. సాధ్యమైనంత వరకు రంగు కళ్ళు, ముక్కు, నోట్లోకి వెళ్ళకుండా చూసుకోవాలి. నీటిలో కలి పిన రంగులకన్నా పొడి రంగులను చల్లు కుంటే మేలు. వాటిని త్వరగా శరీరంపై నుంచి తొలగించుకోవచ్చు.
5. కలుషిత రంగునీరు వలన వాంతులు, విరోచ నాలు అవుతున్నప్పుడు ఆ వ్యక్తికి వెంటనే ద్రవపదార్థాలు ఇవ్వాలి. కొబ్బరి నీరు, మంచి నీరు, మజ్జిగ మొదలైనవి ప్రారంభం నుంచి ఇవ్వాలి. డీహైడ్రేషన్ నివారణకు కాచి చల్లా ర్చిన ఒక గ్లాసు నీటిలో రెండు స్పూన్ల పంచ దార, చిటికెడు ఉప్పు కలిపి ఇవ్వాలి. లేదా ఓరల్ రీహైడ్రేషన్ సొల్యూషన్ ఇవ్వాలి.

నవ్య

**మార్చి 8 'మహిళా దినోత్సవం' సందర్భంగా...**

# ఆడదే ఆధారం కథ ఆడనే ఆరంభం

**సమాజంలో ఎంత వివక్ష ఎదురవుతున్నా అన్నింటినీ అధిగమిస్తూ ముందుకే కదులుతోంది మగువ. ఆదిమ కాలం నుంచి ఆధునిక యుగం వరకు తనకంటూ ఒక అస్తిత్వాన్ని నిలుపుకుంది. కడుపులో అండం పిండంగా ప్రాణం పోసుకుని ప్రసవం జరిగే వరకూ వచ్చే మార్పులకు ప్రత్యక్ష సాక్షి ఆమె. ఆమె విజ్ఞానం ముందు ప్రపంచ మేధస్సు కూడా చిన్నబోతుంది. ఒక మగువ జీవితం నుంచి ప్రతీదీ నేర్చుకోదగినదే! సాధికారిత..సమానత్వం దిశగా అడుగులు వేసే మహిళల గురించి ప్రస్తావించే సందర్భం ఇది. నేటికీ మేటి విలువలతో రాణిస్తున్న మహిళామణులు ఎందరో.**



ఇందులో భారతీయ మహిళ కూడా తనకంటూ గుర్తింపు కోసం అహర్నిశలూ కృషిచేస్తూనే ఉంది. విభిన్న రంగాల్లో భారతీయ మహిళలు మేలైన విజయాలు సొంతం చేసుకున్నారు. వారి స్ఫూర్తి రేపటి ఆశతో ముందడుగువేసే నేటి మహిళకి ఆదర్శం. వివక్ష, అసమానతల్లాంటివి వెనక్కిలాగుతున్నా తన జీవన పరిధిని విశాలం చేసుకుంటూ ఉన్నతంగా ఎదుగుతోంది. అడుగులు తడబడుతున్నా, తరుణి పట్టుదలగా ముందుకు సాగిపోతోంది. అంతర్జాతీయ మహిళా దినోత్సవం సందర్భంగా ప్రత్యేక కథనం మీకోసం!

## తగ్గుతున్న ఆడపిల్లలు

*'మీరు ఏదైనా చెప్పాలనుకుంటే మగవాళ్లను అడగండి. కానీ మీరేదైనా చెయ్యాలనుకుంటే మాత్రం ఆడవాళ్లని అడగండి.'*

-మార్గరెట్ థాచర్

మగవారితో పోలిస్తే ఆడవారు భవిష్యత్తు గురించి మరింత గొప్పగా ఆలోచించగలరని అనేక సర్వేలు చెబుతున్నాయి. అలాంటి ఆడవాళ్ళ సంఖ్య ఇప్పటికాలంలో తగ్గుతోంది. ఆడపిల్లల సంఖ్య తగ్గుముఖం పట్టడం సమాజంలో ఆందోళన కలిగిస్తోంది. ఆడపిల్ల అనగానే అబార్షన్స్ చేసుకునే వారి సంఖ్య పెరుగుతోంది. దక్షిణాది రాష్ట్రాల్లో ఈ వివక్ష ఎక్కువగా ఉంది. ఫలితంగా అక్కడ ఆడపిల్లలు పూర్తిగా తగ్గిపోయి, పెళ్ళికూతురు దొరక్క మగవారు అవివాహితులుగానే ఉంటున్నారు. ప్రతి వెయ్యి మంది అబ్బాయిలకి 886 మంది అమ్మాయిలు ఉన్నారు. గడచిన పదేళ్లలో ఈ సంఖ్య కేవలం 24మాత్రమే పెరిగింది. ఇలా ఆడపిల్లల సంఖ్య తగ్గుముఖం పడితే భవిష్యత్తు ఆందోళనగా మారుతుందని అనేక సర్వేలు చెబుతున్నాయి.

## పురుషులదే పైచేయి

తెలుగు రాష్ట్రాల్లో పురుషులదే పై చేయి. చదువుండీ, డబ్బులున్నా స్వేచ్ఛమాత్రం ఉండట్లేదని తెలుగింటి ఆడపడుచు వాపోతోంది. ఇంటి నుంచి బయటకు వెళ్ళాలన్నా, నచ్చింది వండుకు తినాలన్నా భర్తగారు ఓకే చెప్పాల్సిందేనట. మాతో పోలిస్తే వందేళ్ళ కిందటి మహిళలకే ఎక్కువ స్వేచ్ఛ ఉంది అని మహిళలు వాపోతున్నారు. స్వేచ్ఛ ఇప్పుడు తగ్గిందంటున్నారు. ఈ విషయాలన్నీ ఓ సర్వే ద్వారా వెల్లడయ్యాయి. ముఖ్యంగా తెలుగు రాష్ట్రాల్లో ఆసుపత్రికి వెళ్ళాలన్నా ఇంట్లో పెద్దలకు చెప్పి వెళ్ళాల్సిందేనని 88 శాతం మంది మహిళలు పేర్కొన్నారు. చివరకు ఏది వండాలో కూడా పురుషులే నిర్ణయిస్తున్నారని 62 శాతం తెలుగు మహిళలు అభిప్రాయపడుతున్నారు. కాగా బాలికల లింగ నిష్పత్తి, అక్షరాస్యత పెరిగినా మహిళా స్వేచ్ఛ విషయంలో ఆశించినంత మార్పు లేదని నిపుణులు చెబుతున్నారు. ఇప్పటికీ చాలా విషయాల్లో మహిళలకు స్వేచ్ఛ అంతంత మాత్రంగానే ఉంటోందని వివరిస్తున్నారు. దేశంమొత్తం మీద 65 శాతం మహిళలు చదువుకోగా.. భర్తను ఎంపిక చేసుకోగలిగేంత స్వేచ్ఛ కేవలం అయిదు శాతం మందికి మాత్రమే ఉంది. 2005, 2012లో మేరీలాండ్ విశ్వవిద్యాలయం, జాతీయ అనువర్తిత ఆర్థిక పరిశోధనా మండలి (ఎన్.సి.ఎ.ఇ.ఆర్) సంయుక్తంగా జరిపిన భారత మానవ అభివృద్ధి సర్వేలు పరిశీలిస్తే ఈ వివరాలు స్పష్టమయ్యాయి. దేశవ్యాప్తంగా అన్ని రాష్ట్రాలు, నగరాలు, కొన్ని గ్రామీణ ప్రాంతాల్లో 34 వేలమంది మహిళలను ప్రశ్నించి ఈ సర్వే నిర్వహించారు. 15 – 81 ఏళ్ళ మధ్య వయసున్న మహిళలు ఈ సర్వేలో పాల్గొన్నారు. 79.8 శాతం మహిళలు పరిస్థితి దారుణంగా ఉన్నట్లు తెలిపారు. ఆసుపత్రికి

## మహిళాదినోత్సవ నేపథ్యం

అంతర్జాతీయ మహిళా దినోత్సవానికి చారిత్రక నేపథ్యం ఉంది. గడచిన 103 సంవత్సరాలుగా (1914 నుండి) ఏటా మార్చి 8వ తేదీన మహిళా దినోత్సవం నిర్వహిస్తున్నారు. మహిళా సాధికారత కోసం ఏర్పాటు చేసుకున్న రోజు మార్చి 8. వివక్షకు వ్యతిరేకంగా, పౌర హక్కుల సాధన, ఓటు హక్కు కోసం మహిళలు ప్రత్యేకంగా నిర్ణయించుకున్న రోజు. వివక్ష, పీడన నుంచి విముక్తి కల్పించాలంటూ మహిళలు నినదించిన రోజు. అయితే అంతకు ముందు కూడా మహిళా దినోత్సవం లేకపోలేదు. పలు దేశాల్లో వివిధ తేదీల్లో మహిళా దినోత్సవం జరుపుకునేవారు. మహిళలు ఎదుర్కొంటున్న వివక్షకు వ్యతిరేకంగా కొన్ని దేశాల్లో సివిల్ అవేర్‌నెస్ డే చేస్తే, మరికొన్ని దేశాల్లో యాంటీ సెక్సిజం డే, ఇంకొన్ని దేశాల్లో వివక్ష వ్యతిరేక దినోత్సవం, యాంటీ డిస్క్రిమినేషన్ డే.. ఇలా వివిధ రకాల పేర్లతో చేసేవారు. వేతనాల్లో అసమానతలకు వ్యతిరేకంగా 1908లో ఇంటర్నేషనల్ లేడీస్ గార్మెంట్ వర్కర్స్ యూనియన్ ఆధ్వర్యంలో అమెరికాలో సమ్మె జరిగింది. దీనిని మరచిపోకుండా 1909 ఫిబ్రవరి 28న న్యూయార్క్‌లో అమెరికా సోషలిస్ట్ పార్టీ ఆధ్వర్యంలో మహిళా దినోత్సవం నిర్వహించారు. 1910 ఆగస్టులో డెన్మార్క్ రాజధాని కోపెన్ హాగన్‌లో అంతర్జాతీయ మహిళా మహాసభ నిర్వహించారు. ఆ మరుసటి ఏడాదే 1911 మార్చి 19న అంతర్జాతీయ మహిళా దినోత్సవం పాటించారు. అప్పటికి కొన్ని దేశాల్లో మహిళలకు ఓటుహక్కు లేదు. పురుషులతో సమానంగా తమకూ ఓటుహక్కు కావాలని మహిళలు నినదించారు. అయితే అమెరికన్లు మాత్రం చాలా కాలం పాటు ఫిబ్రవరి చివరి ఆదివారం జాతీయ మహిళా దినోత్సవంగా పాటించేవారు. 1913 చివరి శనివారం రష్యన్లు అంతర్జాతీయ మహిళా దినోత్సవం చేశారు. 1914కు పూర్వం మార్చి 8వ తేదీని అంతర్జాతీయ మహిళా దినోత్సవంగా పాటించిన సందర్భాలు లేవు. కానీ ఇప్పుడు మాత్రం ఏటా మార్చి 8వ తేదీనే ఇంటర్నేషనల్ ఉమెన్స్ డే చేస్తున్నారు. వివక్షకు వ్యతిరేకంగా 1914 మార్చి 8న లండన్ ట్రఫాల్గర్ స్క్వేర్‌లో మహిళలు భారీ ప్రదర్శన నిర్వహించాక ఎక్కువ దేశాల్లో ఆదే రోజును



అంతర్జాతీయ మహిళా దినోత్సవంగా పాటించడం ప్రారంభించారు. 1977లో ఐక్యరాజ్యసమితి సర్వ ప్రతినిధిసభ మార్చి 8వ తేదీని అంతర్జాతీయ మహిళా దినోత్సవంగా ప్రకటించే వరకు వివిధ దేశాల్లో పలు తేదీల్లో దీనిని జరుపుకునేవారు. ఐక్యరాజ్యసమితి ప్రకటన తర్వాత నుంచే అంతర్జాతీయ మహిళా దినోత్సవానికి ప్రత్యేక గుర్తింపు వచ్చింది.

వెళ్ళాలన్నా ఇంట్లో అనుమతి తప్పనిసరిగా తీసుకోవాల్సిందేనని వివరించారు. 2005లో ఈ శాతం 74.2గా ఉంది. అంటే.. ఇప్పుడు అదనంగా 5శాతం మంది మహిళలు.. పెద్దలకు చెప్పకుండా ఆసుపత్రికి వెళ్ళే స్వేచ్ఛ కూడా లేదని స్పష్టం చేశారు.

### భాగస్వామి ఎంపికలోనూ అంతే!

ఎందరో మహిళల అసమాన ప్రతిభాపాటవాలు విజ్ఞాన వెలుగులై నింగికెగుస్తున్నాయి. శాస్త్ర సాంకేతికాభివృద్ధిలో మహిళా భాగస్వామ్యం అన్ని రంగాల్లో ప్రస్ఫుటంగా కన్పిస్తోంది. ఒంటరిగా బయటకు వెళ్ళడానికి సంకోచించే మహిళలు నేడు ధైర్యంగా అడుగులు వేస్తున్నారు. సామాజిక మాధ్యమాల్లోనూ తమ స్వేచ్ఛాస్వరాలు బలంగా వినిపిస్తున్నారు. కొన్నిసార్లు ఆంక్షల కంచె దాటుకుని దూసుకుపోతున్నారు. సామాజిక సమానత దిశగా తమ గమనం కొనసాగిస్తున్నారు. అయినప్పటికీ ఇంకా కొన్ని విషయాల్లో స్వేచ్ఛ లేదు మగువలకు.

## తగ్గుతున్న మహిళా శ్రామికులు

మనదేశ శ్రామికుల్లో మహిళల శాతం రోజు రోజుకూ పడిపోతున్నది! ప్రపంచంలోనే అత్యధిక జనాభాగల భారతదేశంలో మహిళా శ్రామికులు తగ్గుతుండడం ఆందోళన కలిగిస్తున్నది. ప్రపంచ వ్యాప్తంగా మహిళా శ్రామికులపై వరల్డ్ బ్యాంక్



చేసిన సర్వే నివేదిక ప్రకారం, మనదేశ శ్రామికుల్లో కేవలం 27% మాత్రమే మహిళలున్నారు. ప్రపంచ వ్యాప్తంగా ఈ సంఖ్య 50%. ప్రపంచం మొత్తం మీద టాంజానియాలో 88% మహిళా శ్రామికులు ఉన్నారు. సిరియాలో అత్యల్పంగా 14% మాత్రమే ఏదో ఒక పని చేస్తుండగా, భారత్ మహిళా శ్రామికుల్లో అత్యధికంగా 63% వ్యవసాయ కూలీలే.

ఇంటికి కూతవేటు దూరంలోని పొలాల్లో పని చేయడమే వారికి ఎంతో సురక్షితంగా ఉంటున్నది. ప్రతి ఐదుగురిలో ఒక్కరు మాత్రమే వ్యవసాయేతర పని చేస్తున్నారు. అందులో అత్యల్పంగా కేవలం 1% మాత్రమే రవాణా వ్యవస్థకు సంబంధించిన ఉద్యోగాల్లో ఉన్నారు. ప్రతి ముగ్గురు మహిళా ఉద్యోగుల్లో ఒకరు చైన్‌ఫుడ్ పనుల్లో ఉంటున్నారు. ఫుడ్ సర్వీస్ సంస్థల్లో పనిచేస్తున్నవారి సంఖ్య కేవలం 14% ఉండగా సంస్థలు, పరిశ్రమల్లో శ్రమ చేస్తున్న మహిళలు 30% ఉన్నారు. అమెరికాలోని కొన్ని ఆహార సంస్థలు మాత్రమే మహిళలకు సురక్షితమైన పని ప్రదేశాలుగా ఉన్నాయి. ఆడవాళ్లకు అనుకూలమైన పని వేళలు పాటిస్తూ, ఆత్మరక్షణ తరగతులు నిర్వహిస్తూ తమ సంస్థల్లో మరింతమంది మహిళలు చేరేలా ఈ సంస్థలు ప్రోత్సహిస్తున్నాయి.

73 శాతం మహిళల జీవిత భాగస్వాములను తల్లిదండ్రులు, బంధువులు కలిసి ఎంపిక చేస్తారని, అయిదు శాతం మహిళలు మాత్రమే స్వయంగా భాగస్వామిని ఎంచుకుంటున్నారనీ నివేదిక పేర్కొంది. అయితే పురుషులకు సంబంధించి ఇలాంటి సర్వే నిర్వహించలేదు. దేశంలోని ఇతర ప్రాంతాలతో పోల్చితే ఈశాన్య రాష్ట్రాల మహిళలకు జీవిత భాగస్వామిని ఎంపిక చేసుకోవడంలో స్వేచ్ఛ ఎక్కువ. ఉత్తరాది మహిళలకు ఈ విషయంలో స్వేచ్ఛ చాలా తక్కువ. మొత్తంమీద దేశంలో 80 శాతం స్త్రీలు ఇంటి నుంచి బయటకు వెళ్ళాలంటే భర్త అనుమతి ఉండాల్సిందేనని అనుకుంటున్నారు. వీరిలో 79.94 శాతం మంది అత్తల అనుమతి కూడా కావాలని చెప్తుండగా.. 79.89 శాతం మంది మావయ్య అనుమతీ ఉండాల్సిందే అంటున్నారు. అంటే మొత్తం మీద దాదాపు 80 శాతం మహిళలు బయటకు వెళ్ళాలంటే ఇంట్లో భర్త, అత్తమామలకు చెప్పి వెళ్ళాల్సిందే. ఇంటి పక్కన ఉండే కిరాణా దుకాణానికి వెళ్ళాలన్నా.. పెద్దల అనుమతి ఉండాలని 58 శాతం మంది చెప్పారు. 2005లో ఇలా అభిప్రాయపడిన వారు 44.8 శాతం మందే.

శాస్త్ర సాంకేతిక, సమాచార రంగాలు అభివృద్ధి చెందుతున్న తరుణంలో స్త్రీ, పురుషులు ఇద్దరూ విద్యాధికులే. ఇద్దరూ సమానమే అంటున్నారు కానీ కొన్ని చోట్ల ఇంకా స్త్రీకి చిన్నచూపే ఉందని అంగీకరించాల్సిందే. విద్యాభ్యాసం నుంచి పెళ్ళివరకు ఎక్కడో ఒకచోట ప్రతి మహిళ ఈ వివక్ష ఎదుర్కొంటూనే ఉన్నారు. అంతర్జాతీయంగా ఎందరో మహిళలు ఉన్నత స్థానాలకు చేరినా, చాలావరకూ సమాజంలో ఎంతో స్ఫూర్తి నింపుతున్నా ఇంకా మార్పు రావాల్సిన అవసరం ఉంది.

–నివేదిత



# థేమ్సువద్దు గోదావరే ముద్దు

ఓ. ఆర్. ఇంద్ర

**“వెట్టి వేయి విధంబులు, వేయి ఊడల దెయ్యాల మట్టిలాగ!”**

**అని వాక్రుచ్చిన ఆ మహాజ్ఞాని ఎవడోగాని అతగాణ్ణి వెదకి పట్టుకుని వాటేసుకుని తెగ ముద్దులెట్టుకోవాలి అర్జంటుగా అనిపిస్తోంది.**

**“నా (వెర్రి) గురించేనా నువ్వంటున్నది?” అని కనుబొమలు ముడేస్తున్నారా? అబ్బే, మీ గురించి ఎందుకంటానండీ బాబూ. ఉన్నమాట అయినప్పటికీ ఆ మాట పైకి అంటే ఎవరూరు కుంటారు చెప్పండి. మీదపడి మురికి చేతుల్తో పీక పట్టుకుని పిసికెయ్యరూ? నిజాలు భరించే నిజాయితీ ఈ లోకానికి ఎప్పుడేడ్చి చచ్చింది గనక!**

నేను ప్రస్తావించేది ఆవిడగారి వెర్రి గురించే! అదీ ఆవిడ తన తడిమడి బట్టలు ఆరేసుకునేందుకు సహారా ఎడారంత మా దొడ్లో సుదూరంగా ఉంది కాబట్టీ, అంతదూరం నా ప్రస్తావన ఆవిడ గారికి వినిపించే అవకాశం లేదు కాబట్టీ, ఏదో సమయం సందర్భం కలిసొచ్చాయని ఆవిడగారి వెర్రితనం తెచ్చిపెట్టే నా ఇబ్బందుల గురించి కొంచెం మీతో ప్రస్తావిస్తున్నాను కాబట్టీగానీ, ఆవిడ గారికి వినిపించేలా చెప్పి ఆవిడ చేత పీక పిసికించుకునేటంత వెర్రివాణ్ణా యేమిటి? అయినా ఏ మాటకామాటే చెప్పుకోవాలి. ఎప్పుడైనా పొరబాటునో లేక నా గ్రహబాటునో ఆవిడగారి వేపకాయంత (తాటికాయంత అంటే మరీ బావోదు గదా) వెర్రితనం గురించి పిసరంత మాట జారానో, ఇక నా పని అంతే! లేచి మీదకెగిరి పీక పట్టుకునే చిరుతలా నా పీక పట్టుకుని చిరుతగోళ్లకన్నా పదునైన తన పది గోళ్లతో నా గొంతు బిగించి ఈ చివర్న గుచ్చితే ఆ చివర్లోంచి బయటకు వచ్చేలా మహా కసిగా, “యేం మీకు లేదా వెర్రి, మీ వాళ్ళందరికీ లేదా వెర్రి” అంటూ ఆగ్రహంతో ఊగిపోతూ గుచ్చుతుంది! తాడు తెగేవరకూ మాత్రం గుచ్చదు లెండి, తెగేవరకూ గుచ్చితే నష్టపోయేది తన మాంగల్యాన్నే, తన ముత్తైదువతనాన్నేగా అనే స్పృహతో కాబోలు! పీక పిసికితే పిసికిందిలెండి. అదేం విచిత్రమో గానీ ఆ సమయంలో నాకెక్కడా లేని కితకితలు నా మెడమీదే కాపురం చేస్తాయ్! సరస సమయాలలో దంపతులు గోళ్లతో పరస్పరం ఎక్కడెక్కడ యెలా గుచ్చుకోవచ్చో వాత్సాయన మహర్షి వివరంగానే చెప్పాడుగానీ గొంతులో కూడా గుచ్చొచ్చని ఆయనకి తెలీదు. ప్రాక్టికల్ నాలెడ్జ్ లేని ఘోటక బ్రహ్మచారి సన్నాసి కదా, ఆయనకేం తెలుసు గుచ్చడాలూ, కచ్చడాలూ గురించి.

విషయం దారి తప్పుతున్నట్టుంది బడా(యి) బాబుల పాలన గాడి తప్పుతున్నట్టు. వెర్రి వెయ్యి విధాల గురించి కదా ప్రస్తావిస్తున్నాను. లేకపోతే చూడండి ఆవిడగారి వెర్రితనం! ఒకటా, రెండా. ఏకంగా ఐదొందలొక్క కొబ్బరికాయలు కొడతాను నువ్వుగానీ నా (గొంతెమ్మ) కోరిక నెరవేరిస్తే అని, అయినవిల్లి విఘ్నేశ్వరుడికి మొక్కుకుంది (ట)! ఆ మొక్కులేవో మొక్కడానికి ముందుగానీ, కనీసం ఆ తర్వాతగానీ ఆ మొక్కు భారాన్ని మోసే మొగుడికి ఓ మాట చెప్పాలని, మాట వరసకైనా ఆవిడగారికి తోచదు. సగం కాశ్మీరం పాకిస్తాన్ వాడి చేతుల్లోకి,

సగం పైనా వాడి చేతుల్లోకి అప్పనంగా పోయినట్టు నా జీవితమూ, జీతమూ ఆవిడగారి చేతుల్లోకి ఏనాడో వెళ్ళిపోయాక మొక్కుల గురించి మొగుడికి చెప్పాల్సిన అవసరం ఆవిడకెందుకు ఉంటుంది లెండి. చెప్తే నే కాదంటానా? కాదంటే మాత్రం నా మాట చెల్లుతుందా? కాదని, ఉన్న పెసరబద్దంత గౌరవమూ పోగొట్టుకోవడం తప్ప యేం లాభం? అయినా తెల్లారగట్ల లేచింది మొదలు అర్ధరాత్రి వరకూ మనకోసమే నడ్డివిరిగే గొడ్డు చాకిరీ ఉచితంగా చేసే ఆడకూతుర్లపట్ల కృతజ్ఞతాభావం మగజాతికి ఉండొద్దూ? అందుకే ఆవిడగారు యెడ్డెమంటే మనమూ మనసులో ఎంత తెడ్డెమనుకున్నా పైకిమాత్రం ఆవిడతో బాటు కోరస్‌గా ఎడ్డెమే అనడం కన్నా ఆవిడపట్ల చూపే గొప్ప కృతజ్ఞత ఏముంటుంది చెప్పండి! ఈ సీక్రెట్ తెలిసిన సంసారాలే సజావుగా సాగుతాయని నా గొప్ప నమ్మకమూ, స్వీయానుభవమున్నూ కూడా. అందుకే, ఐదొందలలొక్క కొబ్బరికాయలకెంతవుతుందో, అవన్నీ అయినవిల్లి మోసుకెళ్ళి మొక్కు తీర్చుకురావడానికి ఎంతవుతుందో, నా నెల పెన్షనంతా మొక్కుకే సరిపోకపోతే నెలంతా గడిచేదెలాగో అని లోపల్లోపల ఎంత దేవేస్తున్నా, ఆ దిగులు తొక్కిపట్టి "ఆ...! మొక్కేగా, దానికేం భాగ్యం, అలాగే కానిద్దాం, మొక్కుకుని మంచి పన్చేశావోయ్ యోగ్యురాలా!" అని సర్టిఫికెటు కూడా ఇచ్చేశాను. అంతే తప్ప "ఈ మొక్కుల పిచ్చేవిటి తారాజువ్వల్ని వదిలినట్టు మంగళయాన్ ఉపగ్రహాల రాకెట్లు వదుల్తున్న ఈ కాలంలో" అన్లేదు. యేం, మూఢనమ్మకాలూ, సైన్స్ టెక్నాలజీలూ కలిసి కాపురం చెయ్యకూడదా యేమిటి? నేరగాళ్ళూ, పాలక ప్రభువులూ కలిసి కాపురం చేస్తున్నట్టు.

అయినా తెల్లారి లేస్తే ఆడవాళ్ళు ఎందుకెందుకో రోజూ నూటొక్క మొక్కులు మొక్కుకుంటారు. వేలూ లక్షలూ, కట్నాలూ కానుకలూ దోసిట్లో పోసి కొనుక్కున్న బొడ్రాయి లాంటి మొగుళ్ళవల్లా, కోట్ల ఖర్చుతో ఓట్లు తగలేసి ఎన్నుకుని నెత్తికెక్కించుకున్నాక ములుగర్రతో పొడిచినా నడవని ఎద్దు

> **అందరి పిల్లల్లాగే తన కొడుకు కూడా విదేశాలకు వెళ్ళాలని వెయ్యి మొక్కులు మొక్కుకుంది ఆ తల్లి. అందుకు విరుద్ధం ఆ తండ్రి. ఎట్టకేలకు ఆ కొడుకు లండన్ చేరుకున్నాడు. తెగ సంతోషపడిపోయిందా తల్లి. అమ్మకీ, నాన్నకీ వీసాలు సిద్ధం చేశాడు. లండన్ వెళుతున్నానని ఆ తల్లి సంబరంగా ఊరంతా చాటింపు వేసి చెప్పుకుంది. మరి ఇంతకూ ఆమె లండన్ వెళ్ళిందా? లేదా?**

ల్లాంటి మొద్దులవల్లా తమ అవసరాలూ, ఆశలూ ఎటూ తీరవని తెలిసే కాబోలు, మనిషి జన్మెత్తి మనుషుల్ని నమ్ముకోవడం కన్నా దేవుళ్ళని నమ్ముకోవడమే బెటర్ అనుకుని, మొక్కులబాట పడతారేమో పాపం ఈ ఆడకూతుళ్ళు అని మనసులోనే అనుకుంటాను.

ఇంతకీ నాకూ చెప్పని ఆవిడగారి మొక్కు దేని గురించి అంటారా? ఆవిడ చెప్పకపోయినా ఆవిడగారి వెర్రితనంతో ఒద్దిగా బుద్ధిగా కాపురం చేస్తున్న వాణ్ణి ఆమాత్రం గ్రహించలేనా? "ముందొచ్చిన చెవులకన్నా, వెనకొచ్చిన కొమ్ములు వాడి" అన్నట్టు మనుషుల్ని ఆలోచింపజేసి చైతన్యవంతులుగా చేసే సామాజిక శాస్త్రాలు, చరిత్ర, సాహిత్యాధ్యయనం వంటి చదువుల్ని డస్ట్‌బిన్‌లో పారేసి, యువతని రోబోలుగా మార్చే కంప్యూటర్లు, సాఫ్ట్‌వేర్ చదువులొచ్చి పెట్రేగిపోతున్న ఈ మధ్యకాలంలో ఇరుగు పొరుగమ్మల కబుర్లలో మా పెద్దబ్బాయ్ అమెరికా వెళ్ళాడు, చిన్నోడు ఆస్ట్రేలియా వెళ్ళాడు. కొడుకూ (కూతురూ) అల్లుడూ కెనడాలో ఉన్నారు అంటూ మహాతిశయంతో బడాయి కబుర్లు చెప్పుకోవడం వినీ వినీ చెవులూ మెదడూ చిల్లులుపడి ఆ ఫారిన్ వెర్రి వైరస్ ఈవిడగారికీ నరనరానా పాకి, నా కొడుకు ఎప్పుడు ఫారిన్ వెడతాడో, నా కొడుకూ అమెరికాలోనే ఉన్నాడమ్మా అని గొప్పగా చెప్పుకునే రోజు ఎప్పుడొస్తుందో అని మహ ఇదైపోవడం మొదలు పెట్టింది. ఇదిగో ఇదీ ఆవిడగారి తాజా అయినవిల్లి మొక్కుకి మూలకారణం అని ఘంటాపథంగా చెప్పగలను. వాళ్ళ మొక్కుల గురించి ఎలాంటి నమ్మకాల్లేని నాలాంటి మొగుళ్ళకి చెప్పడం అంటే, పిల్లిని చంకనేసుకుని తీర్థయాత్రలకి వెళ్ళినట్లే అని ఆవిడగారు భావించడం వల్ల తన మొక్కుల గురించి నాకు చెప్పదుగాక చెప్పదు. మరి నాకు ఎప్పుడు తెలుస్తుంది అంటారా? 'యేవయ్యోవ్, ఇదిగో ఈ కొబ్బరికాయల బస్తా కాస్త భుజాన్నెత్తుకుని గుడికి పద' అన్నప్పుడు తెలవక చస్తుందా అంట.

పుత్రరత్నానికి ఐటీలో ఉద్యోగం వచ్చిన రోజు నుంచే (అది కూడా అప్పులు చేసి తిప్పలు పడి



## రకూల్ ఫ్యామిలీ ప్యాక్

ప్రస్తుతం రకూల్ చేతిలో తెలుగు సినిమాలు లేవనీ, రకూల్ పని అయిపోయిందనీ ఇలా చాలా వార్తలు హల్‌చల్ చేశాయి. అయితే అవన్నీ అబద్ధం అని తేలిపోయింది అంటున్నారు సినీ జనాలు. రకూల్ భారీ బడ్జెట్ లేదా పెద్ద హీరోల సినిమాలు మాత్రమే ఒప్పుకుంటోందట. చిన్న సినిమాలు, చిన్న హీరోల సినిమాలకు ఓకే చెప్పడం లేదట! టాలీవుడ్‌లో మెగా హీరో లందరితో సినిమాలు చేసిన రకూల్ కన్ను ఇప్పుడు కోలీవుడ్‌లో సూర్య, కార్తీల మీద పడింది. అక్కడ కార్తీతో ఓ భారీ బడ్జెట్ సినిమా చేస్తోంది. అలాగే సూర్యతో కూడా ఓ సినిమాకి ఓకే చెప్పింది. ఈ రెండింటిలో ఏ సినిమా హిట్టు అయినా రకూల్ కోలీవుడ్‌లో జెండా పాతడం ఖాయం అంటున్నారు. కోలీవుడ్‌లో ఇద్దరు పెద్ద హీరోలతో చేస్తోంది కనుకే ఎక్కడా చిన్న హీరోల సినిమాలకి ఓకే చెప్పడం లేదనీ, డేట్లు లేవని తప్పించుకుంటోందనీ అంటున్నారు. పెద్ద హీరోలకు డేట్లు ఇస్తుంది కానీ చిన్న హీరోలకు మాత్రం డేట్లు కుదరవంటోందట! మొత్తానికి రకూల్ ఫ్యామిలీ ప్యాక్ సినిమాలే చేస్తోంది.

నేను చదివించడం వల్ల కాక తన మొక్కులవల్లే వచ్చిందని ఆవిడగారి ప్రగాఢ విశ్వాసం లెండి. కాదనడానికి నేనెవర్ని. అవునంటే పోలా!) కొడుకుని అమెరికానో, ఆస్ట్రేలియానో ఎప్పుడు వెడతావురా అని ఆవిడగారు అడగటమూ, దానికి వాడు అన్నప్రాసన రోజునే ఆవకాయ అన్నం పెట్టినట్టు అలా పంపరే అమ్మా, కొన్నాళ్ళయినా ఇండియాలో చేయాలే అనడమూ జరిగేది. ఆవిడగారు, “పిచ్చి సన్నాసీ! అయినవిల్లి విఘ్నేశ్వరుడు తల్చుకుంటే అదెంతసేపురా నాన్నా. ఆ స్వామికి మొక్కుకుంటే ఆయనే అమెరికా వాడికల్లోకి వచ్చి నీకు ఆర్డర్స్ పంపమని ఆర్డరేయడూ! మొక్కులవల్ల తీరని కోరికలేం ఉంటాయిరా” అనడం నిత్యకృత్యమైపోయింది.

ఎంత పవర్‌ఫుల్ విఘ్నేశ్వరస్వామివారికైనా, ఈవిడలాగే ఈవిడకన్నా చాలా ముందుగా ఇలా మొక్కుకున్న భక్తురాళ్ళ మొక్కుల్ని సెటిల్ చేశాకగానీ ఈవిడగారి మొక్కుని పరిశీలించలేడు గదా. అందుకు టైం పడుతుంది మరి. దేవుళ్ళయినా కాలం చేతుల్లో బందీలేగా. అందుకే ఈవిడగారి మొక్కుమీద ఓకే, గ్రాంటెడ్ అని ముద్రేయడానికి అయినవిల్లి స్వామివారికి ఐదేళ్ళు పట్టింది. ఐటీలో అయిదేళ్ళ సీనియారిటీకి ఏ దేవుళ్ళ ఆసరా, ఆశీస్సులూ అవసరం లేకుండానే ఫారిన్ ఛాన్స్ వస్తుందనే భౌతిక వాస్తవాన్ని చెప్పి ఆవిడగారి మొక్కుల మహిమల్ని తక్కువ చేయడం మనకి తగదు అని గమ్మునుండిపోయా. అలా మా సుపుత్రుడు మాతృశ్రీ మొక్కులబలంతో అయినవిల్లివారి ఆశీస్సులతో లండన్ ఆఫీస్‌కి డెప్యుటేషన్ ఆర్డర్స్ అందుకుని ఝూం ఝూమ్మంటూ లండన్ విమానం ఎక్కాడు. సైబరాబాద్, బెంగుళూర్, పూనే, ముంబై, ఢిల్లీలాంటి పెద్ద పల్లెటూళ్ళలో ఎన్నాళ్ళు పని చేసినా రాని ఫారిన్ రిటర్న్‌డ్ అనే స్టాంపు పక్షం రోజులు ఫారిన్‌లో పన్చేసినా సరిపోతుందిగా. అలా ఆ ఫారిన్ స్టాంపు హోల్డర్స్ (పూర్వం భుజకీర్తులనేవాళ్ళు లెండి పోలీసు, మిలట్రీ అధికారుల భుజాలమీది లావాటి ఎర్ర మొలతాళ్ళులాగ) ఆ స్టాంపు వేయించుకో(లే)నివాళ్ళని, ఐఏఎస్ ఆఫీసర్లు నాన్ ఐఏఎస్ ఆఫీసర్లని చులకనగా చూసినట్టు చూస్తారట (గదా)! కొడుక్కిమొలి(పిం)చిన భుజకీర్తుల్ని చూసి ఆవిడ సంబరానికి అంతే లేదు. కానీ ఎందుకో వాడు లండన్ వెళ్ళడం నాకేమీ పెద్ద గొప్పగా అనిపించలేదు.

నా చిన్నప్పుడు లండన్ వెళ్ళడం అంటే అర్థమే వేరు. కొంపలో మరుగుదొడ్డి సౌకర్యం లేకపోవడం వల్ల పొద్దుటే సత్తు చెంబట్టుకుని ఊరి చివర కాలవగట్లకో (ఆ కాలవ నీళ్ళే తాగడానిక్కూడా), చెరువు గట్ల మీది తుప్పల్లోకో బహిర్భూమికి పోవాల్సి వచ్చేది. దాన్నే లండన్‌కి వెళ్ళి రావడం అనేవాళ్ళు. అలా మేమందరమూ రోజూ లండన్ వెళ్ళి వచ్చేవాళ్ళం. స్కూల్లో క్లాసులో ఏ కుర్రవెధవైనా గ్యాస్ వదిల్తే ఈ వెధవ ఈ రోజు లండన్‌కి వెళ్ళలేదు కాబోలు అనుకుంటూ ముక్కులు మూసుకుని చీదరించుకుంటూ దూరంగా పోయేవాళ్ళం. ఏలినవారి దయవల్ల దేశంలో ముప్పాతిక శాతం దరిద్రనారాయణులు ఈనాటికీ లండన్ సంస్కృతిని కాపాడుకుంటూ రావడం మన అందరికీ గర్వకారణం. కొడుకు లండన్లో ఉద్యోగం వెలగబెడుతున్న వైనాన్ని ఇరుగమ్మలకీ పొరుగమ్మలకీ బంధుగణాలకే కాక పాలు పోసే అతనికి, కిరాణా షాపువాడికి, రోజూ వచ్చే కూరలబ్బీకి, పోస్ట్‌మేన్ వగైరాలకీ వైనవైనాలుగా చెప్పింది. ఈరోజు ఇంకా ఎవరికి చెప్పాలబ్బా అనుకుంటుంది. నేను అలా డప్పు కొట్టుకోనని ఆమెకి కోపం కూడా. కొవ్వూరు దాటని మనిషికి లండన్ అంటే ఏం తెలుస్తుందిలే. కొడుకు లండన్ వెళ్ళాడనే సంబరమే లేదీ రాచ్చిప్పకి అని పిల్లిమీదా, కాకిమీదా పెట్టి అంటూ ఉంటుంది.

ఇక వాడు తల్లికి తరచూ స్కైప్‌లో కనిపిస్తూ లండన్ వింతలు, విశేషాలు, విడ్డూరాలు వివరించి చెబుతూండటం, ఆవిడ మురిసిపోతూండటం నా చెవుల పడ్తూనే ఉండేవి. “ఢిల్లీ యమునానది ఒడ్డునా, మన రాజమండ్రి గోదావరినది ఒడ్డునా ఉన్నట్లు లండన్ మహానగరం థేమ్సు నది ఒడ్డున ఉందే అమ్మా. ఇంగ్లాడులోకెల్లా పెద్ద నది ఇదే. మన గోదావరి గట్టు పొడవునా చెత్తా చెదారం అశుద్ధాల్తో కంపు కొడుతున్నట్టు కాలుష్యాలతో ఉండదులే థేమ్సు నది. చాలా పరిశుభ్రంగా ఉంటుందిలే. మన గోదావరి నీళ్ళు కాచి వడగొట్టకుండా తాగితే రోగాలొస్తాయేమో అని భయపడతాంగానీ, థేమ్సునది నీళ్ళు ఉత్తినే తాగొచ్చు. ఇక్కడెవరూ మనకిమల్లే నదుల్లోకి కాలుష్యం వదలరు, బట్టలు ఉతకరు, గేదెలు కడగరు. ఒక్క ఈ థేమ్సు నది మీదే రెండు వందల బ్రిడ్జీలు ఉన్నాయి తెలుసా? రాత్రుళ్ళు విద్యుద్దీపాల వెలుగుల్లో మెరిసిపోయే థేమ్సు నది అందాలు చూసి తీరాల్సిందే. ఇక్కడ బకింగ్‌హామ్ ప్యాలెస్, లండన్ టవర్, టవర్ బ్రిడ్జి, బిగ్‌బెన్‌లూ చూడటం భలే కాలక్షేపంలే. మీకు ఇవన్నీ దగ్గరుండి చూపిస్తాను. ఖర్చూ, వీసాల సంగతి నేను చూసుకుంటాన్లే. వచ్చేటప్పుడు ఆవకాయ సీసాలు తప్పకుండా పట్రండి. ఊరగాయల్లేక నా నోరు చచ్చిపోయింది. ప్రయాణానికి సిద్ధంగా ఉండండి” అని వాడు చెప్పిన రోజైతే ఆవిడ కడుపు నిండిపోయిన సంతోషంతో వంట చేయడమే మరచిపోయింది. (యేం, ఒక్క పూట బయట తిని రాలేవ్?)

ఎక్కడెక్కణ్ణుంచో కోట్లాది యాత్రికులు రాజమండ్రికి వచ్చి గోదార్లో మునుగుతున్న పుష్కరాల రోజుల్లో కూడా మా ఆయన నన్ను ఎదురుగా ఉన్న కొవ్వూరు గోష్పాద క్షేత్రానికి తీసుకెళ్ళడానిక్కూడా ముఖం చూసుకున్నారొదినా, రాజమండ్రి గోదావరి వేరూ కొవ్వూరు గోదావరి వేరా యేమిటి? ఎక్కడ మునిగితే పుణ్యం రాదూ అనేశారు. నా కొడుకు ఏకంగా లండనే తీసుకెళ్ళి చూపిస్తానంటున్నాడు. (కంటే ఇటువంటి కొడుకుని కనాలి మరి! కొవ్వూరు తీసుకెళ్ళడానికి ముఖం చూసుకునే మొగుడివల్ల లండన్ తీసుకెళ్ళే కొడుకు పుట్టడం యేవదృష్టం! యేవదృష్టం!) ఎప్పుడు వెళ్ళాలో ఇంకా తేల్చుకోలేదమ్మా. ప్రయాణానికి సిద్ధంగా ఉండమన్నాడు. మేం తిరిగి వచ్చేదాకా కొంపని కాస్త మీరే కనిపెట్టుకునుండాలొదినా! (ఇదే దొరికిన సందు అని దొడ్లోని మామిడికాయలన్నీ దుళ్ళగొట్టేయకండి,

## అన్యాయమైపోయిన దిశాపటానీ

వారసుల కోసం హీరోలు, హీరోయిన్లు ఎవరికి అన్యాయం చేయడానికైనా వెనుకాడరు. సరిగ్గా ఇదే జరిగింది దిశాపటానీ విషయంలో. ‘స్టూడెంట్ ఆఫ్ ది ఇయర్’ సినిమాకి సీక్వెల్‌ను కరణ్ తీస్తున్న సంగతి తెలిసిందే! ఈ సినిమాలో మొదట దిశాపటానీని అనుకున్నారు. కానీ అనూహ్యంగా సైఫ్ తన కూతురు సారాను ఈ సినిమా ద్వారా హీరోయిన్ చేద్దామని భావించాడట! ఆలస్యం లేకుండా పావులు కదిపాడట! ఫలితం దిశా స్థానంలో సారా వచ్చి చేరింది. ఈ విషయం తెలిసి దిశా తనకు అన్యాయం జరిగిందని వాపోతోందట! పాపం తన బాధ బైటికి చెప్పుకునే అవకాశం కూడా దిశాకు లేకుండా పోయిందని బాలీవుడ్ జనాలు ఆమె మీద సానుభూతి చూపిస్తున్నారు.



మరి రాలినవి ఏరుకోండే) అని కొంపని అప్పుడే పక్కింటావిడికి అప్పగింతలు పెట్టడమూ నా దృష్టి దాటిపోలేదు.

లండన్ ప్రయాణం గురించి ఆవిడగారు ఊరం తటా టముకేస్తున్నా నా దగ్గర మాత్రం అసలా ప్రసక్తే ఎత్తడం లేదు! (అన్ని విషయాలూ మొగుళ్ళకి చెప్పాలా యేం? అలా అయితే తెల్లారినట్టే! వీసాలూ, సీసాలూ రెడీ అయ్యాకా, పూ, బయల్దే రండి, శకునం చూసుకుని అని చెప్తే చాలదా?) నాలుగు రకాల ఆవకాయలు చేసి సీసాలకెత్తింది. వాడికి ఇష్టమని కాబోలు యేవేవో నాలుగైదు రకాల పొడులు రెడీ చేస్తోంది. అవేమిటని నేనడగనూ లేదు, ఆవిడ చెప్పనూ లేదు. కాపురాలన్నాక పెళ్ళాల్ని మొగుళ్ళు అడక్కూడనివీ, మొగుళ్ళకి పెళ్ళాలు చెప్పకూడనివీ సవాలక్ష ఉంటాయని ఉభయులూ తెలుసుకోవడమే వివేకం. రాత్రి పదిన్నరకి వాడి దగ్గర్నుంచి ఫోన్ వస్తుందేమో అనుకుంటూ కునుకు తియ్యడానికి సిద్ధమవుతుంటే ఫోన్ మోగింది.

"నేనే! మీ వీసాలూ, పేపర్లూ రెడీ, నా సీసాలు రెడీయేనా?" అన్నాడు వాడు.

"నీ సీసాలు రెడీయే గాని నేను రావడం లేదురా అబ్బాయ్" అన్నాను.

"యేం! అదేం (మాయరోగం)?!"

"ఏమీ లేదు. ఎందుకో నాకు రావాలని లేదంతే!"

"అదేమిటి? మీకోసం అన్ని ఏర్పాట్లూ చేశానే. మీకేమైంది? ఒంట్లో బావుంటోందా? (పిడిరాయి లాంటివాడివి ఎపుడూ దగ్గీ, తుమ్మీ ఎరగవుగా) షుగరు, బీపీలేం లేవుగా మీకు?"

"నా ఆరోగ్యం నిక్షేపంలా ఉందిరా. రాకపోవడానికి ప్రత్యేక కారణాలంటూ ఏవీ లేవు. నాకే ఊరొదిలి ఎక్కడికీ వెళ్ళాలనిపించడం లేదురా. ఇక్కడ కడుపులో నీళ్ళు కదలకుండా సుఖంగా బతుకుతున్నాను. అక్కడికి వచ్చి ఇంతకన్నా బావుకునేదేముంది? అనవసరపు ఖర్చూ, యాతనా తప్పించి. ఇక్కడ లేని సుఖాలూ, ఆనందాలూ అక్కడేం ఉన్నాయిరా? నా సంగతి నీకు తెలుసుగా, నాకు ఇష్టమైన చోట నాకు ఇష్టమైనట్టు బతకడమే నాకు ఇష్టం. ఇష్టాలూ, అయిష్టాలూ ఎప్పుడూ పర్సనల్. వాటికి ప్రత్యేకించి కారణాలు ఉండాలని అనుకోను. అవి పుట్టుకతో వచ్చే స్వభావాలూ, తలతిక్కలకి సంబంధించినవీ, మారనివీనూ. ఈ గోదావరీ తీరంలో పుట్టాను. ఇక్కడి ఇసుక తిప్పల్లో, లంకల్లో ఆడుకున్నాను. ఈ నీళ్ళు తాగి ఈ తిండి తిని పెరిగాను. ఇక్కడే ఎదిగాను. బతుకంతా ఇక్కడే బతికాను ఆనందంగా. ఈ ఊరొదిలి ఎక్కడెక్కడో తిరగాలనీ, చూడాలనీ నాకేం కోరికల్లేవ్. ఇక్కడి నుంచే లోకమంతా చూడగలను. తళుకుబెళుకుల ఖరీదైన వేశ్యల్లాంటి నీ లండన్ మహానగరం, బకింగ్‌హాం ప్యాలెస్‌లూ, క్రిస్టల్ ప్యాలెస్‌లూ, బిగ్ బెన్‌లూ, థేమ్స్ నదులూ నన్ను ఊరించలేవురా అబ్బీ. నీ థేమ్స్ నది నీరు ఫిల్టర్ చెయ్యకుండా తాగేంత పరిశుభ్రంగా ఉండొచ్చుగాక. నా గోదావరి కాలుష్య దుర్గంధాలతో నిండిపోయి ఉండొచ్చుగాక, అయినా సరే ఎందుకో వెయ్యి థేమ్స్ నదులైనా నా ఒక్క




# అతని మరణం

బహుశ అప్పుడు
పదేళ్ళ వయసు నాకు
అతనికి పాతికేళ్ళు ఉండచ్చేమో!
అద్భుత వాక్చాతుర్యం
ఆదర్శ వ్యక్తిత్వం
పెద్దయ్యాక నేను కూడా
అతనిలా ఉండాలి అనుకోని రోజులేదు
అతని భావజాలాన్ని
ప్రాణవాయువులా
పీల్చుకోని క్షణం లేదు

అతను చదివిన పుస్తకాలే చదవడం
అతనిలా ఆలోచించడం

ఇలా అతని ప్రభావంతో
ఎంతకాలం గడిచిందో గుర్తులేదు
క్రమంగా అతని గురించి
కొన్ని విషయాలు తెలియసాగాయి.
అతను శిథిలమవడం చూసాను
ఆదర్శాల్ని అతి సులభంగా
వదులుకోవడం చూసాను.

అతన్ని చూస్తూ
బాల్యం నించి యవ్వనానికీ
నడి వయస్సుకీ
ప్రయాణిస్తున్న నాకు
ఇప్పుడిప్పుడే అర్థమవుతోంది
మరణం అనేది
హఠాత్తుగా సంభవించేది కాదని
ఆదర్శాల్నీ
కలల్నీ కోల్పోయిన క్షణం నించి
మరణం
కొంచెం కొంచెంగా
మన అస్తిత్వాన్ని ఆవహిస్తుందని

అతని మరణం నన్ను
అమిత దుఃఖానికి గురిచేసింది
అతను నాలో నింపిన
ఆదర్శ ప్రపంచాన్ని
సంకోచింప చేసింది

నా ఆలోచనల్ని
మందగింప జేసి
నాలోపలి ప్రపంచాన్ని
అతలాకుతలం చేసింది

అనుకోకుండా అతన్ని
యీ మధ్య
మళ్ళీ కలవడం జరిగింది.
ప్రలోభాల కోసం
వ్యక్తిత్వాన్ని పణంగా పెట్టిన వ్యక్తి సాంగత్యం
ఎంత పేలవంగా వున్నదో!
మెలుకువగా ఉన్న శవంతో
కాసేపు గడిపినట్టే అన్పించింది.



కలల్ని
బతికించుకోవడం
బతకడానికి ఎంతముఖ్యమో
నేర్చుకున్న తరువాత
అతని మరణం
నన్నిక బాధించడం లేదు

ఆదర్శాల్ని
బతికించుకోవడం అంటే
మరణం నించి
సదా విముక్తి పొందడమే అని
బోధపడ్డాక

నేనిప్పుడు అసలు
దేనికీ భయపడటం లేదు

—ఆకెళ్ళ రవిప్రకాశ్
*సెల్: 94905 17777*

గోదావరి పాయతో సమానం కాగలవా! అనిపిస్తుందిరా. దీన్ని పిచ్చి దురభిమానం అంటావో, మరేమంటావో నీ ఇష్టం. నువ్వేమన్నా అనుకో, నాకు అభ్యంతరం లేదు. నా మనసులో మాటను దాచుకోలేను. నా గోదావరి ఇసుక తిప్పలు, లంకలు, రెల్లు దుబ్బులు, హైలెస్సా అంటూ సాగే చిన్న పడవలు, గోదావరి బ్రిడ్జీల సొగసులు, హొయలూ థేమ్స్‌కి ఎక్కడి నుంచి వస్తాయిరా? పొద్దుటే నాలుగు మైళ్ళు యేటిగట్టు మీద నడిచి, పుష్కరాల రేవులో రెండు బ్రిడ్జీల మధ్య మెట్లమీద కూర్చుని, రావిచెట్ల ఆకుల గలగలలు, చల్లగాలీ అనుభవిస్తూ గోదావరిని చూస్తుంటే వచ్చే ఆనందం, తృప్తీ, ప్రశాంతత నీ థేమ్స్ నది ఇవ్వగలదా? నీ లండన్‌కి వచ్చి ఈ నా రోజువారీ ఆనందానికి దూరమవ్వనా? తల్లి ఒడిలో వెచ్చగా ఒదిగిపోయే శిశువులా ఈ గోదావరి డొక్కలో దూరి అనుభవించే ప్రశాంతతను వదులుకోలేను. నన్నిలా




ఇక్కడే వదిలెయ్. అరవై నాలుగేళ్ళు వచ్చాయ్. ఈ బుడగ ఎపుడు పేలిపోతుందో తెలీదు. అది నీ లండన్లోనో, పారిస్‌లోనో జరగడం నాకు ఇష్టం లేదు. అది ఇక్కడే జరగాలి. నా బూడిద ఈ గోదావరిలోనే కలిసి నేనే గోదావరినై పోవాలి అనే కోరిక తప్ప మరే కోరికలూ లేవు. అందుకే రాలేనురా అబ్బీ. ఏమనుకోకు. ఇది నా పిచ్చి అంటావా? పిచ్చికెప్పుడూ అర్థం వెదక్కు. 'ఎవడిపిచ్చి వాడికి ఆనందం' అనేమాట ఎటూ ఉందిగా. మీ అమ్మ వస్తుందిలే. ఆవిడ సరదాలన్నీ తీరేలా అన్నీ చూపించి, పంపు చాలు."

"ఏదీ, అమ్మకివ్వండి ఫోన్" అన్నాడు వాడు, ఆవిడగారితో చెప్పి అటు నుంచి నరుక్కొద్దామని కాబోలు. నిద్రపోతోందిలే అని ఫోన్ పెట్టేశాను, ఆవిడగారి డబ్బాలు, సీసాల చప్పుడు ఇంకా విని పిస్తున్నా.

***

బిజీవల్ల కాబోలు నాలుగు రోజులగ్గానీ వాడు ఫోన్ చెయ్యలేదు. ఆవిడ మాత్రం అర్ధరాత్రయ్యే వరకూ పడుకోకుండా వాడి ఫోన్ కోసం రోజూ ఎదురు చూస్తూనే ఉంది. ఫోన్ రింగవడంతోనే గబగబా పరుగెత్తింది, వాడే! అంటూ.

"యేం, ఆయనెందుకు రానంటున్నారు? ఎలాగో అలా చెప్పి బయల్దేరదియ్యి. నీ మాటకి తిరుగుండదుగా" అని కాబోలు అంటున్నాడు తల్లితో. అయ్య కాదంటే అమ్మ అవునంటుందని తెలీనిదెవరికి. అందుకేగా సీతమ్మ తల్లీ నీవైనా చెప్పవే అంటూ రికమండేషన్ కీర్తనలు ప్రాచుర్యంలోకి వచ్చింది. పనులు జరిపించుకోవడంలో ఎవడి లౌక్యం వాడిది. కొంపలో ఆవిడగారి మాటకి తిరుగుండదని వాడికే కాదు, పాలు పోసేవాడికి, పోస్ట్‌మేన్‌కి కూడా తెలుసు! ఆయన ఎలా రాడో నే చూడనూ అని ఈవిడగారు కొడుక్కి భరోసా ఇస్తుందాయేమిటి చెప్మా అనుకుంటూ ఓ చెవి అటు పారేశా. నా చెవుల్ని నేనే నమ్మలేకపోయాను. చెవులు గిల్లుకుని సాగదీసుకుని మరీ విన్నాను.

"...... వొద్దులేరా చిన్నా. మనస్ఫూర్తిగా ఆయనకి రావడం ఇష్టం లేనప్పుడు మనం ఒత్తిడి చెయ్యడం ఎందుకూ. రిటైరయ్యాక ఆయనకి గోదావరి పిచ్చి ఎక్కువై, పొద్దుటే పుష్కరాల రేవుకి వెళ్ళి రెండు గంటలు ఉండిగానీ రారు. ఆయనకదే తృప్తి! దేవుడూ దయ్యం, పూజా పునస్కారాలూ, నదీ స్నానాలూ, పాపం పుణ్యం వగైరా నమ్మకాలేవీ లేని మనిషే అయినా రోజూ అంతదూరం వెళ్ళడం, గోదావరి దర్శనం చేసుకోవడం ఒంటికీ, మానసిక ప్రశాంతతకీ మంచిదేగా. నాకూ వెళ్ళి గోదావరిలో నాలుగు మునకలు వేసి గోదావరి తల్లికి ఓ నమస్కారం పెట్టుకురావాలనే ఉంటుంది. కానీ నాకెక్కడ సాగుతుందీ? రిటైరై పనీ పాటా లేని మగ మహారాజులా తిరిగే స్వేచ్ఛ మాకెక్కడిదీ? ఆడ బతుక్కి రిటైర్మెంట్ లేదుగా. ఆయన గోదావరిని వదిలి ఎక్కడికీ రారు. ఆయన్ని వదిలేసి నేనెలా వస్తాన్రా? ఆయన నడిచే దారే నా దారీనూ. ఆయన్నొదిలి నే రాలేన్రా.... థేమ్స్ నది నిజంగా అంత బావుంటుందేవిట్రా? అయినా అందులో దిగి స్నానాలు చెయ్యనివ్వరని అన్నావుగా. పుణ్యం, పురుషార్థాలకి పనికిరాకపోయాక ఇంకెందుకా నదీ! వచ్చేది కార్తీక మాసం. రథసప్తమికి ఆవు పిడకల దాలిమీద ఇత్తడి గిన్నెలో ఆవుపాలతో పరమాన్నం వండి సూర్యనారాయణమూర్తికి నైవేద్యం పెట్టుకోవాలి. అందుకు ఆవు పిడకలు, ఆవుపాలు, చిక్కుడు కాయల రథం, చెరుకుముక్కా, దీపారాధనకి ఆవు నేతిలో ముంచిన వత్తులూ వగైరా కావాలి.

అవేమీ అక్కడ దొరకవట గదా? ఇంకెందుకూ ఆ లండను గొప్ప? ఇక్కడైతే ఆయన అవన్నీ చిటికెలో తెచ్చిపెడతారు, ఆంజనేయస్వామి చిటికెలో సంజీవని పర్వతం పట్టుకొచ్చినట్టు. మొదటినుండీ నా పద్ధతులూ, పూజా పునస్కారాలూ, నా నమ్మకాలూ, మొక్కులూ ఆయనకి వ్యతిరేకమైనా, కట్టుకున్న దాని మనసు కష్టపెట్టకూడదనే పెద్ద మనసుతో నాక్కావలసినవన్నీ చక్కగా అమర్చిపెడతారు. కిందటి జన్మలో యే సుకృతం చేసుకున్నానో గానీ దయగల మొగుడూ, దయగల కొడుకూ లభించారు. నాకీ జన్మకి ఇంతకన్నా యేం కావాల్రా? నాకీ సంతృప్తీ, ఆనందమూ చాలు. మళ్ళీ జన్మంటూ ఉంటే ఈ మొగుణ్ణి, ఈ కొడుకునే ప్రసాదించమని గోదావరి తల్లిని కోరుకోవడంతప్ప మరే కోరికలూ నాకు లేవు. మేం రావడం లేదని మనసు కష్టపెట్టుకోకు. ఎక్కడున్నా ఆనందంగా ఉండటమే జీవిత పరమావధి. దీన్ని ఆయన్నుంచే గ్రహించా. ఆయన్ని అంటిపెట్టుకుని ఉండడమే నా విధీ, నా ఆనందమూనూ. అర్థం చేసుకోగల సంస్కారం నీకు ఉంది. ఆవకాయలూ, పొడులూ కొరియర్‌లో నీకు అందే ఏర్పాటు ఆయన చూస్తార్లే..."

ఇంకా యేం మాట్లాడుతోందో నాకు విన్పించలేదు. ఆనందం ఎక్కువైనా చెవులు పనిచెయ్యవు కాబోలు! రాబోయిన నా నిద్ర ఎగిరిపోయింది. ఆవిడ కొడుక్కి చెప్పాల్సినవి చెప్పేసి హృదయ భారం దించేసుకుని హాయిగా నిద్ర పోతోంది! లండన్ వెడుతున్నామోచ్! అని ఊరంతా టముకేసుకుని కూడా నేను రానని తెలిసి నాకోసం తానూ మానుకుంది! ఆమె గురించి నాకు తెలీదూ, లండన్ రావల్సిందే అని ఒత్తిడి చేస్తుంది అనుకున్నాను. ఆవిడ గురించి నా అంచనా తప్పింది! పాపికొండల మలుపుల్లో గోదావరి ఎంత లోతో అంత లోతైన మా ఆడవాళ్ళ హృదయాల గురించి మీకేం తెలుసు వెర్రిముఖాల్లారా అన్నట్టు ఎంత సున్నితంగా చెప్పింది!

ఆగ్రహమొస్తే నీ గొంతు చుట్టూ బిగుసుకునే నల్లనయ్య పిల్లనగ్రోవిలాంటి ఆవిడ పొడుగాటి సన్నని వేళ్ళనీ గోళ్ళనీ మృదువుగా ముద్దాడాను. ఆ వేళ్ళూ గోళ్ళూ నా గొంతుమీద బిగుసుకుని చేసే కితకితల కోసమేగా ఆవిడ వెర్రితనం గురించి నోరు జారినట్టు నటిస్తుంటాను!

*సెల్: 9490169068*

# కీళ్లనొప్పులను హోమియోతో తరిమేద్దాం


**డా. మధు వారణాశి,** ఎం.డి
ప్రముఖ హోమియో వైద్యులు
ప్లాట్‌నెం 188, వివేకానందనగర్ కాలనీ,
కూకట్‌పల్లి, హైదరాబాద్
ఫోన్ : 8897331110
8886 509 509




క్లినిక్‌లో పేషెంట్స్‌ను చూస్తూ ఉన్నాను. నా ఛాంబర్‌లోకి 60 ఏళ్ల మహిళను ఇద్దరు మనుషులు పట్టుకుని లోపలకి తీసుకువచ్చారు. కర్ర సహాయంతో నిలబడింది. కూర్చోండి అన్నాను. 'నేను కూర్చోలేను. కూర్చుంటే తిరిగి లేవడం కష్టంగా ఉంటుంది. డాక్టర్‌గారూ 5 ఏళ్ల నుంచి కీళ్లనొప్పులతో బాధపడుతున్నాను. కాళ్లలో వాపులు ఉన్నాయి. నడిచినా, లేచినా కాళ్లలో శబ్దాలు వస్తాయి. లేచినపుడు కాళ్లు పట్టేసి అడుగువేయడం చాలా కష్టంగా ఉంటుంది. ఏ పని చేయలేకపోతున్నాను. కూర్చుని పూజ కూడా చేయలేకపోతున్నాను' అని కళ్లలో నీళ్లు పెట్టుకుంది. ఆమెభర్త ఇంతలో 'డాక్టర్‌గారూ పెద్ద పేరున్న హాస్పిటల్‌కు వెళ్లాము. ఆర్థోపెడిక్ డాక్టర్ గారు చూశారు. ఆమె ఎముకలు పూర్తిగా అరిగిపోయాయి. ఇక లాభం లేదు, జాయింట్ రీప్లేస్‌మెంట్ సర్జరీ చేయించుకోవాల్సిందే అన్నారు. ఆపరేషన్ అంటే భయంగా ఉంది. సక్సెస్ అవుతుందో లేదో అని భయం. మా రిలేటివ్స్ సేమ్ ప్రాబ్లమ్‌తో మీ దగ్గరకు వచ్చారట. ఆపరేషన్ అవసరం లేకుండానే మీరు తగ్గించారట. అందుకే మీ దగ్గరకు వచ్చాం సార్. మీరు దయ ఉంచి ఈ సమస్యకు పరిష్కారం చూపించండి' అని రిక్వెస్ట్ చేశాడు.

కీళ్లనొప్పుల గురించి విశదంగా చెప్పాను. ఆమె లక్షణాలను బట్టి తన నొప్పులు నడుము చుట్టూ ఎక్కువగా ఉన్నాయి. మోకాళ్ల జాయింట్‌లో నొప్పి కూర్చుని ఉంటే ఎక్కువగా ఉంటుంది. నడిస్తే కాస్త రిలీఫ్‌గా ఉంటుంది. ఈ లక్షణాల ఆధారంగా మందులిచ్చాను. కొన్ని రోజుల తరువాత కొంచెం పెయిన్ తగ్గింది అని చెప్పారు. (దాంతో పాటు కొన్ని ఎక్సర్‌సైజులు చెప్పాను) రెండు నెలల తరువాత మరికాస్త ఉపశమనం ఉందికానీ సరిగ్గా నడవలేకపోతున్నానని చెప్పారు. నిలబడితే నొప్పిగా ఉంటుంది. రాత్రిపూట నొప్పులు ఎక్కువగా ఉంటున్నాయి అన్నారు. శారీరక లక్షణాలను బట్టి చికిత్స ప్రారంభించాను. కొన్ని రోజుల తరువాత ఆమె మళ్లీ వచ్చారు. చాలా హ్యాపీగా 'డాక్టర్‌గారూ 70 శాతం పెయిన్ తగ్గింది. నాలో బతకాలనే ఆశ కనిపిస్తోంది' అన్నారు. ఆమెకు ట్రీట్‌మెంట్ కంటిన్యూ చేశాను. 6 నెలల తరువాత ఎవరూ తోడు లేకుండానే కర్ర సాయం లేకుండానే వచ్చారు. ఆమె సంతోషానికి అవధుల్లేకుండా ఉంది. 'నాయనా నువ్వు నాకు దేవుడులా ఉన్నావు. అసలు నేను నడుస్తాను అనుకోలేదు. ఇప్పుడు పూర్తిగా రికవరీ అవుతాననే నమ్మకం కలిగింది. పూర్తిగా తగ్గే వరకు మందులు వాడతాను అన్నారు. ఒక ఏడాదిపాటు కంటిన్యూగా మందులు వాడారు. ఆమెఖ/ 90 శాతం పైగా కీళ్లనొప్పులు తగ్గాయి. గతంలో మోకాళ్ల నొప్పులు వృద్ధాప్యంలో వచ్చేవి. కానీ మారిన జీవనశైలి కారణంగా సరైన పోషకాహారం తీసుకోకపోవడం, వ్యాయామం చేయకపోవడం, ఎక్కువ సేపు కదలకుండా కూర్చుని చేసే ఉద్యోగాల వల్ల ఊబకాయం తోడై మోకాళ్ల నొప్పులు ఇరవై, ముప్పై సంవత్సరాల వయసులోనే ఎదుర్కోవలసిన పరిస్థితి ఉత్పన్నమవుతోంది.

**చికిత్స :** ఇంతగా వేధించే మోకాళ్లనొప్పులకు హోమియో వైద్యంలో చక్కని చికిత్స కలదు. వ్యాధి లక్షణాలను, వ్యక్తి మానసిక, శారీరక లక్షణాలను పరిగణలోకి తీసుకుని మందులను ఎన్నుకుని వైద్యం చేసి సమస్యను నయం చేయవచ్చు. వ్యాధి తొలిదశలో ఉన్నప్పుడు నిర్లక్ష్యం చేయకుండా వైద్యులను సంప్రదించి లక్షణాలను అనుగుణంగా మందులు వాడితే కీళ్లనొప్పుల నుంచి విముక్తి పొందవచ్చు.

# హెపటైటిస్-బి ఏడాదిలో తగ్గిందబ్బీ!

ఆ రోజు సోమవారం. క్లినిక్ పేషెంట్స్‌తో బిజీగా ఉంది. 10 గంటలకు నా ఛాంబర్‌లోకి ఒక మధ్యవయస్కురాలు వచ్చింది. వారితో పాటు ఆమె భర్త తోడుగా వచ్చారు. జూనియర్ డాక్టర్ తీసుకున్న కేస్‌షీట్‌ను నా చేతికిచ్చింది. మొహంలో ఆందోళన,భయం. 'చెప్పమ్మా! ఏంటి నీ ప్రాబ్లమ్, ఎక్కడి నుంచి వచ్చారు?' అని అడిగాను. మాది మచిలీపట్నమండీ(ఏడుపు దిగమింగుకుంటూ)"డాక్టర్‌గారూ నాకు పెద్ద సమస్య వచ్చింది అని కళ్లలో నీళ్లు తెచ్చుకుంది. వెంటనే ఆమె భర్త నా భార్యకు హెపటైటిస్ బి వచ్చింది. ఎలా వచ్చిందో తెలియడం లేదు. నా భార్య చాలా భయపడుతోంది. ఏం చేయాలో మా ఇద్దరికీ అర్థం కావడం లేదు. వెంటనే ఆమె కల్పించుకుని డాక్టర్‌గారూ నాకు చనిపోవాలని ఉంది. చాలా భయంగా ఉంది. మీ ఆర్టికల్స్ చదివాను, మీ టీవీ షోస్ చూశాను. మీరు చెప్పిన విషయాలు విన్న తరువాత జీవితంపై ఆశ కలిగింది. అందుకే మీ దగ్గరకు వచ్చాను. నిజంగా ఇది తగ్గుతుందా? జీవితాంతం ఈ సమస్యకు పరిష్కారం లేదని అంటున్నారు. నిజం చెప్పండి " అంటూ కన్నీళ్లు పెట్టుకుంది. చూడమ్మా హెపటైటిస్ అనేది కాలేయానికి సంబంధించినది. మానవ శరీరంలో కాలేయం అతి ముఖ్యమైన భాగం. ఈ వైరస్ సోకగానే బయటకు ఎటువంటి లక్షణాలు కనిపించవు. కొంతకాలంపాటు ఆ వైరస్ శరీరంలో నిద్రాణంగా ఉంటుంది.

**హెపటైటిస్-బి అంటే ఏమిటి?**

ఏకారణం చేతనైనా కాలేయం దాని సహజపరిమాణం కంటే వాచి వ్యాధిగ్రస్తం కావడాన్ని హెపటైటిస్ అంటారు. సాధారణ భాషల్లో దీన్ని పచ్చకామెర్లు, పసరికలు, జాండిస్ అని పిలుస్తుంటారు. ఈ వ్యాధి వైరస్ కారణంగా సంక్రమిస్తుంది. చాలా మందికి కాలేయం దెబ్బతినే వరకు హెపటైటిస్ ఉన్న విషయం తెలియదు. వ్యాధిని గుర్తించే సమయానికి తీవ్రమవుతుంది.

**కారణాలు**

రక్తదానం, వీర్యం, కలుషితమైన రక్తం, దానికి సంబంధించిన ప్లేట్‌లెట్స్, ప్లాస్మా వంటివి శరీరంలోకి ఎక్కించినపుడు స్టెరిలైజ్ చేయని సూదులు, సిరంజిలు వాడటం, ఒకేసూదితో ఎక్కువ మంది పచ్చబొట్టు వేయించుకోవడం, ఒకేటూత్‌బ్రష్ ఎక్కువ మంది వాడటం, ఇతరులు ఉపయోగించిన బ్లేడ్‌లు వాడటం, హెపటైటిస్ ఉన్న వారితో లైంగిక సంబంధాలు పెట్టుకోవడం వల్ల వైరస్ సంక్రమించే అవకాశం ఉంది.

**లక్షణాలు**

చాలా మంది హెపటైటిస్ రోగుల్లో లక్షణాలు బయటపడవు. వ్యాధి ముదిరే కొద్ది లక్షణాలు బయటపడుతుంటాయి. తరుచుగా జ్వరం, ఒళ్లునొప్పులు, మూత్రం, కళ్లలో పచ్చదనం, మలం తెల్లగా రావడం, రోగనిరోధక శక్తి తగ్గడం, తరచుగా తలనొప్పి, కండరాల నొప్పులు, గొంతులో నొప్పి,వెలుతురు చూడలేకపోవడం, భోజనం రుచించకపోవడం వంటి లక్షణాలుంటాయి. హె పటైటిస్ వ్యాధి క్రానిక్‌గా మారినపుడు లివర్ సిర్రోసిస్, లివర్ ఫెయిల్యూర్, లివర్ కేన్సర్ వచ్చి లక్షణాలు బయటపడతాయి. ఈ దీర్ఘవ్యాధి బయటపడటాని 5 నుంచి 20 సంవత్సరాల సమయం పడుతుంది.

అన్ని విషయాలు వివరంగా చెప్పిన తరువాత ఆ ముఖంలో కొంచెం ఆశ కనిపించింది. మీరు చెప్పినట్లు ట్రీట్‌మెంట్ తీసుకుంటాను అంది. శారీరక లక్షణాలు, మానసిక లక్షణాలు పరిశీలించి మందులు ఇచ్చాను. లక్షణాలను బట్టి మందులు మార్చుతూ వచ్చాను. ఏడాదిపాటు ట్రీట్‌మెంట్ కొనసాగించాను. ప్రతినెల ఆమెలో శారీరకంగా, మానసికంగా ఆమెలో చాలా మార్పు కనిపించింది. ఆకలి పెరిగింది. బాగా యాక్టివ్ అయింది. ఏడాది తరువాత పరీక్ష చేస్తే వైరల్ లోడ్ డిటెక్షన్ లిమిట్‌కు వచ్చింది. ఆమె ఎంతో సంతోషించింది. భార్యాభర్తలిద్దరూ ఎంతగానో కృతజ్ఞతలు చెప్పారు.

# వెట్టి (ది వారియర్)

-మధుబాబు




**నడక మొదలుపెట్టిన క్షణం నుంచీ ఎక్కడా ఆగకుండా ప్రయాణం చేస్తున్న బండోడు ఉన్నట్లుండి ఆగిపోయాడు ఒక పెద్ద జమ్మిచెట్టు దగ్గర.**

**'ఏంటిరా? ఎందుకు ఆగావు?' వెంటనే అడిగాడు అతని ఫ్రెండు.**

**'అడివి ఇక్కడినుంచే పల్చగా ఉంటుంది. మనకోసం ఎవరైనా ఎదురు చూస్తూ ఉంటే చిటికెలో పట్టుబడిపోతాము' ముఖం మీది నుంచి కనుల్లోకి జారుతున్న చెమట ధారలు అరచేత్తో అద్దుకుంటూ చెప్పాడతను.**

'అడివిలోని జనాన్ని అబ్జర్వ్ చేసే తెలివిగల వాళ్ళు బాజిరెడ్డి దగ్గర ఉన్నారా?' నాలుగు అడుగులు వెనుకగా వస్తున్న వెట్టి వెంటనే అడిగాడు.

'ఆ బాజిరెడ్డి వట్టి పనికిమాలిన పిశాచమే కావచ్చు. వాడి దగ్గర మాత్రం కొంతమంది కత్తుల్లాంటి పనివాళ్ళు ఉన్నారు. వాళ్ళ తెలివితేటలకి సరైన గుర్తింపు వస్తే బ్రహ్మాండంగా ఉంటుంది' అన్నాడు బండోడు.

ఎన్ని ఎదురుదెబ్బలు తగిలినా, పట్టిన పట్టు వదలకుండా నిలబడే బాజిరెడ్డి డ్రైవర్ వెంటనే గుర్తుకు వచ్చాడు వెట్టికి. తనకు తెలియకుండానే బండోడి మాటలకు తల ఊపాడు.

'నీలో నాకు నచ్చిన విషయం ఇది కూడా ఒకటి. అవతలి వాళ్ళ మాటల్లో ఉండే నిజాన్ని వెంటనే ఒప్పేసుకుంటావు అన్నయ్యా!' అన్నాడు వెట్టి ముఖంలోకే చూస్తున్న యువకుడు.

'నువ్వు నాకు డప్పు కొట్టడం తగ్గించుకోవాలి తమ్ముడూ. నువ్వు అనుకున్నంత మేధావిని కాదు నేను. మేధావినే అయ్యుంటే ఈ సమయంలో ఇక్కడ ఉండి ఉండేవాడినికాదు. ఆ బాజిరెడ్డితో తగవు పడి తందనాలు తొక్కటం జరిగి ఉండేదీ కాదు' అంటూ ఆ జమ్మి చెట్టు మొదలుకు చేరగిలబడి కూర్చున్నాడు వెట్టి.

'ఆ ఎదవలు మనకోసం గుడి దగ్గర మాటు వేస్తేనే ఒక విధంగా బాగుంటుంది. ఎగేసుకుని మన ఊళ్ళోకి పోతే మాత్రం బాగోదు' సాలోచనగా అన్నాడు యువకుడు.

'మీ ఊళ్ళోకి పోతే పరిస్థితి ఎలా ఉంటుంది?' అడిగాడు వెట్టి.

'చెప్పలేము అన్నయ్యా. అది వాళ్ళ ప్రవర్తన మీద ఆధారపడి ఉంటుంది. మర్యాదగా అడిగితే అడిగిన ప్రతి మాటకీ చక్కగా సమాధానం చెపుతుంది మా అక్కమ్మ. పిచ్చిపిచ్చి గంతులు వేస్తే టాపులు లేపేయిస్తుంది' అన్నాడు యువకుడు.

'అరుపులు, కేకలు స్టార్టయితే మీ అక్కమ్మ కూతురు బెదిరిపోతుందేమో?' అన్నాడు వెట్టి.

ఫక్కున నవ్వాడు ఆ యువకుడు.

'ఎందుకు నవ్వటం?' ఆశ్చర్యంగా అడిగాడు వెట్టి.

'మా చిన్ని బెదిరిపోవటమా? భలేవాడివి అన్నయ్య. అది పెద్ద జాదూ!



## జరిగిన కథ

వెట్టి అసలు పేరు విఠల్‌రెడ్డి. కారణాంతరాలవల్ల వెట్టిగా మారతాడు. తన పెత్తనాన్ని సవాలు చేసిన వెట్టిని అంతమొందించాలనుకుంటాడు బాజిరెడ్డి. వెట్టిని చౌడేశ్వరి ఆలయానికి వెళ్ళి రమ్మంటాడు. ఆలయంలో బసవప్పను, అతడి బృందాన్ని చావమోదుతాడు. పఠాన్‌కి ప్రణవినిచ్చి పెళ్ళి చేయడానికి తాంబూలాలు పుచ్చుకుంటారు. గుడిదగ్గర తారసపడిన వ్యక్తిని రాయుడిపల్లిలో దించి, అక్కడ చౌడేశ్వరికి జరిగిన అపచారమేమిటో తెలుసుకుంటాడు వెట్టి. డాక్టరు పిచ్చమ్మిని పరీక్షించి, మూడుమాత్రలిస్తాడు. అడ్డదారి గుండా కదిరి బయలుదేరిన వెట్టికి ఒక పొదలో చౌడేశ్వరి ఆత్మశిల కనిపిస్తుంది. దాంతోపాటు అడవిలో పఠాన్ తారసపడతాడు. యువకుడి ద్వారా సబ్బిరెడ్డిని రప్పించి, పఠాన్‌ను అరెస్ట్ చేయిస్తాడు. ఈలోపు బసవప్ప మనుషులు వెట్టికోసం రాయుడిపల్లి వెళ్ళి, రవీంద్ర ఇంటిముందు వీరంగం మొదలుపెడతారు. రవీంద్ర కూతురు నాటు తుపాకీతో వాళ్ళను బెదిరిస్తుంది. వెట్టికోసం ఎదురుచూస్తూ ఆ ఇంటిముదే బైఠాయిస్తారు వాళ్ళు. **ఆ తర్వాత...**

జగమొండి. నోట్లో వేలు పెడితే కొరకటం చేతకాని దాని మాదిరిగా అమాయకంగా కనిపిస్తుంది.

'నిజం అదేకదా' మరింత ఆశ్చర్యంగా అన్నాడు వెట్టి.

'అయ్యో.. పిచ్చి అన్నయ్య! అది అమాయకపు వేషం వేసుకున్న పెద్ద డాకూరాణి. మా బావయ్య దగ్గర ఉన్న నాటు తుపాకీతో, చిటారు కొమ్మలమీద ఉండే ఉడతల్ని కూడా టుపుక్కు టుపుక్కున పడగొట్టేస్తుంది. చిమ్మచీకటిలో కూడా ఒంటరిగా ఊరంతా కలియ తిరగేస్తుంది. అది ఈ గడ్డమీద పుట్టిన బిడ్డ. భయం దాని కాలిగోళ్ళల్లో కూడా లేదు' తన అక్క బిడ్డను తలుచుకుంటూ మురిపెంగా అన్నాడు యువకుడు.

బిగపట్టి ఉంచిన ఊపిరిని తేలికగా బయటికి వదులుతున్నట్టు పెద్దగా నిట్టూర్చి, జువ్వి చెట్టు దగ్గర్నుంచి లేచి నిలుచున్నాడు వెట్టి.

'ఇంకా ఎంత దూరం?' కామ్‌గా నిలబడి ఉన్న బండోడిని అడిగాడు.

'సాయంత్రం అయిపోతుందన్నయ్యా. గుడి గోపురం దగ్గరికి పోయేసరికి చీకటి పడొచ్చు' అంటూ అతను నడక మొదలుపెట్టటానికి రెడీగా ఉన్నట్టు గ్రహించి, మళ్ళీ దారి చూపించటం స్టార్ట్ చేశాడు బండోడు.

***

పెద్దపెద్ద ట్రేల్లో ఆవిర్లు వెదజల్లుతున్న ఆవిరి కుడుములు పెట్టించి, తమ దగ్గర పనిచేస్తున్న ఒక పనిమనిషితో, ఆవరణలోకి తీసుకువచ్చింది రవీంద్రన్న కూతురు.

'వేడి చల్లారిపోతే తినటం కొంచెం కష్టం. త్వరత్వరగా తినేయండి. అమ్మ టీ పెట్టింది. తెప్పించి ఇస్తాను' నడుము మీద చేతులు వేసుకుని నిలబడుతూ ఆ పదాలు వ్యంగ్యంగా చెప్పింది.

కూర్చోటమైతే బింకంగా కూర్చుని ఉన్నారు గాని, ఆకలికి తట్టుకోలేకపోతున్నట్టు తలలు విదిలిస్తున్నారు వాళ్ళందరూ. రెండవసారి చెప్పించుకోవాల్సిన అవసరం లేనట్టు, ఒక్కసారిగా ఎగబడ్డారు ఆ ట్రేల మీద. మూడే మూడు నిమిషాల్లో మటుమాయం చేసేశారు వాటి మీద ఉన్న కుడుములు అన్నిటినీ.

ఇంకో పనిమనిషికి చెప్పి, సపోటా చెట్టు దగ్గర ఉన్న నీళ్ళ మోటార్‌ని ఆన్ చేయించింది ఆ బిడ్డ.

'పోయి నీళ్ళు తాగి రండి' అంటూ చెప్పి, లోపలి నుంచి టీ కప్పుల్ని బయటికి రప్పించింది.

'మన ఇంటి మీదికి దండు వచ్చి రంకెలు పెట్టిన ఈ పశువులకు ఇలాంటి మర్యాదలు దేనికి తల్లీ?' ఉండబట్టలేక అడిగింది ట్రేలు మోసుకువచ్చిన పనిమనిషి.

'మనల్ని ఏమీచేయటానికి రాలేదు వాళ్ళు. నాయన్ని బండి ఎక్కించుకు వచ్చిన అబ్బయ్య కోసం వచ్చారు. వాళ్ళు వాళ్ళు తేల్చుకుంటారు. అప్పటిదాకా మనం ఏమీ మాట్లాడకూడదు' అంతకుముందు తన తల్లి చెప్పినట్టే, ఇప్పుడు తను కూడా చెప్పింది ఆ బిడ్డ.

'అచ్చం తల్లి నోట్లో నుంచి ఊడిపడింది బిడ్డ. ఆ మర్యాద, మన్నన అంతా తల్లే' తన పక్కకు వచ్చిన ఇంకో పనిమనిషితో చిన్నగా అన్నది ఆ సేవకురాలు.

'ఆకలికి మాడి మసి అయిపోకుండా టిఫిన్ పెట్టి టీ ఇచ్చావు. చాలా థాంక్సు తల్లీ..' ఖాళీ అయిన టీ కప్పుల్ని కిందపెడుతూ కృతజ్ఞతా సూచకంగా అన్నాడు ఆ జనాన్ని లీడ్ చేస్తున్న మనిషి.

'మా ఇంటి గడప ముందుకు వచ్చినవాళ్ళు ఎవరైనా సరే, ఆకలితో పస్తులు ఉండకూడదు. అది మా పద్ధతి. ఇంకాసేపటిలో చీకటి పడుతుంది. ఆ అబ్బయ్య వస్తాడో రాడో



ఎవరికీ తెలియదు. మీ సంగతి ఏమిటి?' సూటిగా అడిగింది ఆమె.

'తల్లీ.. ఆ అబ్బయ్య మాకు చాలా అవసరం. మీ దగ్గరికి వచ్చినప్పుడు ఎట్టా ఉండాడో, ఏం మాట్లాడిండో మాకు తెల్వదు. మా మనిషి ఒకతన్ని చావగొట్టి చెవులు మూసేసిండు. ఉంటాడో ఊడి పోతాడో తెలియని పరిస్థితిలో హాస్పిటల్లో ఉండాడు మా మనిషి' చిన్నకంఠంతో చెప్పాడు లీడర్.

పది క్షణాలు ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చినట్టు తల ఊపింది ఆ బిడ్డ.

'ఆ అబ్బయ్యకి, మా మామయ్యకి మంచిదోస్తీ కుదిరింది. ఒకవేళ ఇక్కడికి వచ్చినా, మా మామయ్య అతని పక్కన ఉన్నంతవరకూ మీరు అతన్ని ఏమీ చెయ్యలేరు. అందులోను మా మామయ్య ఫ్రెండు బండోడు కూడా ఉన్నాడు. కనీసం వంద అడుగుల దూరంలోకి కూడా మీరు పోలేరు. నేను చెప్పేది ఏంటంటే మీరు సరాసరి చింతలపల్లి పోయి అక్కడ సెంటర్లో కూర్చోండి. ఎక్కడికి పోయి ఇక్కడికి రావాలన్నా, ఎవరైనా సరే చింతలపల్లి మీదుగా రావాల్సిందే' అంది.

తమలో తాము గుసగుసలాడుకున్నారు వాళ్ళు. 'అమ్మ... ఆ బుల్లెట్ బండిని మాతో పాటు తీసుకు పోతాము' అన్నాడు లీడరు.

'అమ్మ వద్దని చెప్పింది కదా! అమ్మ చెప్పిన మాటకు తిరుగులేదు. అది ఇక్కడ ఉండాల్సిందే!' నిర్మొహమాటంగా నిరాకరించింది ఆమె.

మరోసారి గుసగుసలాడుకున్నారు వాళ్ళు. ఉన్నట్టుండి ఒకేసారి లేచి నిలబడ్డారు. 'మేము మీరు చెప్పినట్టే చింతలపల్లి దగ్గరికి పోతాము' అంటూ పెద్దపెద్ద అడుగులు వేస్తూ ఆవరణ వెలుపలికి వెళ్ళిపోయారు.

***

సంధ్యా దీపం వెలిగించిన వెంటనే, ఆలయంలోని అమ్మవారికి ఆ సమయంలో చేయవలసిన ఉపచారాలన్నిటినీ అత్యంత భక్తిశ్రద్ధలతో పూర్తి చేశాడు, పూజాదికాలకు నియమించబడిన ప్రస్తుత పూజారి.

నడుము చుట్టూ చుట్టుకున్న ఉత్తరీయం ఊడ తీసి గట్టిగా దులుపుకుంటూ రాజగోపురం దగ్గరికి వచ్చి నిలుచున్నాడు.

'పొద్దున్న పళ్ళెంలో పడిన డబ్బులు సరిపోవని అనిపించిందా? చీకటిపడే సమయంలో ఎప్పుడైనా, ఎవరైనా అమ్మ దర్శనానికి వచ్చిన ఉదాహరణలు ఉన్నయ్యా?' వెంటనే వినవచ్చింది అతనికి పిచ్చి పూజారి కంఠం.

**సన్నపాటి పుల్లతో నేలమీద గీతలు గీస్తూ, పిచ్చిపూజారికి మెల్లగా ఆత్మశిల గురించి తెలియజేశాడు వెట్టి. పిచ్చిపూజారి కోపం మాయమైంది. కన్నీళ్లు జలజలా రాలాయి. లేచివెళ్ళి, వెట్టిని కుదిపేస్తూ, ఇన్నాళ్ళకి ఆ తల్లి నన్ను కరుణించింది. వెంటనే నన్ను అక్కడకు తీసుకెళ్ళు అంటూ బయలుదేరాడు. పూజారిని వెట్టి ఆ ప్రదేశానికి తీసుకెళ్ళాడా? అతనికి ఆత్మశిల దర్శనభాగ్యం కలిగిందా?**

చిన్నబోయింది ఈ పూజారి వదనం. 'దక్షిణ తాంబూలాలకి కక్కుర్తి పడటం ఇంకా నాకు అలవాటు కాలేదు. ఆ అవసరం నీకు మాత్రమే ఉంది. నాకు లేదు' వద్దువద్దని అనుకుంటూనే ఉద్వేగంతో ఎత్తి పొడిచాడు.

'ఎంత మాట అన్నావురా భడవకానా? గుడ్డు వచ్చి పిల్లను వెక్కిరించినట్టు నీకు తాతయ్య వయసున్న నన్నే వెక్కిరిస్తున్నావుగా..' అంటూ తను కూర్చున్న బండరాయి మీది నించి ఛివాలున లేచాడు పిచ్చి పూజారి.

ఎర్రబడిపోయింది మొఖం. విపరీతమైన కోపంతో, పళ్ళు బిగుసుకున్నాయి. ఆ మార్పును చూసేసరికి చెమటలు పట్టేశాయి ప్రస్తుత పూజారికి. గిరుక్కున వెనుతిరిగి ఆలయ ఆవరణలోకి పరిగెత్తుతున్నట్టుగా వేగంగా వెళ్ళిపోయాడు.

'ఆగరా... ఆగు...ఆగిపో... నిన్ను వదిలిపెట్టేది లేదు' అంటూ తనుకూడా అటుకేసి కదలబోతున్న పిచ్చిపూజారి దారికి అడ్డుగా నిలబడ్డాడు వెట్టి.

'నువ్వా?' తన కోపం మర్చిపోయినట్టు ఆశ్చర్యంగా అన్నాడు పిచ్చిపూజారి.

'నేనే స్వామీ' నవ్వుతూ అన్నాడు వెట్టి.

'నీతో మాట్లాడవలసిన అవసరం నాకు లేదు. వెళ్ళిపో... వెంటనే నా ముందు నుంచి దూరంగా వెళ్ళిపో..' పళ్ళు బిగపడుతూ అన్నాడు పిచ్చి పూజారి.

'వెళ్ళకపోతే ఏం చేస్తారు?' మరింత వినోదంగా చూస్తూ అడిగాడు వెట్టి.

ఇంకా ఇంకా ఎర్రగా మారిపోయింది పిచ్చి పూజారి వదనం. పటపటమని పళ్ళు కొరుకుతూ చుట్టూ చూశాడు.

'రాతినో రప్పనో ఎత్తి నా మొఖం మీదికి విసిరి కొట్టాలన్న కోరిక గనుక మీకు ఉన్నట్లైతే, మీ వెనుకే ఉందొక బండ. చూసుకోండి' నవ్వుతూనే అన్నాడు వెట్టి.

పిచ్చిపూజారి అంతకుముందు వరకూ కూర్చుని ఉన్న బండకు దగ్గర్లోనే ఉన్నది ఇంకో చిన్న రాయి.

ఒక అడుగు అటుకేసి వేసి, సడన్‌గా ఆగిపోయాడు పిచ్చిపూజారి. ఎందుకంటే ఆ చిన్న రాయి దగ్గరే నిలుచుని ఉన్నాడు బండోడు.

'నన్ను విసరమంటారా పూజారయ్యా? గురి చూసి గుండెలమీద పడేస్తాను' నవ్వుతూ అన్నాడు అతను కూడా.

అయోమయమైపోయింది పూజారయ్యకి. అతని వంకా వెట్టివంకా మార్చిమార్చి చూసి, ఒక్కసారిగా ఇంకో పక్కకు కదిలాడు. వేగంగా పొదల్లోకో, పుట్టల మధ్యకో పారిపోయి ఉండేవాడే. సడన్‌గా ఆ దారిలో ప్రత్యక్షం అయ్యాడు బండోడి స్నేహితుడు.

'అన్నయ్యకి మీతో చాలా పెద్ద పని పడిందట. కాస్తంత ఆగి అదేమిటో తెలుసుకున్న తర్వాత వెళ్ళండి' అంటూ చేతులు అడ్డుపెట్టాడు.

'నన్ను హింసించటానికి వచ్చిన యములోళ్ళు మీరు. మీకు ఏం ద్రోహం చేశానని చెప్పి ఇలా చెండుకు తింటున్నారు?' పారిపోవటం కుదరని పని అని అర్థమైంది కాబోలు, జీరపడిన కంఠంతో బిగ్గరగా అరిచాడు పిచ్చిపూజారి.

మాటలతో సమాధానం చెప్పలేదు వెట్టి. నెమ్మదిగా అతన్ని సమీపించి, భుజం పట్టుకున్నాడు. 'నిలబడి చెప్పేమాట కాదు ఇది. కుదురుగా కూర్చోవాలి. రండి' అంటూ రేకులషెడ్ దగ్గరికి నడిపించాడు.

మరమనిషి మాదిరి అడుగులు వేసి, అతను చూపించిన చోట కూర్చున్నాడు పిచ్చిపూజారి. నేను బండోడి నాయన దగ్గరికిపోయి గతంలో జరిగినవన్నీ వివరంగా వినివచ్చాను. ఆలయంలో ఉన్న తల్లికి జరిగిన అవమానాన్ని సరిచేయందే పరిస్థితులు చక్కబడవని తెలుసుకున్నాను' అంటూ



మొదలుపెట్టాడు వెట్టి, ఆయన ఎదుట కూర్చుంటూ.

'నీ వల్ల ఏమవుతుంది? నిన్ను మించిన వాళ్ళు ఎంతోమంది ఏదో చేసేద్దామని అనుకుని వెల్లకిలా పడిపోయారు. నోరు మూసుకుని అవతలికి పో' ఉన్నట్లుండి మహా గీరగా అన్నాడు పిచ్చిపూజారి.

సన్నపాటి చీపురుపుల్ల వంటి చిన్న చెట్టుకొమ్మ ఒకటి పడి ఉంది షెడ్ ముందుభాగంలో. చేతిని జాచి దాన్ని అందుకున్నాడు వెట్టి. చిన్నచిన్న గీతలతో, పఠాన్ క్యాంప్‌ని నేలమీద చూపించాడు. ఆకలి బాధను తట్టుకోలేక బండోడితో తను ఎటు పక్కకు పోయాడో గీసి మరీ చూపించాడు.

క్రమక్రమంగా మాయమవుతూ వచ్చింది పిచ్చి పూజారి ముఖంలోని కోపం. పూత్కారం చేస్తూ తమను అడ్డుకున్న పామును గురించి అతను చెప్పటం మొదలుపెట్టిన వెంటనే పూర్తిగా మటుమాయం అయిపోయింది. ఆర్ద్రమైపోయాయి కళ్ళు. జలజలా బుగ్గల మీదకి రావటం మొదలుపెట్టాయి కన్నీళ్ళు.

'ఆ పొదలో పడి ఉంది కోలమొఖం రాయి. దాన్ని ముట్టుకోవటానికి, పట్టుకోవటానికి భయపడి వట్టి చేతులతో వెనక్కి వచ్చేశాను. ఇప్పుడు ఏం చెయ్యాలో చెప్పవల్సింది మీరే..' అంటూ మాటల్ని ముగించాడు వెట్టి.

వేగంగా కదిలి అతని తలను తన గుండెలకు అదుముకుంటూ, వెక్కివెక్కి ఏడ్చాడు పిచ్చిపూజారి.

ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు, దూరంగానే నిలబడి ఉన్న బండోడు, అతని స్నేహితుడు.

'కష్టాలు తీరిపోయే సమయం వచ్చింది. ఆ తల్లి ఆత్మశిల ఎక్కడ ఉందో మనకి తెలిసిపోయింది. బాధపడటం మానేసి ముందు ఆ శిలను ఈ గుడి దగ్గరికి ఎలా చేర్చాలో ఆలోచించండి. అందుకు ఏం చేయాలో చెబితే, మీరు చెప్పిన విధంగానే చేస్తాను.' ఆయన పరిష్వంగం నుంచి అతి బలవంతంగా విడివడుతూ అన్నాడు వెట్టి.

'అంగన్యాస కరన్యాసపూర్వకంగా ఆ తల్లికి అభిషేకాలు, పూజలు జరగాలి. ఆ పూజల్ని చూడటానికి వచ్చే పాములన్నిటికీ ఆహారం నైవేద్యంగా సమర్పించాలి. మేళతాళాలతో తల్లిని వెనక్కి తీసుకురావాలి' తనలో తను అనుకుంటున్నట్టు పైకే అన్నాడు పిచ్చిపూజారి.

ఏదో ఒకటో రెండో మంత్రాల్ని చదివి, పొదలో అడ్డదిడ్డంగా పడి ఉన్న ఆ కోలమొఖం రాయిని భుజం మీద వేసి తీసుకు రమ్మంటాడని అనుకున్న వెట్టికి ఒళ్ళు జలదరించింది.

పఠాన్‌ని పట్టించిన సంగతి బట్టబయలు అయితే బాజిరెడ్డి ఎలా రియాక్ట్ అవుతాడో తెలియని సమయం అది. ఇప్పుడు పఠాన్ పట్టుబడిన ప్రదేశం దగ్గరే ఉన్న ఆ కోలమొఖం రాయి గుట్టు బట్టబయలు అయితే, సిచ్యుయేషన్ ఎలా ఉంటుందో తెలియదు.

బాజిరెడ్డి మూలకంగానే స్థానభ్రంశం చెందిన ఆ శిల, ఇప్పుడు తిరిగి వెనక్కి తీసుకు రాబడుతున్నదని తెలిస్తే అతని ఆలోచనలు ఏ విధంగా ఉంటాయి? ఏదో ఒకటి చేసి, ఆ ప్రయత్నాన్ని అడ్డుకోకుండా ఉంటాడా?

కందిరీగల మాదిరి తన మెదడును అల్లకల్లోలం చేయటం మొదలుపెట్టిన ఆలోచనల్ని అతి ప్రయత్నం మీద అదుముకున్నాడు అతను.

'అయ్యా... ఆ బాజిరెడ్డి ఇంకా కదిరి ఎస్టేట్‌కి కాపలా మనిషేనని మీరు మర్చిపోండి. ఏం చేసినా వాడికి తెలియకుండా చేయాలి. మీరు చెబుతున్న తతంగం అంతా ఈ జిల్లా మొత్తానికి తెలిసిపోయే విధంగా ఉంది' దీర్ఘంగా ఆలోచించి చిన్నగా చెప్పాడు.

'జిల్లా మొత్తానికే కాదు. రాష్ట్రం యావత్తు తెలిసిపోయినా సరే, ఆ తల్లికి నేను చెప్పిన విధంగా ఉపచారాలు జరిపి తీరాలి. వట్టిగా భుజం మీద వేసుకుని తీసుకువస్తానంటే కుదరదు. గట్టిగా మాట్లాడితే ఆ తల్లి మనవెంట రాను కూడా రాదు' మొండిగా అన్నాడు పిచ్చిపూజారి.

'అయితే వెళ్ళి పిలుచుకురా. మీ ఊరి రవీంద్రని అడిగి డబ్బులు కూడా తీసుకురా. మన తల్లిని మనం వెంటనే వెనక్కి తీసుకురావాలి' అన్నాడు పూజారి.

అటుతిరిగి ఇటుతిరిగి అతని మాటలు మళ్ళీ మొదటికి వచ్చేసరికి, మహా చిరాకు వేసింది వెట్టికి.

'మీకు తోచిందే తప్ప ఎదుటివాళ్ళు ఎందుకు చెబుతున్నారో, ఏమని చెపుతున్నారో చెవిన వేసుకోవడం లేదు. మీ ప్రోగ్రాముల్ని కొద్దిరోజులపాటు వాయిదా వేసుకోండి. ఆ బాజిరెడ్డి వ్యవహారం ఏదో ఒక దారిలోకి వస్తే తప్ప మనం చేయగలిగింది ఏమీ లేదు' అంటూ బిగ్గరగా అరిచినంత పని చేశాడు.

అతను అంత వైల్డ్‌గా రియాక్ట్ అవుతాడని అనుకోలేదు పిచ్చిపూజారి. బిక్కమొహం పెట్టేశాడు. 'ఆ తల్లి ఎక్కడ ఉన్నదో తెలియనంత వరకూ ఎలా నడుచుకున్నా ఏమీ కాదు. ఇప్పుడు తెలిసిన తర్వాత, చూస్తూ కూర్చోవటం అంటే మహా పాపం. ఆ తల్లి

## పూజలు చేసింది.. సినిమాలు పట్టేసింది

*పూజలకూ సినిమాలకూ లింకేంటి? అన్న అనుమానం రావడం సహజమే! కానీ ఇది నిజం అంటున్నారు కోలీవుడ్ జనాలు. ఇంతకీ అసలు విషయమేమంటే.... త్రిష కెరీర్ అటకెక్కేసింది అనుకున్న తరుణంలో ఏకంగా ఆరు సినిమాలు చేస్తోంది. దీనికి కారణం బ్యాంకాక్‌లోని ఓ ఆలయంలో త్రిష పూజలు చేసిందట! ఆ ఆలయం గురించి ఓ స్నేహితురాలు చెబితే వెళ్ళి పూజలు చేసిందట! అంతే దెబ్బకు ఆరు సినిమాలు లైన్లో పెట్టేసింది. ఇందులో నిజానిజాలు ఎలా ఉన్నా కోలీవుడ్‌లో త్రిష పూజల గురించి వార్తలు బాగా హల్‌చల్ చేస్తున్నాయి.*



పూర్తిగా కాకపోయినా మూడొంతుల వరకు అర్థమైపోయింది బండోడికి అసలు విషయం. 'నీతో పాటు ఆ పిచ్చిపొద దగ్గర ఉన్న నాకు కూడా చెప్పకుండా ఇంత పెద్ద విషయం నీ గుండెల్లో దాచి పెట్టుకున్నావా?' తన గుండెల మీద చెయ్యి వేసుకుంటూ అడిగాడు.

మౌనంగా ఉంటే అతను మరిన్ని మాటలు మాట్లాడతాడని అనుమానం వచ్చింది వెట్టికి. 'అవన్నీ తర్వాత... ముందు జరగాల్సింది ఏమిటో చూడండి' అన్నాడు తన సంభాషణలోకి అతన్ని కూడా లాగుతూ.

'నీది రాయుడిపల్లి కదా? మీ నాయన....' కనులు చిట్లిస్తూ మాట్లాడటం మొదలుపెట్టిన పిచ్చి పూజారిని మధ్యలోనే ఆపేశాడు బండోడు.

'మీరు నన్ను సరిగ్గానే గుర్తు పట్టారు. అన్నయ్యకి ఇక్కడ జరిగినవన్నీ మా నాయనే చెప్పాడు' అన్నాడు.

ఊరుకోదు' చిన్న కంఠంతో చెప్పాడు.

'ఆమె కనిపించింది మీకు కాదు, నాకు. ఏదైనా చేయదలుచుకుంటే నన్ను చేస్తుంది. మిమ్మల్ని చేయదు' అన్నాడు వెట్టి.

'ఆర్చుకుని తీర్చుకుని నువ్వు తల ఊపేవరకూ నన్ను ఏం చేయమంటావ్?' ఉన్నట్లుండి కోరగా అడిగాడు పూజారి.

'భజన చేయండి స్వామీ. ఏవో చిన్నచిన్న పూజలతో రెండు మూడు కొబ్బరికాయల నైవేద్యంతో ఇక్కడికి తీసుకు వచ్చేయవచ్చన్న ఆలోచన నాది. అందుకే మీకు చెప్పాను. తీసుకు రావటానికి ఇంత గొడవ చేయాలని ముందుగా తెలిసి ఉంటే పొరపాటున కూడా మీకు చెప్పేవాడిని కాదు' అంటూ కూర్చున్న చోటు నుంచి లేచి నిలుచున్నాడు వెట్టి.

'పోనీ, దారి సరిగ్గా చెప్పు. నేను వెళ్ళి ఒకసారి చూసి వస్తాను' తను కూడా నిలబడుతూ అన్నాడు పూజారి.

తల అడ్డం తిప్పాడు వెట్టి. 'మీరు ఈ దారిలో నుంచి మెయిన్‌రోడ్డు మీదకి పోయినా కూడా ఆ బాజిరెడ్డికి వార్త వెళ్ళిపోతుంది. మీరు కదల పునస్కారాలు లేకుండా ఆకలితో నకనకలాడి పోతూ ఉంటుంది ఆ తల్లి. ఆ మాత్రం ఘనంగా పిలుచుకు రాకపోతే మనసు కష్టపెట్టు కుంటుంది.'

'నిజమే! మరి అంత గలాటా జరిగితే ఏమైపోతుంది ఆ రాయిగుట్టు?' కర్కశంగా అడిగాడు వెట్టి.

'ఏమీకాదు. తన గుట్టు ఎలా కాపాడుకోవాలో ఆ తల్లికి తెలుసు. నువ్వు హైరానా పడాల్సిన అవసరం ఎంత మాత్రమూ లేదు.'

ఎంత చెప్పినా, ఏం చెప్పినా అతని ఆలోచనలలో మార్పురాదని అర్థమైపోయింది వెట్టికి.

'ఆల్‌రైట్! మీరు ఒక పనిచేయండి. రాయుడిపల్లి రవీంద్రన్న ఇంటికిపోయి ఆయనతో మాట్లాడి, పూజలకు ఏమేమి కావాలో ఆయనతోనే చర్చించండి. ఈ లోపల నేను బాజిరెడ్డికి మబ్బు చేసే పని పూర్తి చేస్తాను. అంతగా అయితే బండిమీద ఆ రాయిని ఇక్కడికి తీసుకువచ్చిన తర్వాత మీరు చెప్పినవన్నీ చేయించుదాము' అన్నాడు వెట్టి.

ఒక్కమాట కూడా మాట్లాడకుండా నిలబడి ఉన్న రవీంద్ర బావమరిది ముఖంలో రకరకాల భావాలు ప్రత్యక్షం అయ్యాయి. 'అన్నయ్యా, ఈ




పూజారయ్య కంటే వెయ్యిరెట్లు ఎక్కువ పిచ్చి మా బావయ్యకి. ఈయన పోయి చెప్పగానే మా ఊరు ఊరంతా వచ్చేస్తుంది. గొడవలైపోతయ్' కంగారుగా అన్నాడు.

'మరేం ఫరవాలేదు. నువ్వు ముందుగా వెళ్ళి మీ అక్కయ్యకి నా మాటగా చెప్పు. నేను కబురు పెట్టేంతవరకు ఎవరూ పొలిమేరల్ని దాటి ఇటుగా రావద్దని చెప్పు' అతనికి మాత్రమే వినబడేటట్లు చెప్పాడు వెట్టి.

'నేను రాయుడిపల్లి వెళ్ళి వస్తాను' అంటూ మెయిన్‌రోడ్డు మీదికి బయలుదేరబోయిన పూజారయ్యను బలవంతంగా ఆపాడు బండోడు.

'పిల్ల పెళ్ళిసంబంధం మాట్లాడుకోవటానికి నంద్యాల పోయిన రవీంద్రన్న ఇంకా తిరిగి రాలేదు. మీరు రేపు సాయంకాలానికి మా ఊరు రండి' అని చెప్పాడు అనునయంగా.

'అన్యాయం అబ్బయ్య. ఇది చాలా అన్యాయం. మాయమైపోయిన నా తల్లి కనిపించిందని చెప్పి, నన్ను ఎటూ కదలనివ్వకపోవటం చాలా దారుణం' కోపంగా అన్నాడు పూజారి.

'ఏది ఎప్పుడు జరగాలో అది అప్పుడు జరిగి తీరుతుంది. మీరు కంగారుపడి కాళ్ళు తొక్కుకోకండి. వెళ్ళి విశ్రాంతి తీసుకోండి' అంటూ అతన్ని అతి బలవంతంగా ఆలయం వెనక భాగంలో ఉన్న అతని ఇంటికేసి నడిపించాడు వెట్టి.

అడుగులో అడుగు వేసుకుంటూ అతి నెమ్మదిగా ఆవరణలో నుంచి ఇవతలికి వచ్చాడు ప్రస్తుత పూజారి.

'ముసలాడు వెళ్ళిపోయాడా?' అని అడిగాడు.

తల ఊపాడు వెట్టి.

'చీకట్లు దట్టం అయినా కూడా అతన్ని వెంటనే గుర్తుపట్టాడు ఆ పూజారి.

'నీ కోసం చాలామంది అదేపనిగా వెతుకులాడుతున్నారు. బళ్ళారి వైపు నుంచి ఎవరో గ్రానైట్ మైన్స్ వాళ్ళట. ఆ ముసలాడితో మంతనాలు ఆడి మరీ వెళ్ళారు' అన్నాడు.

చలిజ్వరం వచ్చినంత పని అయింది వెట్టికి, ఆ మాటల్ని వినగానే.

'స్వామీ.. వాళ్ళు ఇప్పుడు ఎక్కడ ఉన్నారు? ఎటుకేసి పోయారు?' తన మనస్సులోని అలజడిని నేర్పుగా కప్పి పెట్టుకుంటూ అడిగాడు.

'తెల్లవారుతుండగా వచ్చారు. బహుశా రాయుడిపల్లి వైపే పోయి ఉంటారు' అన్నాడు అతను.

తనకు ఏమీ తెలియనట్టు అమాయకంగా కనిపించినా, అతను చాలా షార్ప్ అని అవగతమైంది వెట్టికి.

'మేము ఇప్పుడు మాట్లాడుకున్నదేమిటో మీకు తెలిసిందా స్వామి?' సూటిగా అడిగేశాడు.

'వివరంగా వినిపించలేదు. ఆ ముసలాడికి ఎందుకో కోపం వచ్చింది. తగ్గించటానికి మీరు అష్టకష్టాలు పడ్డారు. శబ్దం అయితే వినపడింది కానీ, మాటలు సరిగ్గా అందలేదు' అన్నాడు అతను.

గుండెల మీది నుంచి పెద్ద బరువు దిగిపోయినట్టు తేలికగా నిట్టూర్చి బండోడి వైపు తిరిగాడు వెట్టి.

'వెళ్ళిపోదాం అన్నయ్య... ఇప్పటికే చాలా ఆలస్యం అయింది' అంటూ అతని సమాధానం కోసం ఎదురు చూడకుండా మెయిన్‌రోడ్డు మీదికి బయలుదేరాడు అతను.

ఆశ్చర్యంగా చూస్తున్న పూజారికి నమస్కారం చేసి అతన్ని అనుసరించాడు వెట్టి. 'నువ్వు బండోడితో కలిసి ఇంటికి వెళ్ళిపో. నేను వెనక్కిపోతాను' అన్నాడు రవీంద్ర బావమరిదితో.

'మరి ఆళ్ళెవరో గ్రానైట్ మైన్సోళ్ళు –' అంటూ మాటను ఆపాడు ఆ యువకుడు.

'వాళ్ళు నా కోసం రావటం అంటూ జరిగితే, ఆపగల శక్తి ఎవరికీ లేదు. బహుశా మీ ఇంటి దగ్గరే కూర్చుని ఉంటారు' అన్నాడు వెట్టి.

'ఏడిచారు. మా అక్కమ్మ చూస్తూ కూర్చోదు. నెత్తులు పగల కొట్టించేస్తుంది' చాలా తేలికగా

కూడదు' అన్నాడు వెట్టి.

అప్పుడు కూడా కన్విన్స్ కాలేదు ఆ వృద్ధుడు. పెదవులు బిగించి తల అడ్డం తిప్పాడు.

అధికమైపోయింది వెట్టి మనసులో అడుగు పెట్టిన అసహనం. 'ఇందాకటినుంచీ చూస్తున్నాను. ఆ శిలను తీసుకురావటానికి పెద్ద జాతర జరిపించే కార్యక్రమం పెడుతున్నారు. అసలు ఆ శిల గురించి ఎంతమందికి తెలుసు. రహస్యంగా ఉంచవలసిన విషయాన్ని బట్టబయలు చేయటం ఎంతవరకు సబబు?' కోపంగా అడిగాడు.

అప్పుడు అతను ముఖ్యమైన విషయాన్ని ముక్కుమీద కొట్టినట్టు సూటిగా బయటపెట్టడంతో ఆగిపోయాడు పిచ్చిపూజారి.

'నువ్వు చెప్పింది నిజమే. ఆ తల్లి ఆత్మశిల వ్యవహారం అందరికీ తెలియకూడదు' అని ఒప్పుకున్నాడు.

'మరి? మంత్రాలు... తంత్రాలు... తాషా మర్ఫాలు దేనికి?'

'అవి కావాలి. సంవత్సరాల తరబడి పూజలు

చెప్పాడు యువకుడు.

'అయినా సరే, పట్టిన పట్టు వదిలే రకం కాదు వాళ్ళు. పొలిమేరల దగ్గర మాటువేసినా వేసి ఉండొచ్చు' అంటూ బండోడి వైపు తిరిగి 'రహదారిలో వెళ్ళకండి, అడ్డదారుల్లో వెళ్ళండి. వాళ్ళు కన పడితే ఆర్గ్యుమెంట్లు పెట్టుకోకండి. అడిగిన వాటికి నికార్సుగా జవాబులు చెప్పేయండి' అన్నాడు.

'అదేంటి అన్నయ్యా... మరి వాళ్ళు నీ మీదికి..' అంటున్న అతని భుజం తట్టాడు ఆప్యాయంగా.

'వాళ్ళకి నాకు మధ్య ఒక వ్యవహారం చాలా పెద్దది ఉంది. రెండు మూడు మాటల్లో చెప్పేది కాదు అది. నేను చెప్పినట్టు చేయండి. నాకు ఏదో చెడుపు జరుగుతుందన్న భయం వద్దు' అన్నాడు.

తల వంచుకుని గబగబా అడుగులు వేస్తున్న యువకుడు ఉన్నట్టుండి వెట్టికి దగ్గరగా జరిగాడు. 'బుసబుసలు వినబడుతున్నాయ్ అన్నయ్యా. పాములు రోడ్డు మీదికి వచ్చేసినట్టు అనుమానంగా ఉంది' చిన్న కంఠంతో చెప్పాడు.

'మరేం పరవాలేదు. మన జోలికి రావు' అంటూ తను ముందుండి నడిచాడు వెట్టి. మెయిన్‌రోడ్డు మీదికి వచ్చిన వెంటనే, అతనికి చేయి ఊపి, రోడ్డుకు అవతల పక్కన ఉన్న పొదల్లోకి దారి తీశాడు బండోడు.

'జాగ్రత్త అన్నయ్యా... నువ్వు సిటికీ పోగానే ఫోన్ కొట్టు. నా నంబర్...' అంటూ తన ఫోన్ నంబర్ని పెద్దగా చెప్పి, తను కూడా బండోడి వెనుక పరిగెత్తాడు యువకుడు.

గుండెల నిండా గాలిని పీల్చుకున్నాడు వెట్టి. ప్యాంటు జేబులో చేతులు పెట్టుకుని సిటీ వైపు నడక మొదలు పెట్టాడు.

***

శివారెడ్డి గదిలోనే భోజనాలు ముగించారు అందరూ. తన బెడ్‌మీద కూర్చుని, తనే స్వయంగా వడ్డన చేస్తున్నట్టు కొసరికొసరి తినిపించాడు శివారెడ్డి.

'పొద్దున డాక్టరు వచ్చి ఏవో మాత్రలు ఇచ్చి పోయాట్ట కదా. వేసుకున్నావా అమ్మా?' అని పిచ్చమ్మిని అడిగాడు.

'సంపంగీ.. నా హ్యాండ్‌బాగ్ తీసుకురా' అన్నది వెంటనే ప్రత్యూష.

పరుగులాంటి నడకతో పోయింది సంపంగి. హ్యాండ్‌బాగ్ జాగ్రత్తగా పట్టుకుని తీసుకు వచ్చింది. సరిగ్గా అదే సమయంలో వచ్చాడు అక్కడికి బాజిరెడ్డి.

డైనింగ్ రూమ్‌లో కూర్చున్నట్టు తీరికగా కూర్చుని ఉన్న అందరినీ చూసేసరికి విపరీతమైన ఆశ్చర్యంతో కనుబొమలు ఎగురవేశాడు.

'ఏమిటి సంగతి? ఏమైనా అర్జంటు మేటరా?' అడిగాడు శివారెడ్డి.

'మేటరు లేదు. పాడు లేదు. అమ్మగారు ఎలా ఉన్నారో చూసి పోవటానికి వచ్చాను. మాత్రలు వేసుకున్నారా?' అతన్నే అడిగాడు బాజిరెడ్డి.

'ఏమిటో నా ఆరోగ్యం మీద శ్రద్ధ ఎక్కువయి పోయింది మన వీరభోజుడికి' సన్నగా అన్నది పిచ్చమ్మి.

'కళ తప్పింది బాజిరెడ్డి ముఖం. ఈ ఎస్టేట్‌లో ఉండే వాళ్ళందరూ హాయిగా ఉండాలన్న కోరిక నాది. అందుకే వచ్చాను' అంటూ అవతలికి పోకుండా అక్కడే గోడను ఆనుకుని నిలబడ్డాడు.

'ఇచ్చేది ఏదో త్వరగా ఇచ్చేయ్ ప్రత్యూషా... తను చూస్తూ ఉండగా ఆ మాత్రలు వేసుకోక పోతే వీరభోజుడికి తృప్తి కలిగేటట్టు కనిపించడం లేదు' అంటూ ప్రత్యూషను హెచ్చరించింది పిచ్చమ్మి.

హ్యాండ్‌బాగ్‌ని తెరిచింది ప్రత్యూష. కొంచెం అవతలగా నిలబడి ఉన్న సంపంగి ఊపిరి బిగపట్టేసింది.

'సారూ.. మేనేజరు సారూ..' అంటూ ఆ గది గుమ్మం దగ్గరికి పరిగెత్తుకు వచ్చాడు ఒక సేవకుడు.

హ్యాండ్‌బాగ్‌లో నుంచి ప్రత్యూష బయటికి తీస్తున్న మాత్రలను నిశితంగా చూస్తున్న బాజిరెడ్డి ఉలికిపడ్డాడు. 'ఏంటిరా? ఏంటి విషయం?' కోపంగా అడిగాడు.

'చింతలపల్లి నుంచి ఫోను వచ్చింది. మీరు అర్జంటుగా రావాలి' తన దగ్గర ఉన్న ఫోన్ ముందుకు జాస్తూ చెప్పాడు ఆ సేవకుడు.

'చింతలపల్లి నుంచా? ఫోనా? నాకా?' అయోమయంగా అడుగుతూ సడన్‌గా ఏదో గుర్తుకు వచ్చినట్టు నవ్వేశాడు బాజిరెడ్డి. 'ఈ మధ్య నాకు మతిమరుపు ఎక్కువైపోతోంది. అక్కడ ఉన్న తోటల్ని చూడటానికి పఠాన్‌బాబు వెళ్ళాడు. వాడే చేసి ఉంటాడు' అంటూ ముందుకు నడిచి ఆ మనిషి చేతుల్లోని ఫోన్ తీసుకున్నాడు.

అవతలి నుంచి వినవచ్చిన మాటలు అతని ముఖాన్ని ముడుచుకుపోయేలా చేసేశాయి. 'ఏంటిరా? ఏంటి నువ్వు చెప్పేది? నిజమేనా? ఆడికి అన్ని గుండెలు ఎక్కడినుంచి వచ్చినయ్. నేను వస్తున్నా. ఇప్పుడే వస్తున్నా.' అంటూ ఫోన్ ఆ మనిషికి ఇచ్చి శివారెడ్డి వైపు చూశాడు.

'అర్జంటు పని ఒకటి వచ్చింది. చింతలపల్లి పోయొస్తా.' అంటూ సమాధానం కోసం ఎదురు చూడకుండా పరిగెడుతున్నట్టు బయటికి వెళ్ళిపోయాడు.

***(ఇంకా వుంది)***




## ముసురుతున్న చీకట్లు

రేపటి ఉదయాలకు
స్వాగత సన్నాహాలు చేసే
ఇప్పటి సాయంకాలం
రావణుడెత్తుకుపోయిన సీత!

ఆలయాలు పఠనాలయాలు
ఆటల మైదానాలు
పాటల పారవశ్య వేదికలు
నిప్పంటుకున్న మానవ కూడళ్ళు!



తిరునాళ్ళను తలపించాల్సిన
సభలు సమావేశాలు
కమనీయ కళా ప్రదర్శన శాలలు
శిథిల జ్ఞాపకాల ఆనవాళ్ళు!

అమ్మలక్కల
కుడ్య సమావేశాల ఘుమఘుమలు
ఉచిత సమాచార వాహికల నడుమ
నిత్యం మొలుచుకొస్తున్న సమాధులు!

నాసికా పుటానికిరువైపులా
అతికించిన కనుబొమల్లా
మనం దగ్గర దగ్గరే ఉన్నా
దూరాలు విస్తరిస్తున్న దుర్మార్గం!

నట్టింట్లో ఈడియట్ బాక్స్
మోకరిల్లుతున్న సృజన శీలి
ఆకాశంలో సగం
మార్గదర్శనం చేయాల్సిన అనుభవ సారం
పానశాలల్లో వ్యక్తావ్యక్త ప్రేలాపన!

తలలు దించుకుంటున్న
యవ్వన దీపాలు
అంతర్జాల వెతుకులాటలో
అంతర్ధానం!

దేశమా! ఇక నీ నుదుట
రేపటి ఉదయాలు ఎవరు పూయిస్తారు?!

***-కోట్ల వెంకటేశ్వర రెడ్డి***
***సెల్: 9440233261.***




# యదువంశం: అరణ్యకన్య కథ

**తననే ఉత్కంఠగా చూస్తున్న జనమేజయునితో చెప్పసాగాడిలా వైశంపాయనుడు. నీకు ఇప్పుడు యదువంశక్రమం చెబుతాను, జాగ్రత్తగా విను. యదు మహారాజుకు సహస్రదుడు, పయోదుడు, క్రోష్టువు, నలుడు, అంజనుడు అని అయిదుగురు కుమారులు జన్మించారు. వారిలో పెద్దవాడు సహస్రదునికి హైహయుడు, హయుడు, వేణుహయుడు అని ముగ్గురు కుమారులు జన్మించారు. వారిలో హైహయునికి ధర్మనేత్రుడు, కార్తి, సహస్రజిత్తు, మహిష్మంతుడు, భద్రశ్రేణ్యుడు, దుర్దముడు, ధేనుకుడు అని ఆరుగురు కుమారులు జన్మించారు. వారిలో ధేనుకునికి కృతవీర్యుడు, కృతాగ్ని, కృతధన్వ, కృతాంజనుడు అని నలుగురు కుమారులు జన్మించారు.**

కృతవీర్యుని కుమారుడు కార్తవీర్యార్జునుడు పదివేల సంవత్సరాలు తపస్సు చేసి, దత్తాత్రేయుని అనుగ్రహాన్ని సాధించాడు. యుద్ధవేళ వేయి చేతులు రావాలి. ఎప్పుడూ దుష్టులను దండించాలి. ధర్మమార్గంలో పాలించాలి. ప్రజలందరినీ రంజింపచెయ్యాలంటూ నాలుగు వరాలు పొందాడు. ఆ వరాలతో రాజన్యులందరినీ జయించాడు. సప్తద్వీపాలలోనూ ఏడువందల యజ్ఞాలు చేశాడు. ఎనభైఅయిదువేల సంవత్సరాలు పాలించి, చివరికి పరశురాముని చేతిలో మరణించాడు. కార్తవీర్యార్జునునికి శూరుడు, శూరసేనుడు, ధృష్టుడు, కృష్ణుడు, జయధ్వజుడు అని ఐదుగురు కుమారులు జన్మించారు. అవంతీదేశాన్ని జయధ్వజుడు పాలించాడు. అతని కొడుకే తాళజంఘుడు. అతనికి నూరుగురు కుమారులు జన్మించారు. వారంతా తాళజంఘనామధేయాలతో లోకప్రసిద్ధులయ్యారు. వారిలో వంశకర్త వృషునికి మధువు, అతనికి వృష్ణి జన్మించారు. యదువువల్ల యాదవులు, మధువువల్ల మాధవులు, వృష్ణివల్ల వృష్ణులంతా కార్తవీర్యవంశీయులై సుప్రసిద్ధులయ్యారు.

ఇప్పుడు యదువు మూడవకుమారుడైన క్రోష్టువు వంశక్రమాన్ని చెబుతాను, విను. ఈ మహితాత్ముని వంశంలోనే ఆ నారాయణదేవుడు జన్మించాడు. క్రోష్టువు కుమారుడైన వృజికి నీతిమంతుడు, స్వాహి అని ఇద్దరు కుమారులు జన్మించారు. వారిలో స్వాహికి కిరుశుంకుడు, అతనికి చిత్రరథుడు జన్మించారు. చిత్రరథునికి శశబిందు జన్మించాడు. ఈ శశబిందుకు భార్యలు పదివేలమంది, కుమారులు పదికోట్లమంది. కుమారులందరిలోనూ పెద్దవాడైన పృథుశ్రవునికి అంతరుడు జన్మించాడు. అతనికి యజ్ఞుడు, ఉషతుడు అని ఇద్దరు కుమారులు జన్మించారు. తర్వాత శితేపుడు, మరుత్తుడు, కంబళ, బర్హిషుడు జన్మించారు. అలా నూరుగురు కుమారులు జన్మించినా తనివి తీరలేదు అంతరునికి. దానధర్మాలు చేశాడు. పుణ్యక్రియలు ఆచరించాడు. వాటి ఫలితంగా రుక్మకవచుడు అని ఓ కుమారుడు కలిగాడు. అతను నూరుగురు శత్రువులను అవలీలగా వధించి, సామ్రాజ్యాన్ని చిరకాలం పాలించాడు.

రుక్మకవచునికి పరాజిత్తు అని ఓ కుమారుడు జన్మించాడు. అతనికి రుక్ముడు, పృథురుక్కుడు, జ్యామదుడు, పాలితుడు, హరి అని అయిదుగురు కుమారులు జన్మించారు. వారిలో పాలితుణ్ణీ, హరినీ తాను ఆచరించిన యజ్ఞానికి దక్షిణగా బ్రాహ్మణులకు సమర్పించాడు తండ్రి. కొన్నాళ్ళకు రుక్ముడు రాజైనాడు. జ్యామదుడు రాజ్యం మాటే తలపెట్టలేదు. భార్య శైబ్యసహా అరణ్యానికి తరలిపోయాడు. అక్కడ తీవ్ర తపస్సు ఆచరించాడు. అప్పుడు ఒక బ్రాహ్మణుడు అతన్ని సమీపించాడు. ఇలా అన్నాడు. మహారాజా! సుక్షత్రియులకు రాజధర్మమే అనుసరణీయం. ఆ ధర్మం ముందు ఈ తపస్సు ఎంతమాత్రం నిలవదంటూ అనేక విధాల నచ్చజెప్పాడతనికి. దాంతో జ్యామదుడు రాజ్యపాలన చేయ సంకల్పించాడు. అన్నల రాజ్యాల మాట తలపెట్టక, శుక్తిమతి అని ఓ పట్టణాన్ని నిర్మించి దానిని పాలించసాగాడు.

కొన్నాళ్ళకు రారాజు కాదలచాడు. నర్మద, మత్తికావతం నదుల పరిసరప్రాంతాలలోని రాజులపై విల్లు ఎక్కుపెట్టాడు. జ్యామదుడి ధాటిని తట్టుకోలేక ఆ ప్రాంత రాజులంతా కుటుంబాలను కూడా వదలుకుని అక్కణ్ణుంచి పారిపోయారు. ప్రజలు కూడా ఎవరికి ఎవరూ లేక అనాథలై అరణ్యాలలో తల దాచుకున్నారు.

శత్రురాజులను వెంట తరుముతూ వస్తున్న జ్యామదునికి అరణ్యంలో ఓ సుందరి కనిపించింది. ఏడుస్తున్నదామె. భయం భయంగా ఉంది. రాచకన్యలా ఉంది. ఏమైందో ఏమిటో తెలుసుకునేందుకు ఆమెను సమీపించాడతను. కొద్దికొద్దిగా వివరాలు అడిగి తెలుసుకున్నాడు. తాను అనుకున్నట్టు ఆమె రాచకన్య అని తెలియడంతో ఆనందించాడు జ్యామదుడు. అంతవరకూ అతనికి సంతానం లేదు. అయినా మరో పెళ్ళి చేసుకునే ఆలోచనే కలగలేదతనికి. ఇప్పుడు ఈ సుందరిని చూడడంతో ఆమెను భార్యను చేసుకుని సంతానం పొందాలన్న కోరిక కలిగింది. వెంటనే ఆమెను రథంపై కూర్చుండబెట్టుకుని, అంతఃపురంలోనికి ప్రవేశించాడు. యుద్ధరంగం నుంచి వస్తున్న భర్తకు స్వాగతం పలికేందుకు వచ్చిన శైబ్య, రథంలో భర్తతో పాటుగా మరొక స్త్రీ ఉండడాన్ని గమనించి, కోపగించుకుంది. భర్తను నిలదీసిందిలా.

దండయాత్రకు వెళ్తున్నానని చెప్పి, వన్నెలాడిని వెంటబెట్టుకొచ్చారా? రాజులకంతే! కొత్త ఒక వింతగా పాత ఒక రోతగా ఉంటుంది.

లేదు లేదన్నట్టుగా శైబ్యను అనునయించేందుకు ప్రయత్నించాడు జ్యామదుడు. చెప్పాడిలా.

ఈ పిల్ల నీకు కోడలు అవుతుంది. అందుకు తెచ్చాను, నాకోసం కాదు.

కోడలవుతుందా? అదెలా సాధ్యం? నాకు ఇంత వరకూ సంతానమే లేదే? ప్రశ్నించింది శైబ్య.

నీకు త్వరలోనే ఓ కొడుకు పుడతాడు. నాకు ఆ సంగతి పెద్దలు చెప్పారు అన్నాడు జ్యామదుడు. అందుకే ఈ కన్యను తెచ్చానన్నాడు. బాగానే నచ్చజెప్పాడు. దాంతో ఆమెను వెంటబెట్టుకుని అంతఃపురంలోనికి వెళ్ళిపోయింది శైబ్య. ఊపిరిపీల్చుకున్నాడు జ్యామదుడు.

కొంతకాలానికి శైబ్యకి విదర్భుడు జన్మించాడు. అతను పెరిగి, పెద్దవాడు అయ్యేంతవరకు పూర్వజన్మ తపోఫలం కారణంగా యవ్వనవతిగానే ఉంది రాచకన్య. అప్పుడు వారిద్దరికీ వివాహం జరిగింది. నాటి నుండి రాచకన్యను 'ఉష' అని వ్యవహరించారు. ఆమెకు ముందు క్రథుడు, కైశికుడు అని

**జనమేజయునికి యదువంశ క్రమం చెప్పనారంభించాడు వైశంపాయనుడు. యదువువల్ల యాదవులు, మధువువల్ల మాధవులు, వృష్ణి వల్ల వృష్ణులందరూ కార్తవీర్య వంశీకులై సుప్రసిద్ధులయ్యారు. నారాయణదేవుడు క్రోష్టువు వంశంలో, కంసుడు అంధక వంశంలో, వసుదేవుడు వృష్ణి వంశంలో పుట్టారు. కుంతిభోజుని దత్తపుత్రిక పాండురాజును వివాహమాడగా, కేకయాధీశ్వరునికి జన్మించాడు ఏకలవ్యుడు!! చదవండి.**

ఇద్దరు కుమారులు జన్మించారు. తర్వాత రోమ పాదుడు, రణోగ్రుడు అని మరో ఇద్దరు జన్మించారు.

రోమపాదునికి బభ్రుడు, అతనికి ధృతి జన్మించారు. వారికి పుత్రులూ, పౌత్రులూ అనేకులు జన్మించారు. విదర్భుని మరో కొడుకు కైశికునికి చేది భూపతి జన్మించాడు. అతనివల్ల చైద్యాన్వయం ఎంతగానో అభివృద్ధి చెందింది. క్రథునికి కుంతి, అతనికి ధృష్టుడు, అతనికి దాశార్హుడు అతనికి వరార్హుడు జన్మించారు. అదేవంశంలో వ్యోముడు, జీమూతుడు, నికృతుడు, భీమరథుడు, నవరథుడు, దశరథుడు, శకుని, కరంభుడు, దేవరాతుడు, దేవక్షత్రుడు మొదలైనవారు పది తరాల రాజులు జన్మించారు. అదే వంశానికి చెందిన మధువుకి జన్మించిన వారంతా మాధవులని పేరొందారు. మధువుకి పురువు, అతనికి పురోహోత్రుడు, అతనికి అంగరాజు జన్మించారు. అంగరాజుకి సత్త్వతుడు జన్మించాడు. అతని వంశీయులందరూ సాత్త్వతులని పేరుగాంచారు. సత్త్వతునికి భజమానుడు, దేవావృధుడు, అంధకుడు, మహాభోజుడు, వృష్ణి అని అయిదుగురు కుమారులు జన్మించారు. వారిలో భజమానునికి క్రిమి, క్రమణుడు, కృష్ణుడు, దశజిత్తు, శతజిత్తు, సహస్రజిత్తు, అయితజిత్తు మొదలైన అనేకమంది కుమారులు జన్మించారు. వారంతా ఆయా వంశాలకు ఆదిపురుషులయ్యారు.

దేవావృధుడు అనేక యజ్ఞాలు చేశాడు. కుమారునికోసం వర్ణాశమం నదీతీరంలో చాలాకాలం తపస్సు చేశాడు. కొంతకాలానికి అతని సద్గుణాలకు ముచ్చటపడిన వర్ణాశమం నది ఓ స్త్రీ రూపాన్ని ధరించి, దేవావృధుణ్ణి సమీపించింది. తనని వివాహం చేసుకోమని ప్రార్థించింది. ఆమె ప్రార్థన అంగీకరించాడు దేవావృధుడు. పెళ్ళి చేసుకున్నాడామెను. అప్పుడు వారికి బభ్రుడు జన్మించాడు. తండ్రీకొడుకులిద్దరూ పూజ్యులని వినుతికెక్కారు.

సత్త్వతుని ఇంకో కుమారుడైన మహాభోజుడు నిరంతర ధర్మశీలుడై అనేక యజ్ఞాలు ఆచరించాడు. అతని వంశీయులంతా మృత్తికావత నదీతీరంలో వేర్వేరు రాజ్యాలు ఏర్పరుచుకుని, మృత్తికావతులయినారు. వారిలో అశ్వఫల్గుణుడు కీర్తిమంతుడైనాడు. అతనికి అక్రూరుడు, చిత్రకుడు అని ఇద్దరు కుమారులు జన్మించారు. వారిలో అక్రూరునికి సుదేవుడు, ఉపదేవుడు అని ఇద్దరు జన్మించారు. చిత్రకునికి పృథుడు, నిప్రథుడు మొదలైన పుత్రులు అనేకులు జన్మించారు. శ్రవణ, శ్రవిష్ఠ అని ఇద్దరు కుమార్తెలు జన్మించారు.

ఇప్పుడు అంధకుని వంశక్రమం వివరిస్తాను, విను. అంధకునికి ముగ్గురు కుమారులు. వారి పేర్లు కుకురుడు, భజమానుడు, శుచి. వారిలో కుకురునికి ధృష్టుడు జన్మించాడు. అతనికి కపోతరోముడు, అతనికి తైత్తిరుడు జన్మించారు. తైత్తిరునికి సుమంతుడు, అతనికి అభిజిత్తు, అతనికి ఆహూకుడు జన్మించారు. అభిజిత్తుకి ఓ కుమార్తె కూడా జన్మించింది. ఆమె పేరు ఆహుక. ఆహుక అవంతీశ్వరుని భార్య అయింది.

ఆహూకునికి దేవకుడు, ఉగ్రసేనుడు జన్మించారు. వారిలో దేవకునికి దేవవంతుడు, సుదేవుడు, ఉపదేవుడు, దేరక్షితుడు అని నలుగురు కుమారులు, దేవకి, శాంతి, అనుదేవ, సుదేవ, దేవరక్షిత, వృకదేవి, ఉపదేవి అని ఏడుగురు కుమార్తెలు జన్మించారు. ఉగ్రసేనునికి కంసుడు జ్యేష్ఠపుత్రుడిగా న్యగ్రోధుడు, సునాముడు మొదలైన తొమ్మండుగురు కుమారులు సహా కంస, కంసవతి, సుతనువు, రాష్ట్రపాలిక, గుహ్య అని అయిదుగురు కుమార్తెలు జన్మించారు.



అంధకుని రెండో కుమారుడైన భజమానునికి విదూరథుడు, అతనికి శూరుడు, అతనికి శమి, అతనికి ప్రతిక్షితుడు, అతనికి హృదికుడు జన్మించారు. హృదికునికి కృతవర్మ, శతధన్వుడు, దేవార్హుడు అని ముగ్గురు కుమారులు జన్మించారు. ఇప్పుడు వృష్ణి వంశక్రమం వివరిస్తాను, జాగ్రత్తగా విను.

వృష్ణికి ఇద్దరు భార్యలు. వారి పేర్లు గాంధారి, మాద్రి. వారిలో గాంధారికి మిత్రవివర్ధనుడు, సుమిత్రుడు అని ఇద్దరు కుమారులు జన్మించారు. మాద్రికి యుధాజిత్తు, దేవమీఢుడు, అనమిత్రుడు అని ముగ్గురు కుమారులు జన్మించారు. వారిలో దేవమీఢునికి శూరుడు జన్మించాడు. అతడు మారిషను వివాహం చేసుకున్నాడు. వారికి వసుదేవుడు జన్మించాడు. వసుదేవుడు జన్మించినపుడు ఆకాశంలో ఆనకాలు(తప్పెట్లు) దుందుభులు మ్రోగాయి. ఆ కారణంగానే అతనిని 'ఆనక దుందుభి' అని వ్యవహరించారు.

వసుదేవునికి దేవభాగుడు, దేవశ్రవుడు, అనాధృష్టి మొదలైన తొమ్మండుగురు సహోదరులు జన్మించారు. దేవభాగునికి ఉద్ధవాచార్యుడు జన్మించాడు. అతను బుద్ధిలో బృహస్పతినే మించిపోయాడు. వసుదేవుని సహోదరుల సంతానంలో కౌశికుడు, సుమిత్రుడు ఆదిగా చాలామంది ప్రసిద్ధులైనారు. శూరునికి శ్రుతకీర్తి, శ్రుతదేవ, శ్రుతశ్రవ, పృథ, రాజాధిదేవి అని అయిదుగురు కుమార్తెలు జన్మించారు. కొంతకాలానికి కుంతిభోజునికి పృథ దత్తపుత్రిక అయింది. ఆ కారణంగా ఆమెను 'కుంతి' అని వ్యవహరించసాగారు.

కుంతి, పాండురాజు భార్యాభర్తలైనారు. వారికి దేవతల అంశలతో ధర్మరాజాదులు జన్మించారు. శ్రుతదేవ కరూశదేశాధీశుడు వృద్ధశర్మని పెళ్ళి చేసుకుని, దంతవక్త్రుణ్ణి కన్నది. శ్రుతశవ దమఘోషుణ్ణి పెళ్ళాడి, శిశుపాలుణ్ణి కన్నది. అలాగే శ్రుతదేవ కేకయాధీశ్వరునికి ఏకలవ్యుణ్ణి కన్నది. అయితే విధివశం వల్ల ఏకలవ్యుడు నిషాదులలో కలిసి, వారితోనే పెరిగి పెద్దవాడైనాడు. అనంతీశ్వరుణ్ణి వివాహం చేసుకున్న రాజాధిదేవికి విందానువిందులు జన్మించారు.

—అరణి






## క్యారెట్ ఎక్కువగా తింటే ప్రమాదం!

క్యారెట్ ఆరోగ్యానికి మంచిదన్న ఉద్దేశంతో చాలా మంది క్యారెట్ ఎక్కువ మొత్తంలో తింటూంటారు. అతి ఎప్పుడూ అనర్థదాయకమే అన్న చందంగా క్యారెట్ ఎక్కువ తినడం వలన కొన్ని ప్రమాదాలు పొంచి ఉన్నాయంటున్నారు నిపుణులు. దీన్ని ఎక్కువగా తింటే రాత్రి సమయంలో నిద్ర పట్టకపోవడం, ఆందోళన వంటి సమస్యలు తలెత్తే అవకాశం ఉందని చెబుతున్నారు. అదే విధంగా పాలిచ్చే తల్లులు ఎక్కువగా దీన్ని ఏ విధంగానూ తీసుకోకూడదని అంటున్నారు. క్యారెట్ ఎక్కువ తింటే తల్లిపాలు రుచి మారే ప్రమాదం ఉందని వారు హెచ్చరిస్తున్నారు. అలాగే షుగర్, హార్మోన్ల సమస్యతో బాధపడేవారు దీన్ని తీసుకునే ముందు వైద్యుల సలహా తప్పని సరిగా తీసుకోవాలని వారు సూచిస్తున్నారు.



## విటమిన్ డితో జలుబుకు చెక్?

జలుబు సాధారణ సమస్యగా పైకి కనిపించినా, కొన్ని సందర్భాలలో ప్రాణాంతకంగా మారే ప్రమాదం ఉందంటున్నారు నిపుణులు.

జలుబు నుంచి తప్పించుకోవడానికి రకరకాల మందుల కన్నా విటమిన్-డి బాగా పనిచేస్తుంది అంటున్నారు క్వీన్ యూనివర్సిటీ పరిశోధకులు. 14 దేశాలలోని సుమారు పదకొండువేలమంది మీద వీరు పరిశోధనలు నిర్వహించారు. వీరందరూ తీవ్రమైన జలుబుతో బాధపడుతున్న వారే! వీరికి కొన్ని వారాల పాటు క్రమం తప్పకుండా విటమిన్-డి సప్లిమెంట్లు ఇచ్చారు. వీరిలో క్రమేపీ జలుబు తగ్గడం గమనించారు. కొంతసేపు ఎండలో తిరిగితే విటమిన్-డి అందుతుందన్నది కొందరి నమ్మకం. దీని వలన ఎలాంటి లాభం ఉండదనీ తప్పనిసరిగా సప్లిమెంట్లు తీసుకుంటేనే మంచిదనీ వీరు సూచిస్తున్నారు.

## పరిమితి దాటితే విషం

గ్రీన్ టీ తీసుకోవడం వలన పలు ఆరోగ్య సమస్యలకు దూరంగా ఉండవచ్చన్నది చాలామంది అభిప్రాయం. అయితే ఇందులో కొంతవరకూ మాత్రమే నిజం ఉంది అంటున్నారు పరిశోధకులు. ప్రతిరోజూ ఎక్కువ మోతాదులో గ్రీన్ టీ తీసుకుంటే స్త్రీలలో సంతానోత్పత్తి తగ్గే ప్రమాదం ఉందని వారు హెచ్చరిస్తున్నారు. ఎలుకల మీద నిర్వహించిన పరిశోధనలో ఈ విషయాన్ని వారు గమనించారు. అయితే గ్రీన్ టీలో ఏ పదార్థం సంతానోత్పత్తిని అడ్డుకుంటుందన్న విషయాన్ని మాత్రం వీరు స్పష్టం చేయలేకపోతున్నారు. రోజు మొత్తంలో ఒకటి లేదా రెండు కప్పులు మాత్రమే తాగాలని వారు సూచిస్తున్నారు.



## లాలి పాటతో డిప్రెషన్ దూరం?

బిడ్డ కోసం తల్లి పాడే లాలిపాట వల్ల బోలెడు లాభాలున్నాయి అంటున్నారు మియామీ యూనివర్సిటీ పరిశోధకులు. ఇందుకోసం సుమారు వంద మంది పసిపిల్లల మీద వీరు పరిశోధనలు నిర్వహించారు. పసిపిల్లలకు పది రకాల గొంతులు వినిపించారు. అందులో తల్లి పాడే లాలిపాటకే బిడ్డ మెదడు ఎక్కువగా ప్రతిస్పందించడాన్ని పరిశోధకులు గుర్తించారు. ఆ పాట వింటున్న సమయంలో వారి మెదడు మరింత చురుకుగా పనిచేయడం కూడా గమనించారు. అదే విధంగా బిడ్డ కోసం పాడే లాలిపాట తల్లికి కూడా ఆరోగ్యాన్నిస్తుందని పరిశోధకులు చెబుతున్నారు. లాలిపాట పాడుతూ తల్లి అప్పటివరకూ పడిన శ్రమనూ, ఒత్తిడినీ మరిచిపోవడాన్ని వీరు గుర్తించారు. పిల్లల పెంపకంలో ఎదురయ్యే ఒత్తిడి, ఆందోళన వంటి వాటి నుంచి తల్లి లాలిపాట పాడడం ద్వారా సాంత్వన పొందుతుందని అంటున్నారు. పిల్లలకోసం తల్లి పాడే లాలిపాటను తేలికగా తీసిపారేయడానికి వీలు లేదని వీరు స్పష్టం చేస్తున్నారు.



## మాతృత్వానికి ద్రాక్షపండు?

వేసవిలో విరివిగా లభించే ద్రాక్ష పండులో పలు రకాల ఆరోగ్య ప్రయోజనాలు దాగున్న సంగతి తెలిసిందే! ఆ పండే ఇప్పుడు స్త్రీలలో మాతృత్వాన్ని కలిగించడానికి దోహదపడుతుందన్న విషయం ఇటీవల నిర్వహించిన పరిశోధనల్లో వెల్లడైంది. మాతృత్వానికి అడ్డుగా నిలిచే సమస్యలో ఎండోమెట్రియోసిస్ ముఖ్యమైంది. ఈ సమస్యే ఆడవారిని మాతృత్వానికి దూరం చేసే అవకాశం ఉంది. ఈ సమస్యకు ద్రాక్షపండుతో చెక్ పెట్టవచ్చు అనే విషయాన్ని పరిశోధకులు గుర్తించారు. కొన్ని ఎలుకలకు క్రమం తప్పకుండా ద్రాక్షపళ్లు అందించి అనంతరం వాటి సంతానోత్పత్తిని గమనించారు. వీటిలో మార్పును వీరు స్పష్టంగా గమనించారు. పండులోని మెలటోనిన్ ద్వారా వాటి పరిస్థితిలో మార్పు స్పష్టంగా కనిపించిందట! స్త్రీలు వీటిని ఎక్కువగా తీసుకోవడం వలన అండాశయంలో కొన్ని లోపాలను సరిచేసుకోవచ్చు అని వారు చెబుతున్నారు. అయితే కేవలం ద్రాక్షపండు తినడం వలనే మాతృత్వానికి చేరువ కావచ్చా? అనే విషయం మీద వీరు ఇంకా పరిశోధనలు నిర్వహిస్తున్నారు.



—అవినాష్

## హెర్పిస్, గనేరియాలకు సరైన వైద్యం

**హెర్పిస్ :** పురుషాంగంపైన చెమట పొక్కుల మాదిరిగా నీటి పొక్కులు కనిపిస్తాయి. నీటిపొక్కులు ఎర్రగా ఉండి దురద ఉంటుంది. నీటిపొక్కులు పగిలి ఎర్రగా పుండు పడుతుంది. లైంగిక కలయిక ద్వారా సంక్రమించే ఇటువంటి వ్యాధిని హెర్పిస్ అని అంటారు. లైంగిక కలయిక ద్వారా వచ్చే ఈ వ్యాధి పదే పదే వస్తూ బాధిస్తుంది. రోగనిరోధక శక్తి తగ్గినపుడు మళ్లీ కనిపిస్తుంది. కొన్నిసార్లు ఒకటి రెండు సంవత్సరాల తరువాత బయటపడవచ్చు. ఈ వ్యాధి ఉన్నా ప్రాణహాని మాత్రం ఉండదు. స్త్రీలలో యోని మీద చిన్న చిన్న పొక్కులలాగా వచ్చి ఎర్రగా మారి విపరీతమైన నొప్పి రావడానికి ఆస్కారం ఉంటుంది.

**గనేరియా :** యుక్తవయస్సు వారిలో ఎక్కువగా కనిపిస్తుంది. జననాంగాలు, నోరు, ఆనస్ వరకు వ్యాప్తి చెందుతుంది. భాగస్వామిలో ఒకరికి ఈ వ్యాధి ఉన్నా మరొకరికి సంక్రమిస్తుంది. గర్భిణిగా ఉన్నప్పుడు గనేరియా ఉంటే పిల్లలకు వచ్చే అవకాశం ఉంటుంది. మూత్రంలో మంట, ద్రవం కారడం, దుర్వాసన వంటి లక్షణాలు కనిపిస్తాయి. స్త్రీలలో నెలసరి మధ్యలో రక్తస్రావం, మూత్రనాళంలో మంట, గర్భకోశ వ్యాప్తి ద్వారా సంతానలేమి, అండాశయ వాపు, గర్భకోశ వాపు, ట్యూబులు మూసుకోవడం జరుగుతుంది.

**హోమియో చికిత్స**

హోమియో చికిత్స మానసిక, శారీరక లక్షణాలపై ఆధారపడి పనిచేస్తుంది. రోగనిరోధక వ్యవస్థను శక్తి వంతం చేసి మూల కారణాన్ని గుర్తించి సమూలంగా నిర్మూలిస్తుంది. అనుభవజ్ఞులైన వైద్యుని పర్యవేక్షణలో మందులు వాడితే లైంగిక సమస్యలు సులభంగా పోతాయి.

## కాలేయ జబ్బుకు కచ్చితమైన చికిత్స

**ఒకరోజు** సుమారు 45 సంవత్సరాల వయస్సున్న ఒక వ్యక్తి మా క్లినిక్‌కు వచ్చాడు. అతన్ని చూడగానే తీవ్రమైన జబ్బుతో బాధపడుతున్నాడని అర్థమైంది. విషయం ఏంటని అడిగితే ఇలా చెప్పుకొచ్చాడు. "ఆరు నెలల క్రితం కడుపు నొప్పి మొదలయింది. పరీక్ష చేయిస్తే కామెర్లన్నారు. మందులు వాడాను. కానీ ఫలితం లేదు. ఆకలి బాగా తగ్గిపోయింది. వాంతి వస్తున్నట్లుగా ఉంటుంది. ఒళ్లంత నొప్పులు, మూత్రం పచ్చగా వస్తోంది. పొట్ట కూడా ఉబ్బుగా ఉంటోంది. కాళ్లు వాస్తున్నాయి" అని తన బాధనంత వివరించాడు. ఆల్కహాల్ తాగే అలవాటు ఉందా? అంటే ఉందని అన్నాడు. గత రిపోర్టులను చూస్తే జాండిస్ అని తెలుస్తున్నా హెపటైటిస్ ఉందేమో ఒకసారి కన్‌ఫార్మ్ చేసుకోవడం మంచిదని చెప్పా. ఈ పరీక్షలన్నీ చేయించి రిపోర్టులతో మళ్లీ వచ్చి కలువు అని చెప్పా. సాయంత్రం రిపోర్టులతో వచ్చాడు. నేను ఊహించినట్టుగానే హెపటైటిస్ ఉన్నట్లుగా తేలింది. అదే విషయాన్ని ఆయనకు చెప్పా. భయపడాల్సిన అవసరం లేదని మంచి మందులున్నాయని ధైర్యం చెప్పి క్రమం తప్పకుండా సూచించిన మందులు వాడమన్నా.

**చికిత్స తరువాత :** హెపటైటిస్ వైరస్‌ను సమర్థవంతంగా అడ్డుకునే చికిత్స హోమియో విధానంలో ఉంది. వైరల్ లోడ్‌ను పూర్తిగా తగ్గించడం ద్వారా ఆరోగ్యవంతమైన జీవనం గడిపే అవకాశం దక్కుతుంది. కాలేయ సమస్యలకు హోమియో మందులు బాగా పనిచేస్తాయి. చికిత్స మొదలు పెట్టిన నెల రోజుల్లోనే మంచి ఫలితం కనిపించింది. మూడు నెలల తరువాత ఆకలి బాగా పెరిగిందని చెప్పుకొచ్చాడు.

**Dr. K Ravikirane**

M.D.,M.sc(psych), P.G(virology)LONDON

గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్సీ ఇన్ మెడిసిన్

**మాస్టర్స్ హోమియోపతి**

అమీర్‌పేట్, కూకట్‌పల్లి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్, విజయవాడ, కరీంనగర్, విశాఖపట్నం,తిరుపతి

ఫోన్ : 7842 106 106, 9032 106 106

V6లో ప్రతి మంగళవారం మధ్యాహ్నం 2:30కి

సాక్షిలో ప్రతి శనివారం మధ్యాహ్నం 2:30కి

10టీవీలో ప్రతి ఆదివారం మధ్యాహ్నం 3:30కి డాక్టర్‌గారి లైవ్ కార్యక్రమం ఉంటుంది.



## హెచ్ఐవిని వాళ్లు జయించారు

**ఎన్నో** ఆశలతో పెళ్లి చేసుకుని దాంపత్య జీవితంలోకి అడుగుపెట్టిన వారికి ఆరు నెలల తిరగకముందే ఊహించని విషయం బయటపడింది. ఆత్మహత్య చేసుకుందామనుకున్న ఆ దంపతులకు హోమియోతో కొత్త జీవితం మొదలయింది. ఆ కేస్‌స్టడీ వివరాలు.

హిందూపురంకు చెందిన ఆదికి శిరీషతో వివాహం అయింది. ఎంతో ముచ్చటైన జంట. ఇద్దరి మధ్య ఎటువంటి అమరికలు లేవు. పెళ్లయిన ఆరు నెలల తరువాత శిరీష గర్భవతి అయింది. హాస్పిటల్‌కు వెళితే పరీక్షలన్నీ చేశారు. అప్పుడే ఒక నిజం బయటపడింది. శిరీషకు హెచ్ఐవి పాజిటివ్ అని. ఒక్కసారిగా ఆ దంపతుల కలలన్నీ కల్లలయి పోయినట్టుగా అనిపించాయి. అబార్షన్ చేయించుకోవాలా? చేయించుకుంటే అందరికీ ఏం సమాధానం చెప్పాలి? తాము మాత్రం బతికి సాధించేదేంటి? ఇలాంటి ఆలోచనలెన్నో వాళ్ల మదిలో తొలిచేసేవి. చివరకు ఆత్మహత్య చేసుకోవడం ఒక్కటే మార్గమని నిర్ణయానికి వచ్చారు. ఆ పరిస్థితిలో వాళ్ల తల్లిదండ్రులు వారిని మా క్లినిక్‌కు తీసుకువచ్చారు.

హెచ్ఐవి పేరు వింటనే తెలియని భయం కలగడం సహజమే. ఎందుకంటే చికిత్స లేని వ్యాధి అది. నిజమే. కానీ ఇప్పుడు అద్భుతమైన మందులు అందుబాటులోకి వచ్చాయి. వైరస్ పూర్తిగా శరీరంలో నుంచి తొలగిపోకపోయినా ఆ వైరస్ ఎటువంటి ప్రభావం చూపకుండా చేసే హోమియో మందులున్నాయి. హోమియో చికిత్స రోగనిరోధక వ్యవస్థను శక్తివంతం చేస్తుంది. సీడీ 4 కణాల సంఖ్య గణనీయంగా పెరుగుతుంది. ఆకలి బాగా పెరగడంతో బరువు పెరగడం ప్రారంభిస్తారు. హోమియో ద్వారా అందరిలా సాధారణ జీవితం గడిపే అవకాశం లభిస్తుంది. ఇదే విషయాన్ని వారికి వివరించి చికిత్సను అందించా. ఇప్పుడా దంపతులకు ఒక పాప. వాళ్లు ఏ సమస్య లేకుండా హాయిగా ఉన్నారు.

## ఆరు నెలల్లో వెరికోస్ వీన్స్ మాయం

**మిర్యాలగూడ** నుంచి 55 ఏళ్ల వ్యక్తి ఒకరు ఒకరోజు మా క్లినిక్‌కు వచ్చాడు. సమస్య ఏంటని అడిగితే కాళ్లు చూపించాడు. కాళ్ల పిక్కల భాగంలో నరాలు ఉబ్బిపోయి నీలం రంగులో కనిపిస్తున్నాయి. ఏం పనిచేస్తారని అడిగితే వ్యవసాయం అని చెప్పాడు. ఎప్పటి నుంచి ఇలా ఉంది అని అడిగితే చాలా ఏళ్లుగా ఉందని, ఈ మధ్యకాలంలో ఎక్కువయిందని చెప్పుకొచ్చాడు. దానివల్ల ఎటువంటి ఇబ్బంది లేకపోవడంతో పట్టించుకోలేదు అని అన్నాడు. ఇప్పుడు కాళ్లు బాగా లాగుతున్నాయిని, దురద ఉంటోందని అన్నాడు. భయపడాల్సిన పనిలేదని, ఈ సమస్యను వెరికోస్ వీన్స్ అంటారని చెప్పాను. కొంతకాలం మందులు వాడితే తగ్గిపోతుందని చెప్పాను. కాలి పిక్కల భాగంలో ఉండే నరాల (సిరలు) మెలిపడటం వల్ల ఈ సమస్య ఉత్పన్నమవుతుంది. సాధారణంగా రక్తం ఉపరితల సిరల నుంచి డీప్ వెయిన్స్‌కు, అక్కడ నుంచి గుండెకు సరఫరా అవుతుంది. అయితే ఈ ప్రక్రియ విఫలమైనప్పుడు రక్తం ఉపరితల సిరల్లోనే నిలిచిపోతుంది. ఫలితంగా సిరలు ఉబ్బిపోతాయి.

**హోమియో చికిత్స తరువాత**

ముందుగా ఒక నెలరోజులకు మందులు ఇచ్చి వాడమని చెప్పాను. సరిగ్గా చెప్పినట్టుగా ఆరునెలల పాటు మందులు వాడాడు. దాదాపు 90 శాతం వరకు సమస్య తగ్గిపోయింది. కాళ్లు లాగడం, దురద వంటివి తగ్గిపోయాయి. చాలా మంది ఈ సమస్యకు చికిత్స లేదని వైద్యుల దగ్గరకు వెళ్లకుండా ఉండిపోతారు. కానీ హోమియో వైద్యంతో వెరికోస్ వీన్స్ సమూలంగా తొలగిపోతుంది. హోమియోలో మూలకారణాన్ని తొలగించే విధంగా చికిత్స ఉంటుంది. కాబట్టి వ్యాధి నుంచి పూర్తిగా విముక్తి లభిస్తుంది. పైగా ఎటువంటి దుష్ప్రభావాలు ఉండవు.

**ఎస్ఎమ్ఎస్‌తో మాటలు**
**ఎమ్ఎమ్ఎస్‌తో ఆటలు**
**ఫేస్‌బుక్‌లో చాటింగ్**
**సెల్‌ఫోన్‌తో టాకింగ్**
**ట్విట్టర్ మొత్తం ఫ్రెండ్స్ మయం**
**వాట్సాప్ యాప్ అప్‌డేట్స్‌తో సెల్ నిండిపోతుంది.**

తింటున్నా, పడుకున్నా, నడుస్తున్నా సరే చేతిలో సెల్ ఉండాల్సిందే. ఎంతలా అంటే ప్రతి చిన్న పనినీ సోషల్ మీడియాలో చూపించేందుకే తాపత్రయపడుతున్నారు. వలలో పడిన చేపపిల్ల బయటకి రావడానికి ఎలా కొట్టుకుంటుందో ఇంటర్నెట్ వలలో పడిన టీనేజర్లు కూడా అలాగే బయటకు రావడానికి కొట్టు మిట్టాడుతుంటారు..



# అతుక్కుపోతే అంతే!

'వాట్ బ్రో. ఎఫ్‌బీలో పోస్టింగ్ చూశా. అదిరిందిలే..' ఫేస్‌బుక్‌లో ఓ టీనేజర్ ఫ్రెండ్ మెస్సేజ్. ఆ మరుక్షణమే 'ఎస్ డ్యూడ్.... మూడురోజుల టూర్ ఎంజాయ్ చేశా' అంటూ అటువైపు సమాధానం. 'ఏంట్రా.. ఈ మధ్య బయటకు రావడం మానేశావ్' అంటే 'ఆ.. ఏముంది వీడెప్పుడూ సోషల్ మీడియాలోనే మునిగి తేలుతున్నాడంటూ సెటైరు. ఏ సమాచారం పంచుకోవాలన్నా వాట్స్ యాప్, ట్విట్టర్, ఫేస్‌బుక్, వుయ్‌చాట్ ఇలా ఏదో దానిలో కలుద్దామనే ధ్యాసలోనే ఉంటున్నారు నేటి తరం టీనేజర్స్. లైక్‌లు, కామెంట్లు, షేర్లుతోనే సగం కాలం గడిపేస్తున్నారు. తమ పిల్లలు చాటింగ్ చేస్తుంటే అదేమిటో తెలియక ఆందోళనతో సతమతమవుతున్నారు తల్లిదండ్రులు.

టీనేజర్లు ఇలా ప్రలోభాల ఊబిలో కూరుకుపోవడానికి వారే బాధ్యత వహించాలి. వారిపై వారికి కంట్రోల్ లేకపోవడమేనా అంటే కాదనే చెప్పాల్సి వస్తుంది. ప్రపంచీకరణ తెచ్చిన వినియోగ సంస్కృతిలో నిండా మునిగిపోయిన తల్లిదండ్రులు, తమ పిల్లలకు అందుబాటులోకి తెచ్చే ఆధునిక గాడ్జెట్స్, ఇంటర్నెట్ వంటివన్నీ టీనేజర్స్‌ను టెంప్టేషన్స్‌కి గురి చేస్తున్నాయి. మద్యం, సిగరెట్, మత్తు పదార్థాలు ...ఇలా యువతను చెడగొట్టేవి ఎన్నో. తాజాగా ఈ జాబితాలోకి చేరాయి గ్యాడ్జెట్లు, బైక్ రేసింగ్‌లు. వీటి వలలో పడితే జీవితం ఇక గోవిందా కొట్టినట్టే! పెరుగుతున్న సాంకేతికతతోపాటు ఈ అవలక్షణాలు టీనేజర్లను పెడతోవ పట్టిస్తున్నాయి.

## అదో మత్తు పదార్థం

కుర్రకారును దురలవాట్ల ఊబిలోకి దించుతున్న టెంప్టేషన్ సాధనా (గాడ్జెట్స్)ల్లో ప్రధానమైనవి ఎఫ్‌ఎం రేడియోలు, మొబైల్ ఫోన్లు, టీవీలు, సినిమాలు, ఇంటర్నెట్‌లను చెప్పుకోవచ్చు. ఇవి పిల్లల్ని ప్రభావితం చేస్తూ వారిని తప్పుదోవ పట్టించడానికి ఎక్కువ ఉపయోగపడుతున్నాయి. పొద్దుటి నుంచి సాయంత్రం వరకు చేతికి ఆభరణంగా ఉండే సెల్‌ఫోన్‌లో దాదాపు కంప్యూటర్లో కంటే ఎక్కువ సౌకర్యాలే ఉన్నాయి. స్మార్ట్‌ఫోన్లలో ఉండే సౌకర్యాల గురించి అయితే చెప్పక్కర్లేదు. సర్వస్వం అందులోనే ఉన్నాయి. సెల్‌ఫోన్లలో గంటల తరబడి బాతాఖానీ, అనవసరమైన చాటింగ్‌తో టైం వేస్ట్ కావడం ఒకెత్తయితే చదువుపై దృష్టిపెట్టకుండా కెరీర్ కోల్పోవడం ఇంకొకెత్తు.

అవసరమైన వరకైతే ఫరవాలేదు, కానీ పోసుకోలు కబుర్లు, టైంపాస్ ముచ్చట్ల వల్ల అనవసర ఆలోచనలు, భావోద్రేకాలు కలిగే అవకాశముంది. తద్వారా అనర్థాలు తెచ్చే ఎన్నో ఆలోచనలు కలుగుతాయి. దానికి తగినట్లు కార్పొరేట్లు వినియోగదారులనే టార్గెట్ చేస్తూ తక్కువరేట్లు, ఉచిత టారిఫ్‌లతో పోటాపోటీగా ఆఫర్లు గుప్పిస్తున్నాయి. దానితో పిల్లలు రాత్రుళ్లు మేలుకుని చిట్‌చాట్ చేయడం వల్ల అనారోగ్యానికి గురవుతున్నారు. అస్తమానం ఇయర్‌ఫోన్‌లు పెట్టుకోవడం వల్ల చెవి జబ్బులు వస్తున్నాయి. మేధోపరంగానూ బలహీనపడుతున్నారు. ఈ నష్టాలకు రేడియేషన్ ఎఫెక్ట్ తోడై పిల్లలను పలురకాలుగా పీడిస్తోంది. మొబైల్ ఫోన్‌లో యువత బాగా ఉపయోగించేవి ఎస్సెమ్మెస్‌లు, చాటింగ్, ఎఫ్‌ఎం రేడియో, ఇంటర్నెట్, ఎఫ్‌ఎంలో పాటలు శ్రవణానందకరంగానే ఉంటాయి. అయితే పాటల మధ్య ప్రసారమయ్యే ప్రకటనలు, సంభాషణలే యువతను పక్కదారులు పట్టిస్తాయి. రేడియో జాకీలు ప్రేమాదోమా అంటూ ఊదరగొడతారు. ఇది విన్న అమాయక ప్రాయులు అదే ప్రపంచం అనుకుని ప్రేమల కోసం అర్రులు చాస్తూ, చెడువర్తనలోకి జారుకునే ప్రమాదాలున్నాయి. అదేవిధంగా ఫ్రెండ్స్ మధ్య నడిచే నిరంతర ఎస్సెమ్మెస్‌లు, చాటింగ్ సంభాషణలు స్నేహానికి జోష్ తెస్తాయి. ఆకర్షణలు పుట్టిస్తాయి. స్నేహం మాటున అట్రాక్షన్ పెంచుతాయి. అభంశుభం తెలియని నవ యువతీ యువకులను ఊహల్లో ఎక్కడెక్కడికో తీసుకుపోతాయి. అటువంటి కార్యకలాపాలకు వారిని ఉసిగొల్పుతాయి. సోషల్‌మీడియా అయితే వారిని ఎంతో ఉన్నతంగా తీర్చిదిద్దగలదు, సరిగ్గా వాడకుంటే అనర్థాలనూ కొని తేగలదు. అయితే వీటి వినియోగంపై సరైన అవగాహన లేని కారణంగా టీనేజర్స్ వీటివల్ల ఎన్నో రకాలుగా మోసపోతున్నారు. చదువులు నిర్లక్ష్యం చేస్తూ ఆకర్షణల వెంట పరుగు తీస్తూ పలురకాల ప్రమాదాలు కొనితెచ్చుకుంటున్నారు. ఆరోగ్యం, ఆనందం కోల్పోతూ నిస్సహాయులుగా, నిరాశావాదులుగా మారుతున్నారు.



# గంటలకొద్దీ ఆన్‌లైన్‌లోనే!

స్మార్ట్ ఫోన్ల పుణ్యమా అని ఇంటర్నెట్ విని యోగం బాగా పెరిగింది. ముఖ్యంగా యువత గంటలకొద్దీ ఆన్‌లైన్‌లోనే గడుపు తోంది. అయితే, యువతలో పెరిగి పోతున్న ఈ ధోరణి తీవ్ర మానసిక సమ స్యలకు దారితీస్తుందని శాస్త్రవేత్తలు వెల్లడిస్తున్నారు. అంతర్జాలంలో ఎక్కువ సమయం గడిపే యువత అసలు ఏపని మీదా శ్రద్ధ చూపించడం లేదని మనస్తత్వ పరిశోధకులు చెబుతున్నారు. ఎక్కువ సమయం ఇంటర్నెట్ వాడితే యువతపై ఎలాంటి ప్రభావం చూపుతుంది అనే అంశంపై కెనడాలోని మెక్మాస్టర్ యూనివ ర్సిటీ పరిశోధకులు 'ఇంటర్నెట్ అడిక్షన్ టెస్ట్' ద్వారా కొంతమందిని ఎంచుకొని పరి శోధన చేశారు.

వారు వెల్లడించిన ఫలితాల ప్రకారం, ఎక్కువ సమయం సోషల్ నెట్వర్కింగ్ సైట్లలో గడుపుతున్న యువతలో నిరాశావాదం పెరగడంతో పాటు.. వారు దేనిపైనా సరైన ఏకాగ్రత చూపించడంలేదని గుర్తిం చారు. ఇలాంటి వారు తమ రోజువారీ కార్యకలాపాలు నిర్వహించుకోవడంలో విఫలమౌతున్నారని, వీరి సమయపాలన గాడి తప్పుతోందనీ, ఆధునిక మానసిక సమస్యలలో ఇంటర్నెట్ అడిక్షన్ కీలక పాత్ర వహిస్తోందనీ వారి పరిశోధనలో వెల్లడైంది.



### చెడువైపు ఆకర్షణ

ఇక అశ్లీల వెబ్‌సైట్‌ల సంగతి గురించి చెప్పక్క ర్లేదు. లెక్కలేనన్ని వెబ్‌సైట్‌లు టీనేజర్లను పక్కదారి పట్టిస్తున్నాయి. ఇంటర్నెట్ ఒక విజ్ఞాన భాండా గారం. సింగిల్ క్లిక్‌తో సమాచారం మొత్తం తెలుసు కోవచ్చు. ఈ డిజిటల్ యుగంలో నెట్ వినియోగం పెరగడానికి కారణం కూడా విజ్ఞానం వల్లే. అదే సమయంలో అశ్లీలంవల్ల తప్పుదోవ పడుతున్నవారి సంఖ్య పెరుగుతోంది. మనదేశంలో 13-19 మధ్య వయసుండే చిన్నారులు, యువతకు అశ్లీల వెబ్ సైట్ల వల్ల ఎక్కువ హాని జరుగుతోంది. టీనేజర్లలో కలిగే హార్మోన్ల తేడాలవల్ల చాలామంది విజ్ఞాన దాయక అంశాలకంటే అశ్లీలతకు ఎక్కువ ఎడిక్ట్ అవుతుంటారు. మానసికంగా, శారీరకంగా అనా రోగ్యం పాలవుతున్నారు. చదువులో వెనకబడి భవి ష్యత్తు పాడు చేసుకుంటున్నారు.

టీనేజర్లు ఎక్కువగా సోషల్ మీడియాకు అడిక్ట్ అవడానికి తల్లిదండ్రుల అతి గారాబం కూడా కారణం కావచ్చు. సెల్‌ఫోన్లు, ల్యాప్‌టాప్, కంప్యూ టర్ అవసరం లేకున్నా కొనివ్వడం, వాటిని వినియో గించేతీరుపై ఆంక్షలు విధించకపోవడం, కట్టడి చేయకపోవడం కూడా ఈ విచ్చలవిడితనానికి కారణం. ఇదే వారిని ఇంటర్నెట్ అడిక్షన్ డిజార్డర్‌కు లోనయ్యేలా చేస్తోంది. ఇంటర్నెట్ అడిక్షన్ డిజార్డర్ (ఐఏడీ) అనేది ఎప్పటినుంచో వున్న మానసిక వ్యాధి. ఇంటర్నెట్‌కి అడిక్ట్ అయి మానసికంగా ఒక ట్రాన్స్‌లో ఉంటారు. ఇది పాశ్చాత్య దేశాల నుంచి వచ్చింది. జీవితంలో లక్ష్యాలు లేనివారు, కెరీర్ ప్లాన్ చేసుకోనివారు, పూర్ అకడమిక్ స్కిల్స్ ఉన్నవారు ఇటువంటి వాటికి వేగంగా ఎడిక్ట్ అవుతారు. ఈ డిజార్డర్ నుంచి పిల్లల్ని కాపాడాలంటే, వారు ఉప యోగించే గ్యాడ్జెట్స్‌పై కచ్చితంగా పర్యవేక్షణ ఉండాలి. వారి సమక్షంలో ఎక్కువసేపు మీరు నెట్ వాడకూడదు. అశ్లీల వెబ్‌సైట్లకు అలవాటుపడిన వారికి చదువు, ఇంటిపై ధ్యాస ఉండదు. పర్సనాలిటీ డిజార్డర్‌కు లోనవుతారు. గతంలో ఇంటర్నెట్ అడి క్షన్ మూడు శాతంగా ఉంటే ఇప్పుడది 38 శాతానికి చేరింది. ఇంటర్నెట్‌కు బానిసైనవారికి బిహేవియర్ థెరపి చేయించాల్సి వస్తుంది. ఆల్కహాల్, స్మోకింగ్ లాగే ఇంటర్నెట్ ఓ మత్తు పదార్థం వంటిది. దీన్ని బిహేవియరల్ అడిక్షన్ అంటారు. ఏ పనిలోవున్నా రెండు నిమిషాలకోసారి ఫోన్ చూడడం అదో రక మైన అడిక్షన్. పిల్లలతో తల్లిదండ్రుల అటాచ్‌మెంట్ తగ్గడం కూడా ఒక కారణం. పిల్లల ప్రవర్తన ఎప్పటికప్పుడు తల్లిదండ్రులు గమనిస్తుండాలి. ఇంటర్నెట్‌కు ఒక్కసారి దూరమైతే వారు డిప్రెషన్‌కు లోనవుతారు. కోపం తెచ్చుకుంటారు. నిద్రపట్టదు. మద్యానికి అలవాటుపడినవారు అది దక్కకపోతే ఎలా ప్రవర్తిస్తారో వీరూ అంతే. ఇంటర్నెట్ ద్వారా జ్ఞానాభివృద్ధి చేసుకోవాలి. నెగెటివ్స్ వైపు వెళ్ళ కూడదు.

ఇంటర్నెట్ టీనేజర్లను చెడుమార్గంవైపు లాక్కె ళ్ళేందుకు ఉపయోగపడే ఒక టూల్ లాంటిది కూడా. అయితే దీన్ని వినియోగించుకుని భవిష్య త్తుకు బంగారుబాటలు వేసుకోవచ్చు, అదే భవిష్య త్తును అంధకారం కూడా చేసుకోవచ్చు. ఇలాంటి కొన్ని టెంప్టేషన్ల వల్ల టీనేజర్లలో మనోవైకల్యం చోటు చేసుకుంటుంది. అవి ఏవిధంగా ఉంటాయ న్నది ముందు ముందు చూద్దాం!

**— లతాకమలం**

**lathakamalam.me@gmail.com**

## మీరూ టెస్ట్ చేసుకోండి?

ఇంటర్నెట్ అనేది టీనేజర్లపై విపరీత ప్రభావం చూపిస్తుందని అనేక సర్వేల్లో వెల్లడైంది. ఈ కింద కొన్ని ప్రశ్నలున్నాయి. వాటికి సమాధానా లిచ్చి మీ ఇంటర్నెట్ అడిక్షన్ స్థాయి ఎంతలో ఉందో చెక్ చేసుకోండి!

1. **ఫోన్లలో గంటలు గంటలు మాట్లాడుతుంటారా?**
   అవును, కాదు
2. **సెల్‌ఫోన్‌లో మెసేజ్‌లు, కాల్స్ ఏవీ రాకున్నా ప్రతి రెండు నిమిషాలకు ఒకసారి చెక్ చేస్తుంటారా?**
   అవును, కాదు



3. **సెల్‌ఫోన్ లేకుంటే పనవ్వదు అది ఉండాల్సిందే అనే డైలామాలో ఉంటారా ఎప్పుడూ?**
   అవును, కాదు
4. **చుట్టూ నలుగురు ఉన్నా సరే ఫోన్లో తలదూర్చి మీ పని మీరు చేస్తుంటారా?**
   అవును, కాదు
5. **ఎప్పుడూ ఫోనేనా అని మీవాళ్లు మిమ్మల్ని అన్న సందర్భాలున్నాయా?**
   అవును, కాదు
6. **ఏ చిన్న ఎమోషనైనా తట్టుకోలేరా? వాటిని సోషల్‌మీడియాలో అప్‌డేట్ చేస్తుంటారా?**
   అవును, కాదు
7. **ఉదయం లేవగానే ముందు సెల్‌ఫోన్ పట్టుకుని కూర్చుంటారా?**
   అవును, కాదు
8. **సెల్‌లో చాట్ చేస్తూ అర్థరాత్రి వరకు మేల్కొని ఉంటారా?**
   అవును, కాదు

పై ఎనిమిది ప్రశ్నలలో ఐదు ప్రశ్నలకన్నా ఎక్కువ 'అవును' అని వస్తే మీరు సెల్‌కి అడిక్టయినట్లే లెక్క. మీరు సెల్‌ఫోన్ వినియోగం తగ్గించుకోవా ల్సిన అవసరం ఎంతైనా ఉంది. అంతకన్నా తక్కువ వస్తే మీరు కంట్రోల్‌లో ఉన్నారన్నమాట! అంటే అవసరానికి మాత్రమే సెల్ వినియోగిస్తారన్నమాట.

# ఓ అమ్మ కథ

**—పెయ్యేటి శ్రీదేవి**

**అయిదేళ్ళ కూతురు స్నిగ్ధకి అన్నం తినిపించి, కథలూ అవీ చెప్పి నిద్ర పుచ్చింది సుజాత. సడన్‌గా నిద్రలేచి 'అమ్మా! అన్నయ్య ఎప్పుడొస్తాడు?' అనడిగింది. కానీ నిద్ర నుంచి లేవలేదు. నిద్రలో కలవరిస్తోంది. స్నిగ్ధని మెల్లగా జోకొట్టి తను కూడా పక్కన వాటేసుకుని పడుకుంది. సుజాతకి నిద్ర పట్టటం లేదు. ఏవో ఆలోచనలు, తీరని బాధ, ఆవేదన. ఎంత వద్దనుకున్నా వచ్చే కన్నీరు ఆపుకోలేక పోయింది. ఎవరికీ చెప్పుకోలేని తన బాధ మరచిపోవడానికి ప్రయత్నిస్తూ, చిగురంత చిన్ని ఆశతో మనసుని జోకొట్టుకుంది. కాని బతుకుమీద నిరాశ. అయినా బతకాలి. చిన్నారి స్నిగ్ధ కోసమైనా బతకాలి, తప్పదు.**



'ఏ తల్లి అయినా పిల్లల కోసమే బతకాలను కుంటుంది. వాళ్ళు జీవితంలో స్థిరపడ్డాక భర్త చేతుల మీదుగా పోవాలనుకుంటుంది.' మన పురాణకాలం నుండీ వస్తున్న భారత స్త్రీ మనో గతం అదే!

స్నిగ్ధ పూర్తిగా పడుకున్నాక మెల్లగా లేచి, ఇంటర్నెట్ ఆన్ చేసింది సుజాత. ఫేస్‌బుక్ ఓపెన్ చేసింది.

'ఓ తండ్రి మహానుభావుడు ల్యాప్‌టాప్ చూసు కుంటున్నాడు. ఎనిమిది నెలలు ఉన్న పిల్లవాణ్ణి గోడకి స్టిక్కర్లువేసి, వేలాడదీసి, తన పని తను చూసుకుంటున్నాడు. అందరూ లైకులు, కామెంట్లు ఇస్తున్నారు. అది నచ్చక విమర్శించిన వాళ్ళని దుర్భాషలాడుతున్నారు. రానురాను ఇరుగుపొరుగు గొడవలా తయారయ్యేలా ఉందని విమర్శించిన వాళ్ళు ఊరుకున్నారు. పూర్వం పక్కపక్క ఇళ్ళ వాళ్ళు పడకపోతే, గోడ అవతల నుంచి వాళ్ళు, ఇవతల నుంచి వీళ్ళు గట్టిగా పోట్లాడుకునేవారు. ఇప్పటి రోజుల్లో ఇంటర్‌నెట్ వచ్చాక ఫేస్‌బుక్‌లో పోట్లాడుకుంటున్నారు.

ఇప్పుడు ప్రపంచమంతా కంప్యూటర్‌లో ఒదిగి పోయింది. భూలోకం, ఫేస్‌బుక్ లోకం అయిపో యింది. అందుకే ఎక్కడ, ఏ మారుమూల ఏం జరుగుతున్నా అన్ని విషయాలు, తెలియకూడనివి కూడా అందరికీ తెలుస్తున్నాయి.

ఆలోచిస్తూ మరో క్లిప్పింగ్ చూస్తోంది. ఓ ఏడాది బాబేమో, బోర్లా పడుకుని నోట్లో మూడు వేళ్ళూ వేసుకుని టెన్షన్‌తో హిందీ పేపరు చూస్తున్నాడు. దేనికో తెలుసా? ఎల్.కె.జి. రిజల్ట్స్ కోసం! అంత వేదనలోనూ సుజాతకి ఫక్కున నవ్వొచ్చింది. బుజ్జిబాబు, ఎంత బాగున్నాడో అనుకుంది. మళ్ళీ అంతలోనే బాధ. తన బాబు అచ్చం ఇలాగే ఉండేవాడు.

మరో క్లిప్పింగ్, ఇంకో బుజ్జిగాడు. వాడూ ఓ మూల నిల్చుంటాడు. ఎల్.కె.జి. అయిపోయింది. స్కూలుకెళ్ళనంటున్నావ్, వెళ్ళకుండా ఏం చేస్తా వురా?' అని తండ్రి అడుగుతాడు. 'జాబ్ చేస్తా' అంటాడు. 'ఏం జాబ్ చేస్తావురా?' 'ఎల్.కె.జి. వాళ్ళకి ట్యూషన్ చెబుతా'. ఆ చిన్నబాబుని చూసి పగల బడి నవ్వింది సుజాత. మళ్ళీ తన బాబు గుర్తొ చ్చాడు. మనసు కలుక్కుమంది.

సుజాత నవ్విన నవ్వుకి ఉలికిపాటుతో లేచింది అత్తగారు. 'ఏమే, ఇంకా పడుకోలేదా? త్వరగా పడుకో' అంటూ నిద్రలోకి జారుకుంది ఆవిడ.

సుజాత మళ్ళీ మౌస్ ముందుకి జరిపింది. ఈసారి వీడియో క్లిప్పింగ్ మీద క్లిక్ చేసింది.

'ఒక గట్టుమీద బుద్ధిగా పడుకున్న కుక్కని ఒక కోతి కవ్విస్తోంది. తోక లాగి, కాలు లాగి ఏడి పిస్తోంది. కుక్క మొరగ్గానే, గట్టుదిగి పారిపో తోంది. మళ్ళీ గట్టెక్కి కుక్కని తన కాలుతో దాని తోక లాగడం, మళ్ళీ కుక్క అరవగానే అంద కుండా పారిపోవడం... అందుకే కామోసు కోతి చేష్టలంటారు. అంత బాధలోనూ ఆ కోతి చేష్టలకి నవ్వుకుంది సుజాత.

మళ్ళీ మౌస్ జరుపుతూ ఇంకో వీడియో క్లిప్ నొక్కింది. ఇదీ కోతి చేష్టే. కానీ విచిత్రమేమంటే ఈసారి దాని అల్లరి రెండు పెద్ద పులుల మీద. ఆ పెద్దపులుల తోక లాగడం, అవి దానిమీద కొచ్చేలోగా మెరుపుతీగలా చెట్టుమీదకెళ్ళిపోవడం, మళ్ళీ ఒక చేత్తో చెట్టు ఊడ పట్టుకుని మరో చేత్తో పెద్దపులిని కవ్వించడం, మళ్ళీ చెట్టుమీదకెళ్ళడం... అంతపెద్ద పులి కూడా పాపం కోతి చేష్టలకి లోకువే.

మరో వీడియో క్లిప్పింగ్ మీద ఆగింది మౌస్.

ఒక వయసు మళ్ళినావిడ 'అహ నా పెళ్ళంట' పాటకి డాన్స్ చేస్తోంది. మరో క్లిప్పింగ్‌లో ఇంకా పెద్దా విడ మ్యూజిక్‌కి డాన్సు చేస్తోంది.

నవ్వుకుంది సుజాత. ఒకప్పటి రోజుల్లో టీవీలు లేవు. సెల్‌ఫోన్ కాదు కదా, మామూలు ఫోన్ కూడా లేదు. ఇంట ర్నెట్ లేదు. చెత్త సిని మాలు లేవు. అప్పటి వాళ్ళ జీవితాలు ఎంత సంప్రదాయబద్ధంగా, సంస్కారవంతంగా, పద్ధ తిగా, నీతి నియమాలతో ఉండేవి? ఇన్నేళ్ళుగా బందిఖా నాల్లో ఉన్నట్టు అనిపించిందేమో వాళ్ళకి, పెద్ద మనుషులుగా చెలామణి అయ్యే ఈ వృద్ధమానవులు కూడా ఇప్పుడు విచ్చ లవిడిగా డాన్సులు చేసి తెగరెచ్చిపోతున్నారు, ఇన్నేళ్ళూ వాళ్ళు కోరికలు అణిచిపెట్టుకుని బ్రతికి నట్టు!

కంటిమీదకి నిద్ర ముంచుకొస్తోంది. కునికి పాట్లు పడుతోంది. అయినా అలాగే నిద్ర ఆపు కుంటూ అనుకోకుండానే ఇంకో వీడియో క్లిప్పింగ్ చూసింది. అది చూస్తూ, 'బాబూ! బాబూ!' అంటూ స్పృహ తప్పి పడిపోయింది.

'రాత్రంతా మేలుకుని ఆ ఫేస్‌బుక్కు చూడద్దే, అంటే నా మాట వినవేం? కళ్ళకీ ఇబ్బంది, నీ ఆరో గ్యమూ పాడవుతోంది. ఆ ఫేస్‌బుక్కులో అవీ ఇవీ

చూస్తావు. ఎవరన్నా ఆరేళ్ళ పిల్లలు కనిపిస్తే చాలు, బాబూ బాబూ అంటూ పడిపోతావు. ఎలా గమ్మా సుజాతా? గుండె దిటవుచేసుకో. పోయిన పిల్లాడు తిరిగొస్తాడా చెప్పు? నాకు మాత్రం బాధ లేదూ? ఇహ అబ్బాయి శ్రీధరం క్యాంపుల్లో తిరుగుతుంటాడు. నువ్విలా ఉంటే వాడు ఉద్యోగం ఎలా చెయ్యగలడు? స్నిగ్ధ కోసమైనా సంతోషంగా ఉండమ్మా. జీవితం అంటే ఇంతే. అంతా మనమనుకున్నట్లుగా జరుగుతుందా చెప్పు? రుణం తీరిపోయింది. ఆరేళ్ళకే వాడికి ఆయువు తీరిపోయింది. వెళ్ళిపోయాడు. ఊరుకో. ఈ మంచి నీళ్ళు తాగు. ఇప్పుడు అర్ధరాత్రి రెండుగంటలైంది. ఆ ఇంటర్నెట్ కట్టేసి పడుకోమ్మా. మళ్ళీ పొద్దున్నే లేవాలి, స్నిగ్ధని స్కూలుకి పంపించాలి. ఎన్ని బాధలున్నా, ఆడవాళ్ళు తెల్లారి లేస్తే బోలెడు పనులు. ఎవరూ చేయరు. మనమే చేసుకోవాలి,' అంటూ సుజాత అత్తగారు, సుజాత మొహం మీద నీళ్ళు చల్లి, మంచినీళ్ళు తాగించింది.

'అది కాదత్తయ్యా. నిజంగానే నా బాబు ఒక క్లిప్పింగ్లో కనిపించాడు. బర్త్‌డే ఫంక్షను గ్రాండ్‌గా చేస్తున్నారు. వాడు వాళ్ళ బాబు కాదు. నా బాబే! నా బాబు చనిపోలేదు. ఇంకోళ్ళ పిల్లాణ్ణి తీసుకొచ్చి ఇదుగో, మీ బాబు చనిపోయాడంటూ చూపించారు. ఆ పిల్లాడికే దహన సంస్కారాలు చేశారు. పిల్లలందరూ యూనిఫాంలో ఉన్న మూలానా గుర్తుపట్టడం కుదరలేదు. పైగా మొహమంతా బ్యాండేజీలు వేశారు. నేనిచ్చిన టిఫిన్ బాక్స్ ఆ పిల్లాడి సంచిలో ఉందని, టిఫిన్ బాక్సుని బట్టి ఆ పిల్లాడే నా బాబు అనుకున్నారు.

బాక్సులు మారి ఉండవచ్చు అనుకుంటున్నాను. ఉండండి, మళ్ళీ ఆ క్లిప్పింగ్ చూపిస్తా' అంటూ వీడియో క్లిప్పింగ్ ఆన్ చేసింది. బర్త్‌డే కేక్ కట్ చేస్తున్నాడు. బంధువులు, ఇంకా ఫ్రెండ్స్ అనేక మంది ఉన్నారు. తల్లి, తండ్రిగా చెలామణి అయ్యే బాబు సంరక్షకులు బాబుని ఎత్తుకుని ముద్దాడుతున్నారు.

'అత్తయ్యా, చూడండి, మన బాబే కదా? ఖచ్చితంగా నా బాబు చనిపోలేదు. ప్రతిరోజూ నాకు కలలు కూడా వస్తున్నాయి బాబు ఉన్నట్టుగా. ఏమైనాసరే, మన బాబుని తెచ్చుకోవాలి'.

***

సరిగ్గా ఏడాది క్రితం జరిగిన సంఘటన.

సుజాత ఆ రోజు కొంచెం అటూఇటూగా లేచింది. స్నానం చేసి హడావిడిగా బాబు సతీష్‌ని కాన్వెంటుకు రెడీ చేసింది. టిఫిన్ తినిపించింది. కడుపునొప్పిగా ఉంది, తినలేనన్నాడు. ఆకలి నొప్పేమో అని కూరి కూరి పెట్టింది. లంచ్‌బాక్స్ ఇచ్చింది. ఈలోగా స్కూలు వ్యాన్ వచ్చింది.

'మమ్మీ! ఇవాళ స్కూలుకెళ్ళను. పొట్టలో బాగా లేదు' అన్నాడు. ఏదో నచ్చజెప్పి, వ్యానులోకి ఎక్కించింది. తరువాత భర్తకి టిఫినుపెట్టి, లంచ్ బాక్స్ ఇచ్చింది. కూతురు స్నిగ్ధని తయారుచేసి దగ్గరలో ఉన్న ప్లేస్కూలుకి తీసుకెళ్ళింది.

అత్తగారు టీ.వీ. చూస్తోంది. ఒక స్కూలు బస్సు రైల్వే ట్రాక్ దగ్గర పడిపోయి, తునాతునకలై ఉంది. స్కూలు పిల్లలందరూ పడిపోయి ఉన్నారు. టిఫిన్ బాక్సులు, బ్యాగులు చెల్లాచెదురుగా పడి ఉన్నాయి. పిల్లల ఆర్తనాదాలతో చాలా హృదయవిదారకమైన వాతావరణం నెలకొంది. పిల్లల తాలూకు తల్లిదండ్రులు అక్కడికి చేరుకుని కన్నీరు మున్నీరై ఏడుస్తున్నారు.

**ఉన్న ఒక్క కూతురుకీ అన్నం తినిపించి కథలు చెప్పి నిద్రపుచ్చిందామె. అన్నయ్య ఎప్పుడొస్తాడూ? అంటూ లేచి కలవరిస్తోందా కూతురు. ఆ తల్లిది ఎవరికీ చెప్పుకోలేని ఆవేదన. నిద్రపట్టక ఫేస్‌బుక్ ఓపెన్‌చేసి వీడియో క్లిప్పింగ్స్ చూస్తోంది. ఒక పిల్లాడి బర్త్‌డే సెలబ్రేషన్స్ చూసి ఆశ్చర్యపోయింది. నా బాబు! నా బాబు.. బతికే ఉన్నాడు అంటూ ఆనందపడిపోయింది! ఇంతకీ ఆమెది భ్రమా? నిజమా? ఆమెకేం కావాలి?**

ఇంతలో సుజాత స్నిగ్ధని ప్లేస్కూల్లో దింపి ఇంటికి వచ్చాక, టీవీలో అత్తగారు చూస్తున్న దృశ్యాలు చూసి స్థాణువైపోయింది. 'అత్తయ్యా, అది మన పిల్లాడు వెళ్ళే స్కూలు బస్సు'.

ఇంతలో ఫోను వచ్చింది. 'రైల్వేట్రాకు వద్ద స్కూలు బస్సుకు యాక్సిడెంట్ అయ్యింది, త్వరగా రండి' అని.

భర్త శ్రీధర్ ఆఫీసుకెళ్ళిపోయాడు. అతనికి కూడా ఫోనుచేసి వెంటనే రమ్మని, సుజాత ఆటోలో వెళ్ళింది ఆ ప్రదేశానికి. పిల్లల్ని ఆస్పత్రికి తరలిస్తున్నారు. అంబులెన్స్‌లో కొంతమంది కూర్చున్నారు. ఆటోల్లో, స్కూటర్లమీద పిల్లల తాలూకు తల్లిదండ్రులు ఆ కార్పొరేట్ ఆస్పత్రికి చేరుకుంటున్నారు. తల్లిదండ్రులందరూ తమ పిల్లలకి ఏమీ జరగకూడదని మనసులో ముక్కోటి దేవతలకు మొక్కుకుంటున్నారు. అలాగని పక్కవాళ్ళ పిల్లలకి ఏం జరిగినా ఫరవాలేదని కాదు. ఆ సమయంలో వాళ్ళ బాధ అలాంటిది. ఆస్పత్రిలో పిల్లలకి వెంటనే డాక్టర్లు చికిత్స చేస్తున్నారు. కొంత మంది పిల్లలు వెంటనే చనిపోయారు. కొంత మంది పిల్లలు తీవ్ర గాయాలతో బాధపడుతున్నారు. అభం శుభం తెలియని ఆ పసిపిల్లలకిన్ని కష్టాలా? ఇలా ఎన్ని యాక్సిడెంట్లు అవుతున్నాయి? అయినా ప్రభుత్వాలు, పాఠశాలల యాజమాన్యాలు పట్టించుకోవు. డ్రైవర్ల నిర్లక్ష్య వైఖరి మారదు.

సుజాత భర్త శ్రీధర్ స్కూటరు మీద వచ్చాడు. తీవ్ర గాయాలు, ముఖాలకి కట్లు కారణంగా ఏ తల్లిదండ్రులూ పిల్లల్ని గుర్తు పట్టలేని స్థితిలో ఉన్నారు. పిల్లలకి గాయాలు తగ్గేవరకూ తల్లిదండ్రులు వాళ్ళ వద్దనే ఉన్నారు. తరువాత ఏ ఆధారాల వల్ల నిర్ధారించారో మరి, సుజాత కొడుకు సతీష్ చనిపోయినట్లు సమాచారం అందించారు. సుజాత స్పృహ తప్పి పడిపోయింది. తండ్రి శ్రీధర్ అంతిమ సంస్కారం చేశాడు.

***

కొడుకు పోయాడనుకున్న సుజాతకి ఫేస్‌బుక్‌లో సడన్‌గా కనబడేసరికి, ఆమె ఆనందానికి అవధులు లేవు.

'అత్తయ్యా! బాబు... బాబు... నా బాబు బతికే ఉన్నాడు అత్తయ్యా. ఏమండీ, మన బాబు, చూడండి. వాడు మనబాబే... చూడండి' అంటూ ఫేస్‌బుక్‌లో వీడియో క్లిప్పింగ్ చూపించింది.

'నీ పిచ్చిగానీ సుజాతా, వాడు పోయాడని ఆస్పత్రివాళ్ళు నిర్ధారించారుగా? అంతిమ సంస్కారాలు కూడా చేశారు. అప్పుడు నువ్వు స్పృహలో లేవు. నీకు ఎవర్ని చూసినా నీ కొడుకు పోలికలే కనిపించవచ్చు.'



'లేదత్తయ్యా! వాడు ఖచ్చితంగా నా బాబే!' అంటూ ఫేస్‌బుక్‌లో సారథి అనే పేరుతో ఆ క్లిప్పింగ్ పెట్టినవాళ్ళ ప్రొఫైల్ ఓపెన్ చేసి చూసింది. వాళ్ళకి మెసేజ్ పెట్టింది. కాని వాళ్ళ ఫ్రెండింట్లో ఫంక్షన్‌కి వెళ్ళినప్పుడు సెల్‌ఫోన్లో రికార్డు చేశాడట. వాళ్ళ ఫ్రెండ్ వివరాలు కనుక్కుంది సుజాత.

***

కరుణాకర్, భవానీల కొడుకు ప్రదీప్. ఎప్పటిలాగే స్కూల్ బస్సెక్కి వెళ్ళాడు. కరుణాకర్, భవానీ వేరే ఊళ్ళో చిన్న ఉద్యోగాలు చేసుకుంటున్నారు. ఆ కారణంగా అమ్మమ్మ, తాతయ్య ఇంట్లో ఉండి చదువుకుంటున్నాడు ప్రదీప్. అతను వెళ్ళే స్కూలు బస్సుకి యాక్సిడెంట్ అయ్యిందని తెలియగానే, కరుణాకర్ ఆస్పత్రికి వెళ్ళాడు. జ్వరంవల్ల భవానీని వెంట తీసుకువెళ్ళలేదు. ఎక్కడ కంగారుపడుతుందోనని యాక్సిడెంటైన విషయం ఆమెకు చెప్పలేదు. పిల్లాడు ఆసుపత్రిలో చికిత్స పొందుతున్నాడు. బాగా కోలుకున్నాక ప్రదీప్‌ని ఇంటికి పంపించారు. కాని ప్రదీప్‌మీద బెంగపెట్టుకున్న అమ్మమ్మ మరణించింది.

తరువాత కరుణాకర్ ప్రదీప్‌నిచూసి, ఈ పిల్లవాడు మా పిల్లవాడు కాదన్నాడు. స్కూలు యాజమాన్యం మాత్రం కాదు, మీ పిల్లవాడే అని వాదించింది. అసలే యాక్సిడెంట్ విషయం భార్య భవానీకి తెలియదు, ఇన్నాళ్ళకు మళ్ళీ ఇప్పుడు కొడుకు పోయాడని చెబితే భవాని తట్టుకోగలదా? ఏం తంటాలొస్తాయో అని ప్రదీప్‌ని ఆస్పత్రి నించి ఇంటికి తీసుకొచ్చాడు కరుణాకర్.

ఇది జరిగిన ఏడాదికి ప్రదీప్ బర్త్‌డే ఫంక్షన్ చేశారు. కరుణాకర్ ఆఫీసు వాళ్ళు, భవాని పరిచయస్థులు, తెలిసిన వాళ్ళందరూ వచ్చారు. కరుణాకర్ స్నేహితుడు సారథి తన సెల్‌ఫోన్లో వీడియో తీసి, ఆ వీడియోను ఫేస్‌బుక్‌లో పెట్టాడు. సుజాత ఇప్పుడు చూసింది ఆ వీడియోనే. తన బాబు బతికే ఉన్నాడని, ఏదో పొరబాటు జరిగి ఉంటుందనీ, అందుకే మీ అబ్బాయి పోయాడంటూ ఆ బాబును తెచ్చిచ్చారనీ అనుకుంది.

## సినిమా మొత్తం మార్చారట!

*'కాటమరాయుడు' తమిళ సినిమాకి రీమేక్ అన్న సంగతి తెలిసిందే! అయితే తెలుగుకీ, తమిళ సినిమాకీ అస్సలు పోలికే ఉండదని చెబుతోంది ఆ సినిమా హీరోయిన్ శ్రుతిహాసన్. 'కాటమరాయుడు'లో చాలా మార్పులు చేర్పులు చేశారని స్పష్టం చేసింది. తన తొలి బ్లాక్‌బస్టర్ పవన్‌సార్‌తోనే వచ్చిందనీ, మరోసారి ఆయనతోనే బ్లాక్‌బస్టర్ అందుకుంటానని చెబుతోంది. సినీ అభిమానులతో పాటు నేను కూడా ఈ సినిమాను థియేటర్‌లో చూడడానికి చాలా ఆసక్తిగా ఎదురు చూస్తున్నాను అంటోంది.*



సారథి ద్వారా కరుణాకర్‌తో మాట్లాడి, వాడు మా బాబే, దయచేసి మా బాబుని నాకివ్వండి అంటూ వేడుకుంది.

ఏడాది గడిచిన తర్వాత ఈ అనుకోని సంఘటనకి కరుణాకర్ ఏం చెయ్యాలో తెలియని అయోమయ స్థితిలో ఇరుక్కుపోయాడు.

ఇది ఇద్దరు తల్లుల మధ్య జరిగే పోరాటం. అప్పుడు ఆలోచిస్తే అర్థమైంది. యాక్సిడెంట్లో చనిపోయింది తన బాబు ప్రదీపేననీ, తన దగ్గరున్నది సుజాత కొడుకు సతీష్ అనీ గ్రహించాడు కరుణాకర్.

సుజాత రోజూ ఫోన్ చేసి వేధిస్తోంది తన బాబుని తనకివ్వమని. ఒక విధంగా చెప్పాలంటే అది వేధించడం కాదు. కన్నకొడుకు కోసం ఒక తల్లి ఆవేదన. ఒకపక్క సుజాత కన్నీటితో అర్థిస్తుంటే, మరోపక్క తన భార్య భవానికి ఎలా సర్దిచెప్పాలో కరుణాకర్‌కి తెలియట్లేదు.

బాబుని ఫలానా రోజు తీసుకువస్తానని, దిగులు పడొద్దని సుజాతకి చెప్పాడు కరుణాకర్.

ఇక సుజాత ఆనందానికి అవధులు లేవు. తన బాబు వచ్చేరోజున పెద్ద ఫంక్షన్ ఏర్పాటు చేసింది. బంధువులందరినీ పిలిచింది. మంగళతోరణాలు కట్టింది. నా బాబు బతికే ఉన్నాడు, చనిపోలేదంటూ అందరికీ సంతోషంగా చాటిచెప్పుకుంది.

అందరూ ఫంక్షన్‌కి వచ్చారు. కానీ కరుణాకర్ ఇంకా బాబుని తీసుకురాలేదు. ఫోను చేసింది. కాని ఫోను రింగ్ అవ్వడంలేదు. ఫంక్షన్‌కి వచ్చిన వాళ్ళందరూ ఎదురు చూస్తున్నారు. బాబు ఏడీ? అని అడుగుతున్నారు.

సుజాత, ఆమె భర్త బాబుకోసమే ఎదురు చూస్తున్నారు. కాలం వృథాగా గడిచి పోతోంది. స్నిగ్ధ 'అమ్మా! అన్నయ్య ఎప్పుడు వస్తాడు?' అని అడుగుతోంది. సమాధానం చెప్పలేక సుజాత కళ్ళు మూసుకుంది. 'ఏమిటో దీని పిచ్చిగాని, పోయిన పిల్లాడు ఎలా తిరిగి వస్తాడు? స్కూలు యాజమాన్యం, ఆస్పత్రి వాళ్ళు సాక్ష్యాధారాలన్నీ చూసి మీ పిల్లాడు పోయాడని నిర్ధారించే కదా, శవాన్ని అప్పగించారు? ఫేస్‌బుక్‌లో వీడియో చూసి తన పిల్లాడనే అనుకుంది. ఆ పిల్లాడి తాలూకు వాళ్ళతో మాట్లాడి తన బాబుని తీసుకురమ్మంది. ఉదయం నుంచి పచ్చిమంచినీళ్ళు కూడా తాగకుండా ఎదురు చూస్తోంది. బెంగతో ఆరోగ్యం పాడుచేసుకుంటోంది. మరోపక్క వాళ్ళింకా బాబును తీసుకురాలేదు. ఏమన్నా అంటే నా బాబు కలలో కనిపించాడు, బతికే ఉన్నాడంటూ, ఫంక్షన్‌కి అందర్నీ పిలిచింది. అందరూ ఎదురు చూస్తున్నారు' భర్తతో అంటోంది అత్తగారు.

'ఏమండీ, మీ బాబు ఏడీ?' వచ్చిన అతిథులు అడుగుతున్నారు.

'అమ్మా, అన్నయ్యేడి? ఇంకా రాలేదేం? రాలేదేం?' అని స్నిగ్ధ తల్లిని కుదుపుతూ అడుగుతోంది. ఆ కుదుపుతో సుజాత తల వాలిపోయింది.

అప్పుడే మళ్ళీ 'అన్నయ్యొచ్చాడమ్మా! అన్నయ్యొచ్చాడు' అంటోంది స్నిగ్ధ.

బాబుని లోపలికి తీసుకొచ్చాడు కరుణాకర్.

'సుజాతా! నిన్ను అపార్థం చేసుకున్నాను. ఇదుగో నీ బాబు వచ్చాడు.'

'ఇడుగోమ్మా మీ బాబు' కరుణాకర్ పిలుస్తున్నాడు. ఆమె వినిపించుకోవట్లేదు. ఎవరి మాటలూ ఆమె చెవులకు సోకడంలేదు. బాబుని వాటేసుకుందామంటే కాళ్ళు కదలనంటున్నాయి. గొంతు పెగలడంలేదు. ఆ ఇంట కట్టిన పచ్చిమామిడాకుల తోరణాల సువాసనలు ఆమె ముక్కుపుటాలకి సోకట్లేదు.

డాక్టర్‌ని పిలిచారు. 'ఈ జీవితం శాశ్వతం కాదు. ఎప్పుడో ఒకప్పుడు అందరం పోయే వాళ్ళమే' అంటూ వైరాగ్యంగా పెదవి విరిచాడు డాక్టర్.

ఇక్కడ 'ఓ అమ్మ కథ' విషాదంగా ముగిసింది.

ఇక అక్కడ ఇంకో అమ్మను కాపాడుకోవాలి.

మరి చిన్నారి స్నిగ్ధకి అన్నయ్య ప్రేమ కావాలి. తల్లి ప్రేమా కావాలి. అందుకే స్నిగ్ధనూ, ప్రదీప్ అని పిలిచే సుజాత కొడుకు సతీష్‌నీ తన వెంటే తీసుకువెళ్ళాడు కరుణాకర్.

ఆ అమ్మ పిల్లలిద్దర్నీ ప్రేమగా అక్కున చేర్చుకుంది.

## పజిల్ వుడ్

పెద్దవాళ్ళయినా, చిన్నవాళ్ళయినా సరే, పజిల్స్ పూర్తిచేయడానికి ఎంతో ఆసక్తి చూపిస్తారు. అలా పేపర్లో, ఫోన్లలో కాకుండా పజిల్స్ నిజంగా ఆడితే? ఆ మజాయే వేరు! అనుకుంటున్నారు కదా! దట్టమైన అడవిలో అలాంటి గమ్మత్తయిన పజిల్ ఒకటుంది. చూడాలంటే మాత్రం ఇంగ్లండ్ వెళ్ళాల్సిందే.

ఇంగ్లండ్ కోల్‌ఫోర్డ్ సమీప డీన్ అడవిలో 14 ఎకరాల్లో విస్తరించిన ఈ పజిల్ దారి కిలోమీటరున్నర పొడవుంటుంది. నడుస్తూ పోతుంటే గజిబిజి దారులు, వేలాడే వంతెనలు, చిత్రమైన చెట్ల వేరులు దర్శనమిస్తాయి. ఎటువెళితే ఏ దారి వస్తుందో తెలియక తికమకపడతారు. తప్పిపోతామేమో అని భయపడతారు కూడా. సరైన దారి కనుక్కుంటూ ముందుకు వెళ్ళాలి.

చిన్నా పెద్దా తేడా లేకుండా చెట్ల మధ్య దాగున్న ఈ పజిల్‌వుడ్‌ని పూర్తి చేయడానికి బోలెడు మంది వస్తుంటారు. ఎప్పుడో రోమన్ల కాలంలో ఈ ప్రాంతంలో ముడి ఇనుప ఖనిజ నిల్వలుండేవి. వీటి తవ్వకాలతో ఏర్పడిన దారిని 1800 సంవత్సరంలో



ఒకాయన చిన్న చిన్న గజిబిజి దారులతో, వంతెనలతో పర్యాటక ప్రాంతంగా మార్చాడు. ఇదే నెమ్మదిగా పజిల్‌వుడ్ అయింది. ఇంకేం నిజమైన పజిల్‌ని ఆడాలంటే ఇంగ్లండ్ వెళ్ళండి మరి!

## నైఫ్ ఏంజెల్



శిలలపై శిల్పాలు చెక్కుతారు. మహాఅయితే చెక్కతో కూడా శిల్పాలు చేస్తారు. మంచుతో, ఇసుకతో చేసిన శిల్పాలు, విగ్రహాలు మనకు తెలుసు. కానీ కత్తులతో శిల్పం చేయడం విన్నారా?

ష్రోప్‌షైర్‌కు చెందిన బ్రిటీష్ ఐరన్‌వర్క్ సెంటర్ శిల్పులు ఏంజెల్ అనే ఖడ్గశిల్పం తయారుచేశారు. దానికి 'నైఫ్ ఏంజెల్' అని పేరు పెట్టారు. దీన్ని తయారుచేయడానికి లక్ష కత్తులు ఉపయోగించారట. త్వరలోనే లండన్ ట్రఫల్‌గర్ స్క్వేర్‌లో ఈ శిల్పాన్ని ఆవిష్కరిస్తారు. దీని ఎత్తు 27 అడుగులు. అమానుషంగా కత్తులతో జరిగే విచక్షణారహితమైన హత్యలు తగ్గించాలనీ, ప్రజల్లో చైతన్యం కల్పించాలనే ముఖ్య ఉద్దేశంతో ఈ నైఫ్ ఏంజెల్ రూపొందించారు. ఈ శిల్పం తయారీకి కత్తులు ఎలా వచ్చాయనుకుంటున్నారు? లొంగిపోయిన నేరగాళ్ళ దగ్గర్నించి తీసుకున్న కత్తుల్ని పోలీస్ రక్షణదళాలు విరాళంగా ఇచ్చాయట. కరుణకు గుర్తుగా రెండు చేతులూ చాచి కనిపించే ఈ శిల్పం తయారీకి రెండేళ్ళు పట్టింది. ఇందులో ఉన్న కత్తులపై వాటి దాడివల్ల మరణించిన వారి పేర్లు కూడా చెక్కారు.

## సరికొత్త మెడిటేషన్

ఒత్తిడి, ఆందోళనల నుంచి కొందరు పారిపోవడానికి ప్రయత్నిస్తే మరికొందరు తగ్గించుకోవడానికి ప్రయత్నిస్తారు. దానికోసం ఎన్నో రకాల ప్రయత్నాలు చేస్తుంటారు. ఇలాంటి ప్రయత్నాల్లో భాగంగానే చైనాలో ఓ అమ్మాయి సరికొత్త మెడిటేషన్‌కి శ్రీకారం చుట్టింది.




చైనాలోని చోంగ్‌కింగ్ కు చెందిన లీ తైజీ అనే ఆవిడ 'గ్రేవ్‌యార్డ్ మెడిటేషన్' తరగతులు ప్రారంభించింది. మృతదేహాల ను ఖననం చేసే తరహాలో, ఈ మెడిటేషన్‌కు వచ్చేవారిని సమాధి గోతిలో ప్లాస్టిక్ కవర్‌పై పడుకోబెట్టి, వారిలో ఆలోచనలు రగిలిస్తుంది. ఈ మెడిటేషన్ ప్రక్రియవల్ల చాలామంది ఆత్మహత్య ఆలోచనలు విరమించుకోవడమే కాదు, గతం మరిచి కొత్త జీవితం ప్రారంభిస్తున్నారని లీ చెబుతోంది.

విడాకులు తీసుకున్నాక ఆ బాధ నుంచి బయటపడేందుకు తనకు చాలా సమయం పట్టిందని, కానీ ఈ గ్రేవ్‌యార్డ్ మెడిటేషన్ ద్వారా చాలామంది తక్కువ సమయంలోనే కొత్త జీవితం ప్రారంభించి లక్ష్యాలవైపు అడుగులేస్తున్నారని చెబుతోంది. ఏడాదిలో కొద్ది రోజులు మాత్రమే ఈ తరగతులు నిర్వహిస్తూ మహిళల్లో ధైర్యం నింపే ప్రయత్నం చేస్తోంది లీ.






## వెడ్డింగ్ బర్త్ డే

ఆకాశంలో, నీటి అడుగున, జంతువులమధ్య.. ఇలా రకరకాలుగా పెళ్ళిళ్ళు చేసుకుంటున్నారు. కాకపోతే ఆ పెళ్ళిళ్ళలో వధువు, వరుడు ఇద్దరే ఉంటారు. కానీ ఓ అమ్మడు మాత్రం విభిన్నంగా ఆలోచించింది. వినూత్న నిర్ణయం తీసుకుంది.

ఇంగ్లాండ్ సౌత్ యార్క్‌షైర్ నివాసి లిన్నే కాబోయే వరుడి కోసం ఎన్నో కలలు కంది. కానీ నచ్చిన వరుడు దొరకలేదు. ఎవర్నో ఒకర్ని పెళ్ళి చేసుకుని సర్దుకుపోవడం ఇష్టంలేక వివాహం వాయిదా వేస్తూ వచ్చింది. అప్పటినుంచి ఒంటరి జీవితమే! కానీ తనని తానే వివాహం చేసుకుంటే ఎలా ఉంటుంది? అనే ఆలోచన ఈ మధ్యే ఆమెకు వచ్చిందట. మరికనేం! తన పుట్టినరోజు నాడే ఈ వివాహానికి ముహూర్తంగా నిర్ణయించుకుంది. ఆ ఏర్పాట్లలో నిమగ్నమైంది. 'లిన్నేలాస్ 40వ వెడ్డింగ్ బర్త్‌డే సెలబ్రేషన్స్' పేరుతో బంధువులకు ఆహ్వాన పత్రికలు పంపిస్తోంది. బిజినెస్ ఎనలిస్టుగా పనిచేస్తున్న ఆమె నిర్ణయానికి ఆమె తల్లిదండ్రులు కూడా అంగీకరించారు.

**–నర్మదా వాసిరెడ్డి**

# మహానంది



-వక్కంతం సూర్యనారాయణరావ్, సెల్:98662 67287

**వేగంగా, తమకు దూరంగా వెళ్ళిపోతున్న గుర్రాల్ని చూస్తూ, అలాగే నిలుచుండిపోయారు నందీ, లాలసా. కాస్సేపట్లో గుర్రాలు ధూళితెర మాటున అదృశ్యమయ్యాయి.**

**నంది గంగిరెద్దును లాగుతూ, ఆగుతూ లాలసను సమీపించాడు. లాలస అతని ముఖంలోకి చిరునవ్వుతో చూసింది. "నీ గంగిరెద్దు ఉపాయం మనల్ని కాపాడింది."**

"అపాయానికి విరుగుడు ఉపాయమే!"

"ఆ ఆలోచన రావడం నిజంగా గొప్ప విషయమే!" లాలస మెచ్చుకుంది.

"నాకు ఆ ఆలోచన తట్టడానికి కారణం గంగిరెద్దు శరభయ్య. ఆ ఘనత అతనిదే!" నంది నడక ప్రారంభిస్తూ అన్నాడు. "గంగిరెద్దును అమ్మివేయాలన్న అతని ఆలోచన నాలో కొనాలన్న ఆలోచనను పుట్టించింది. ఇంక వేషభాషలు ఆ ఉపాయంలో భాగాలే!"

"ముఖ్యగా నా చూలాలి వేషం..."

"దానికి మాతృక శరభయ్య భార్య. ఆమె నిండు చూలాలు. నేను శరభయ్యను అనుసరించాను. నిన్ను అతని భార్యను అనుసరించమన్నాను. కఠిన సత్యం మాతృక, కల్పన పుత్రిక!" నంది అన్నాడు.

"నా చూలాలి వేషం నాకు కవచం. లేకపోతే సులభంగా దొరికిపోయేదాన్ని!"

"శరభయ్య లెక్క ప్రకారం ఈ రాత్రికి మనం సారంగరాజ్యం ఎల్ల దాటి, పొరుగు రాజ్యంలో ప్రవేశిస్తాం. అది కామరూపరాజ్యానికి పొరుగు రాజ్యమైతే అది మన అదృష్టమే!"

"ఇప్పుడు కామరూప సామ్రాజ్యం మనకు ఎటువైపున, ఎంత దూరంలో ఉంది?" లాలస అడిగింది.

నంది చిన్నగా నవ్వాడు. "కళింగ రాజ్యానికి కామరూప రాజ్యం ఎటువైపు ఉందో తెలుసు. అయితే మెలికలు తిరిగిన నదిలో ప్రయాణం, ఆ తరువాత దారి ఎటుతిరిగితే అటు, అడ్డదిడ్డంగా కాలినడకన ప్రయాణం, చీకటిరాత్రిలో గుర్రం మీద కనిపించని దారిలో పరుగు, గంగిరెద్దుల వాళ్ళ వేషాలు, గమ్యం తెలీని ప్రయాణం... ఎన్నిసార్లు ఎన్ని దిశలు తిరిగామో తెలీని అయోమయ స్థితి! దేశ బహిష్కరణ జరిగేదాకా జన్మించిన రాజ్యాన్ని దాటి ఎరుగను నేను! నీ ప్రశ్నకు సమాధానం చెప్పలేను లాలసా!"

"మనం ప్రవేశించబోయే రాజ్యం కామరూప రాజ్యానికి పొరుగు రాజ్యమూ, స్నేహసంబంధ రాజ్యమూ అయి ఉండాలన్న ఆశ మొలకెత్తుతోంది నాలో!"

"చూద్దాం...నీ ఆశను అదృష్టం వరిస్తుందేమో!!"

***

నంది, లాలస నడుస్తున్న దారి తాటితోపు మధ్యలో ప్రవేశించింది. తాటిచెట్ల పైన కుండలు కట్టి ఉన్నాయి. కల్లు సేకరణ! చెట్లకు వేలాడుతున్న కల్లు కుండలు జనావాసాల ఉనికిని తెలియజేస్తున్నాయి. ఉన్నట్టుండి నవ్వులు

వినిపించాయి. పురుష కంఠాలు తెరలు తెరలుగా నవ్వుతున్నాయి. నవ్వుల మధ్య మాటలు. మాటలు మాటల్లా లేవు. పాటల్లా రాగయుక్తంగా ఉన్నాయి. దారి మలుపు తిరిగింది.

నవ్వులు వినవస్తున్న వైపు చూస్తూ నడుస్తున్న నందీ, లాలసలకు గుర్రాలు కనిపించాయి. భటుల గుర్రాలు! అన్నీ తాటిచెట్లకు కట్టివేయబడి ఉన్నాయి. గుర్రాలకు కొంచెం దూరంలో పచ్చిక మీద, చెట్ల మధ్య కూచున్న భటులు కల్లు తాగుతూ పగలబడి నవ్వుతున్నారు. కల్లు సేకరించిన నడివయసు వ్యక్తి వాళ్ళ చేతుల్లోని ముంతల్లోకి కల్లు పోస్తున్నాడు. భటులు ఒళ్ళు మరిచిపోయి తాగుతున్నారు. తాగి, వాగుతున్నారు. పొరుగు రాజ్యంలో తగిలిన పట్టణంలో తమ గురించి విచారించి, తిరుగు ప్రయాణం చేస్తు న్నట్టున్నారు. వాళ్ళు తమవైపు చూడనందుకు సంతో షిస్తూ నంది చకచకా నడవసాగాడు. లాలస మౌనంగా అనుసరించింది.

***

లాలస రాతిస్తంభానికి వీపు ఆన్చి మండపం అరుగు మీద విశ్రాంతిగా కూర్చుంది. ఎదురుగా కొంచెం దూరంలో ఆలయం కనిపిస్తోంది. ఎత్తుగా ఉన్న గోపురం, రెండు వైపులా పెద్దపెద్ద చక్ర దివి టీలు వెలుగుతూ, సమర్థవంతంగా చీకట్లను కబళించి వేస్తున్నాయి. కాసేపట్లో భక్తుల రాకపోకలు మంద గించాయి. లాలస నంది కోసం ఎదురుచూస్తోంది. గంగిరెద్దు ఆమె దగ్గరగా నేలమీద విశ్రాంతిగా పడుకుని నెమరువేస్తోంది.

పట్టణానికి సమీపంలో ప్రవహిస్తున్న ఏటిలో స్నానం చేసి వస్త్రాలు మార్చుకుని, గంగిరెద్దుకు నీళ్ళు తాగించి పట్టణంలో ప్రవేశించారు. పట్టణం పేరు గిరినగరం. కేదారిక రాజ్యానికి రాజధాని. పట్టణం లోకి ప్రవేశించగానే ఆ మాత్రం వివరాలు చెప్పిన బిచ్చగాడు తంబుర మీటుకుంటూ ఒక ఇంటి ముందుకు వెళ్ళిపోయాడు. తననూ, గంగిరెద్దునూ మండపం వద్ద వదిలిపెట్టి నంది పట్టణంలోకి వెళ్ళాడు. కేదారిక రాజ్య నైసర్గిక స్వరూపం, ఇతర వివరాలు తెలుసుకోవడానికి వెళ్ళాడని తనకు తెలుసు. కేదా రిక రాజ్యం తమకు మిత్రదేశమా, లేక కళింగ రాజ్యానికి మిత్రదేశమా తెలియడం ముఖ్యం!

ఆలయం వైపు చూస్తున్న లాలస కళ్ళు మెరి

## జరిగిన కథ

**కా**మరూపరాజ్య సర్వసైన్యాధ్యక్షుడు రుద్రాక్షుడిని రాజద్రోహిగా నిర్ధారించి యావజ్జీవ కారాగార శిక్ష విధించాడు మహారాజు కుబేరవర్మ. రుద్రాక్షుడి కొడుకు నందికి రాజ్యబహిష్కార శిక్ష విధిస్తాడు. స్వయంవరం రోజున యువరాణి లాలసాదేవిని అపహరిస్తాడు కళింగరత్న. అతడి చెర నుంచి తప్పించు కున్న లాలసను నంది రక్షిస్తాడు. కళింగరాజ్యం నుంచి నిష్క్రమిస్తారిద్దరూ. మార్గంలో ఎదురవుతున్న ఆపదల నుంచి తప్పించుకుంటూ, సారంగ రాజ్యంలోకి ప్రవేశిస్తారు. అక్కడ తమను బంధించటానికి ప్రయత్నిస్తున్న వారినుంచి తప్పించుకుని, లాలససహా మళ్లీ అడవిదారి పడతాడు నంది. అడవిలో ఎదురయిన గంగిరెద్దుల వారినుంచి, గంగిరెద్దును కొనుగోలు చేస్తాడు. తర్వాత ఇద్దరూ తమ వేషాలు మార్చుకుంటారు. వేషానికి తగ్గట్టుగా తనమెడలో పసుపుతాడు కట్టమన్న లాలసకు, తన గతాన్ని వివరిస్తాడు నంది. ఆమె అభ్యర్థనను తిరస్కరిస్తాడు. అలా ఆలోచనల్లో నడుస్తూ ఉండగానే, వాళ్లకు తమకోసం వెతుకుతున్న అశ్వికులు ఎదురవుతారు. వివరాలడిగి వాళ్లను దాటి ముందుకెళతారు.

ఆ తర్వాత....

శాయి. నంది ఆలయంలోంచి వస్తున్నాడు. ఆలో చనల్లో మునిగి ఉన్న తను అతను ఆలయంలోకి ఎప్పుడు వెళ్ళాడో చూడనే లేదు. నంది చేతులలో రెండు కొత్త దుత్తలున్నాయి. దుత్తలతో ఏమిటి తెస్తున్నాడు నంది? అన్నమా?

నంది ఆమె ముందు అరుగు మీద దుత్తలను పెట్టి కూర్చున్నాడు. చిరునవ్వుతో లాలస వైపు చూశాడు. "ప్రసాదం! చక్కెర పొంగలి; పులిహోర! అడగకుండానే ఇచ్చాడు అర్చకస్వామి."

"అలాగా!"

"మనం ఇక్కడికి చేరినప్పుడు చూశాడట, 'తీసు కెళ్ళు నాయనా...అమ్మాయి నిండు చూలాలులా ఉంది. స్వామి ప్రసాదం తినిపించు' అన్నాడు" నంది చిన్నగా నవ్వాడు.

"అలాగా!"

"ఆ! నీ వేషం అందర్నీ కరిగించి వేస్తోంది!" అన్నాడు నంది, దుత్త మీదున్న తామరాకుల్ని తీసి వేస్తూ.

"ఇన్నాళ్ళకి కడుపు నిండేంత ప్రసాదం దొరి కింది." లాలస తృప్తిగా నిట్టూర్చింది.

"లాలసా, శుభవార్త! నీ ఆశను అదృష్టం వరించింది!" ప్రసాదాలతో ఆకలి తీర్చుకున్నాక అన్నాడు నంది.

లాలస ఉత్సాహంగా చూసింది. "అంటే ఈ రాజ్యం.."

"కామరూప సామ్రాజ్యానికి సామంత రాజ్యం. కేదారిక రాజు చందనవర్మ కామరూప చక్రవర్తి గారికి వీర విధేయుడు. కుబేరవర్మ మహారాజుగారి ఏకైక పుత్రిక, యువరాణి లాలస అంతర్థాన వార్త తెలిసిన వెంటనే కేదారిక రాజుగారు వెళ్ళి చక్రవర్తి దంపతులను పరామర్శించి వచ్చారు. ఈ సామంత రాజ్యం దాటితే కామరూప రాజ్యమే!"

"నిజమా! ఎంత అదృష్టం? ఇప్పుడు నా మనసు కుదుట పడింది."

"నా భుజాల మీది భారం దించివేసినట్టు, మహా బాధ్యత నుండి నన్ను విముక్తుడిని చేసి నట్టూ అనిపిస్తోంది నాకు!" నంది అన్నాడు.

లాలస కనుబొమలు కదిలి మధ్యలో కలుసు కుని ధనురాకారం ధరించాయి. "అంటే...అంటే...నీ బాధ్యత అప్పుడే, ఇక్కడే తీరిపోయిందా?"

"తీర్చుకోవాలిగా! నేను కామరూపలో కాలు పెట్ట లేనుగా?" నంది నిట్టూర్చాడు. "ఒక ప్రయత్నం చేయా లనుకుంటున్నాను. రేపు ఈ గంగిరెద్దు వేషం తీసివేసి, కేదారిక రాజుగారి దర్శనం చేసుకుంటాను. నీ గురించి ప్రస్తావిస్తాను. నిన్ను మీ తల్లిదండ్రుల వద్దకు చేర్చ మని అభ్యర్థిస్తాను. సగౌరవంగా, సురక్షితంగా రథం మీద నిన్ను నీ అంతఃపురానికి చేర్చుతాడు."

"అయితే నువ్వు వాగ్దాన భంగం చేస్తావా?" లాలస సూటిగా అడిగింది.

"వాగ్దాన భంగమా?"

"నన్ను క్షేమంగా నా తల్లిదండ్రుల వద్దకు చేర్చుతానని మాట ఇచ్చావు, మరచిపోయావా?"

"ఎలా మరిచిపోతాను? రేపటి ప్రయత్నం అందులో భాగమే!" నంది చిరునవ్వు నవ్వాడు.



"నీ ప్రయత్నం ఫలించదు..."

"ఎందుకు?" నంది ఆశ్చర్యంగా చూశాడు.

"నేను సహకరించను."

"లాలసా?"

"నంది స్వయంగా, స్వహస్తాలతో లాలసను ఆమె తల్లిదండ్రులకు అప్పగించాలి." లాలస గంభీరంగా అంది.

"కామరూప రాజ్యంలో కాలు పెడితే, నా తల తెగిపోతుంది! నీ తండ్రిగారి శాసనం మరచిపోయావా?"

"నన్ను కాపాడిన వీరుడి శిరస్సును నేను కాపాడుతాను" లాలస నంది కళ్ళల్లోకి చూస్తూ అంది. "నందీ, జాగ్రత్తగా విను; ఈ క్షణం నుండీ ఆలోచన నేను చేస్తాను. పథకం నేను వేస్తాను.

"లాలసా!" నంది నివ్వెరపాటుతో అన్నాడు. సామంత రాజ్యం చేరగానే ఆమెకు ధైర్యం వచ్చేసిందా? ఆమెలోని యువరాణి నిద్ర లేచిందా?"

"నా పథకం ద్విముఖం. నేను నా తల్లిదండ్రుల్ని చేరుకోవడం ప్రథమ ముఖం. నీ ప్రతిజ్ఞ నెరవేరడం ద్విముఖం. అర్థమైందా?" లాలస అడిగింది.

నంది మౌనంగా చూశాడు.

"ఏమిటలా చూస్తున్నావు నందీ? మీ నాన్నగారు నిర్దోషి అని నిరూపించవా? నీ నిర్దోషిత్వాన్నీ, నీ చెల్లెలి అమాయకత్వాన్నీ నిరూపించవా? ఆ నిరూపణ ఒక మహత్కార్యం, ఒక సాహసం. ఆ సాహస కార్యానికి అనుబంధంగా, నిజంగా నేరం చేసిన నీచుల్ని చక్రవర్తి ముందు నిలబెట్టవా?" లాలస తదేకంగా చూస్తూ ప్రశ్నలు రువ్వింది.

నంది ఆమె ముఖంలోకి ఆశ్చర్యంగా చూస్తూ ఉండిపోయాడు. అతని పెదవులు మెల్లగా కదిలాయి. "నీ మాటలు...నాలో ప్రతిధ్వనిస్తున్నాయి..."

"ఆ ధ్వని ఫలించాలంటే నువ్వు మన నగరానికి రావాలి. అన్వేషించాలి. అపరాధుల్ని పట్టుకోవాలి. ఆధారాలు అనే సంకెళ్ళతో బంధించి చక్రవర్తిగారి ముందు నిలబెట్టాలి."

"కామరూప రాజ్యంలో అడుగు పెట్టడం రాజాజ్ఞను ఉల్లంఘించడమే! అది వాంఛనీయం కాదు; పైగా అది నేరం..?"

లాలస చిన్నగా నవ్వింది. "నందీ, నిజం చెప్పు. నీ కుటుంబానికి అన్యాయం జరిగిందా లేదా?"

"...జరిగింది."

"అన్యాయాన్ని ఎదిరించడం అన్యాయమా? నేరమా?"

"అది కాదు లాలసా.."

"రాజ్యంలో, రాజధానిలో అడుగుపెట్టకుండా నువ్వు నీ తండ్రినీ, చెల్లినీ, నిన్నూ శిక్షలకు దూరం చేసి, రక్షించుకోలేవు! అవునా?"

"...అవును."

"కాబట్టి నువ్వు దేశబహిష్కార శిక్షను విస్మరించి, కామరూప నగరానికి వస్తావు. నీ లక్ష్యాన్ని సాధిస్తావు. ఇన్నాళ్ళూ నన్ను నువ్వు కంటికి రెప్పలా కాపాడావు. ఇకనుండీ నేను నిన్ను కాపాడతాను. నీ రుణం తీర్చుకుంటాను. పథకం నాది అని అందుకే అన్నాను" గంభీరంగా అంది లాలస.



## ఆ ఘటన నిజంగానే జరిగిందా?

**హీ**రోయిన్ భావన విషయం నిజంగా జరిగిందా? అన్న అనుమానాలు పలువురి నించి వస్తున్నాయి. బాలీవుడ్ హీరోయిన్ ఆలియాకి కూడా ఇదే తరహాలో అనుమానం వచ్చింది. సంఘటన జరిగిన తీరు చాలా అసహజంగా ఉందని అంటోంది. ఏదో సినిమాల్లో చూపించినట్టు ఉందే తప్ప నిజంగా జరిగిన అభిప్రాయం తనకు రావడం లేదని చెబుతోంది. కాకపోతే ఈ కేసుకు సంబంధించి జరుగుతున్న అరెస్టులు గురించి మాత్రం మాట్లాడడం లేదు.

**లాలస రువ్విన ప్రశ్నలకు, ఆమెవైపు మౌనంగా చూస్తూ ఉండిపోయాడు నంది. ఆమె చెప్పిందంతా అక్షర సత్యం. అది అన్యాయమే కావచ్చు. అపరాధమే కావచ్చు. కానీ తన తండ్రి నిరపరాధిగా నిరూపించబడాలంటే అన్వేషించాల్సిందే! సాహసంతో కూడిన ప్రయత్నం చేయాల్సిందే! మరి వారిద్దరూ ఏం చేయదలుచుకున్నారు? ఎలాంటి పథకం వేశారు?**

నంది మౌనంగా ఆమెవైపు చూస్తూ ఉండిపోయాడు. లాలస చెప్పిందంతా నిజమే. చెరువుకు దూరంగా ఉండి తాను స్నానం చేయలేడు. యుద్ధరంగానికి దూరంగా ఉండి శత్రువులతో పోరాడలేడు! అది అన్యాయం కావచ్చు. అపరాధం కావచ్చు. తాను కామరూప నగరంలో కాలు మోపాల్సిందే! అన్వేషించాల్సిందే! అపరాధుల్ని పట్టాల్సిందే! తండ్రికీ, చెల్లికీ పడిన శిక్షల నుండి విముక్తి కలిగించడానికి సాహసంతో కూడిన ప్రయత్నం చేయాల్సిందే. ఆ ప్రయత్నంలో తన తల తెగిపోయినా సరే!

"లాలసా...నీ పథకం ఏమిటి?"

లాలస చిన్నగా నవ్వింది. "పథక రచన అనేది రహస్యం! మూడవ కంటికి కనిపించకూడదు. మూడవ చెవికి వినిపించకూడదు!"

"అది కాదు లాలసా...నేను నిన్ను రక్షించిన దానికన్నా, నువ్వు రక్షించబోయే సాహసం మహా ప్రమాదకరం. అది ఏమిటో చెబితే...ఆలోచించి..."

"చెప్పను. చేసి చూపిస్తాను!" లాలస నిష్కర్షగా అంది. నిద్ర ముంచుకొస్తోంది, పడుకోవాలి..?" అంటూ అరుగు మీద వాలి కళ్ళు మూసుకుంది.

నంది నిట్టూర్చాడు, స్తంభానికి జారగిలపడుతూ.

***

నంది ఉపవీధి నుండి మండపం వైపు నడుస్తున్నాడు. పట్టణం చివర ఉన్న వాడలో గంగిరెద్దుల వృత్తితో జీవిస్తున్న వాళ్ళు ఉన్నట్టు తెలుసుకున్నాడు తను. గంగిరెద్దును తోలుకుంటూ పెందరాళే బయల్దేరి, వాళ్ళనీ, వీళ్ళనీ అడిగి గంగిరెద్దుల వాళ్ళ గురించిన వివరాలు సేకరించాడు. ఆ వాడకు చేరుకుని గంగిరెద్దు రాముడిని ఒక వృద్ధుడికి విక్రయించేశాడు. అతన్ని ఆశ్చర్యపరుస్తూ ఆనాడు శరభయ్యకు ఇచ్చిన సొమ్ము తరుగుదలా, పెరుగుదలా లేకుండా తన చేతిలో పడింది!

గంగిరెద్దుతో తను బయలుదేరినప్పుడు లాలస నిద్రలోనే ఉంది. మేలుకున్నాక, తనూ, గంగిరెద్దూ కనిపించకపోయేసరికి ఆశ్చర్యపోయి ఉంటుంది. గిరినగరంలో అడుగుపెట్టగానే తమకు గంగిరెద్దు అవసరం లేదని తీర్మానించుకున్నాడు తను. ఇద్దరూ ఇంక నిర్భయంగా వేషాలు తొలగించుకోవచ్చు అని కూడా అనిపించింది. అయితే ఆ ఆలోచన లాలసతో పంచు

## మాజీ భర్తతో సినిమా చేస్తోందా? లేదా?

ఈసరికే ఆ నటి ఎవరో అర్థమైపోయి ఉంటుంది. ఇంకెవరు..అమలాపాల్. భర్త విజయ్ నుంచి అధికారికంగా విడాకులు పొందిన అమలాపాల్ విషయంలో ఓ వార్త బాగా హల్‌చల్ చేస్తోంది. విడాకుల కేసు కోర్టులో ఉండగానే విజయ్‌తో అమల ఓ సినిమా చేయబోతోంది అన్న వార్త వినవచ్చింది. ఈ వార్తమీద ఇటు అమల, అటు విజయ్‌లు పెద్దగా స్పందించలేదు. దాంతో ఈ వార్త నిజమే అనుకున్నారు. అయితే ఇప్పుడు అధికారికంగా ఇద్దరూ విడిపోయారు కనుక విజయ్ మాజీ భర్త అయిపోయాడు. మరి అమల మాజీతో సినిమా చేస్తుందా? లేదా? అన్న అయోమయం చాలామందిలో ఉందట!

కోలేదతను. ఆమెను ఆశ్చర్యపరచాలనుకున్నాడు.

ఆలయం ఎదురుగా ఉన్న మండపం వైపు తిరిగిన నంది గోడను ఢీకొన్నట్టు తటాలున ఆగాడు. మండపం వద్ద లాలస లేదు! ఎక్కడికెళ్ళింది? ఒంటరిగా ఎక్కడికి, ఎందుకు వెళ్ళింది? ఏదయినా అపాయంలో ఇరుక్కుందా? రకరకాల ఆలోచనలు నందిలో ఆందోళనకు జన్మనిస్తున్నాయి. నంది అసంకల్పితంగా మండపం వైపు నడవసాగాడు. ఆలయం లోంచి గంటానాదం వినవచ్చింది. నంది ఆగి, ఆలయం వైపు తిరిగాడు. లాలస ఆలయంలోనికి వెళ్ళిందేమో!

నంది చకచకా ఆలయంవైపు అడుగులు వేశాడు. గర్భాలయం ముందు భక్తులు రెండు వైపులా బారులు తీరి నిలుచున్నారు. నైవేద్య నీరాజనాలు పూర్తిచేసిన అర్చకుడు భక్తులకు తీర్థం ఇస్తున్నాడు. నంది గర్భాలయంలో విగ్రహాన్ని చూడ్డం లేదు. అతని కళ్ళు లాలస కోసం వెతుకుతున్నాయి. భక్త బృందంలో లాలస లేదు. యాంత్రికంగా తీర్థం తీసుకుని, మొక్కుబడిగా మూల విరాట్టును ఒక సారి చూసి, నంది చకచకా బైటికి నడిచాడు.

విశాలంగా ఉన్న ఆలయ ప్రాంగణం దాటి, ప్రధాన ద్వారాన్ని సమీపించాడు నంది. అతని హృదయంలో దైవదర్శనం చేసుకున్న ఫలితంగా లభించే ప్రశాంతత లేదు. అలజడి రాజ్యం చేస్తోంది. తాను పొరపాటు చేశాడు. ఉదయం లాలస నిద్ర లేచేదాకా ఆగి, ఆమెను వెంటపెట్టుకుని వెళ్ళి ఉండాల్సింది. అనుక్షణం ఆమెకు రక్షణగా ఉండాలన్న నిర్ణయాన్ని తాత్కాలికంగా విస్మరించాడు తను. అప్రమత్తత స్థానంలో అజాగ్రత్త ప్రవేశించింది. మిత్ర రాజ్యంలో ఉన్నారన్న అభిప్రాయం తన నిర్లక్ష్యానికి కారణం. గోపురం కింద ఉన్న ఎత్తయిన వెడల్పాటి రాతి గడపను దాటి ఆలయం ముందుకు అడుగు పెట్టిన నంది అప్రయత్నంగా ఆగాడు. అతని కళ్ళు మెరిశాయి. లాలస మండపం వైపు నడుస్తోంది. ఆమె చేతిలో ఏదో మూట ఉంది. మూటను అరుగు మీద పెట్టి ఆమె కూర్చుంది. నంది తేలిక పడిన మనసుతో ఉల్లాసంగా, వేగంగా ఆమె వైపు నడిచాడు.

దగ్గరగా వస్తున్న నంది వైపు లాలస చిరునవ్వుతో చూసింది.

“ఎక్కడికెళ్ళావు?” నంది ఆమె దగ్గరగా ఆగి అడిగాడు.

“నువ్వెక్కడికి వెళ్ళావు?” లాలస ఎదురు ప్రశ్న వేసింది.

“గంగిరెద్దును అమ్మడానికి వెళ్ళాను.”

“నేను కొనడానికి వెళ్ళాను.”

నంది ఆశ్చర్యంగా చూశాడు. “కొనడానికా? సొమ్ము?”

“దొంగిలించాను.”

నంది చిరునవ్వుతో “హాస్యమా? పరిహాసమా?”

“ఆ రెండూ కాదు. నిజం! నువ్వు రొంటిన దాచుకున్న గంగిరెద్దు సంపాదన ఉందేమో చూసుకో!” లాలస నవ్వుతూ అంది.

నంది నడుముకి చుట్టిన ఉత్తరీయం లోపల తడిమి చూసుకున్నాడు. గంగిరెద్దువాడిలా నటిస్తూ తను సంపాదించిన నాణేలు లేవు! ఆశ్చర్యంగా లాలస వైపు చూశాడు.

“నువ్వు గాఢ నిద్రలో ఉన్నప్పుడు కాజేశాను! ఏమీ ఎరగనట్టు నటిస్తూ పడుకున్నాను!” లాలస నవ్వింది.

“ఇంతకీ ఏమిటి కొన్నావు?” నంది ప్రశ్నించాడు. “నీకు కొత్త చీరలా?”

లాలస తల అడ్డంగా ఊపింది. “నువ్వు వెయ్యబోయే సరికొత్త వేషానికి అవసరమైన వస్త్రాలూ, ఆభరణాలూ!”

నంది ఆమె దగ్గరగా అరుగు మీద ఉంచుకున్న మూట వైపు చూశాడు. “సరికొత్త...వేషమా?”

“ఔను. అప్పుడు వేషం నువ్వు వేయించావు. ఇప్పుడు నేను వేయిస్తాను” లాలస అంది. “నేను కట్టమన్న వేషం కడతావు. నేను ఆడమన్నట్టు ఆడతావు!”

“లాలసా...”

“నిండు చూలాలు వేషం వేయించావుగా! కసి తీర్చుకోవాలనుకుంటున్నాను!” లాలస నవ్వింది.

“పథక రచన అన్నావు. పాటించి తీరాల్సిందే! బిచ్చగాడి వేషం వేయమన్నా వేస్తాను; కుష్ఠు రోగి వేషం వేయమన్నా వేస్తాను” నంది అన్నాడు.

“అలాంటి పిచ్చివేషం కాదులే! కూర్చో చెబుతాను.”

నంది కూర్చుని మౌనంగా చూశాడు. లాలస అతని వైపే చూస్తూ మూటను విప్పింది. విప్పిన మూటలోని వస్త్రాలనూ, ఆభరణాలనూ చూసి, నంది ఆశ్చర్యంతో నోరు వెళ్ళబెట్టాడు.

చిరునవ్వుతో తనను చూస్తున్న లాలస ముఖంలోకి నంది అయోమయంగా చూశాడు.

“ఇవి వస్త్రాలా? అవి ఆభరణాలా?” నంది ఆశ్చర్యంగా అడిగాడు.

“ఎందుక్కావు? కాషాయ వస్త్రాలు ధరించిన వ్యక్తుల్ని ఎప్పుడూ చూడలేదా? రుద్రాక్ష మాలల్నీ, కుండలాల్నీ నగలుగా ధరించిన వాళ్ళు ఎవ్వరూ నీ కంట పడలేదా?”

“అంటే...నీ ఉద్దేశం..?”

“నీ గిరజాల జుత్తు పొడవుగా పెరిగింది. గడ్డమూ, మీసాలూ పెరిగాయి. కాషాయ వస్త్రాలూ, రుద్రాక్ష మాలలూ, నుదురు మీద విభూతి రేఖలూ నీ రూపాన్ని మార్చివేస్తాయి. నీ పేరు నేను మార్చివేస్తాను. నువ్వు అనుకోకుండా, దేవుడిలా వచ్చి, కళింగ యువరాజు కళింగరత్న కబంధ హస్తాల నుండి నన్ను రక్షించావు. సన్యాసి వేషంలో ఉండే నిన్ను మా నాన్నగారు పోల్చుకోలేరు. నీ చెల్లీ పోల్చుకోలేదు! యువరాణి లాలసాదేవిని రక్షించిన కీర్తి నీకు రక్షాకవచంలా ఉంటుంది. కుబేరవర్మ చక్రవర్తి నిన్ను రాజమందిర అతిథిగా ఆదరిస్తారు; గౌరవిస్తారు; ఆరాధిస్తారు. నువ్వు సాధన చేసుకోవడానికి ఒక ఏకాంత కక్ష్య ఇవ్వబడుతుంది. నీ సాధన

ఏమిటో తెలుసా?" లాలస చిన్నగా నవ్వింది.

నంది చిరునవ్వు నవ్వాడు. "అపరాధులను శిక్షించడానికీ, నిరపరాధులు రక్షించబడటానికీ తగిన పథకం కోసం తపస్సే నా సాధన!"

"అందుకున్నావు! రాజమందిరంలో, అంతఃపురంలో నీ సంచారాన్ని ప్రశ్నించేవాళ్ళు ఉండరు! నిన్ను అడిగే వాళ్ళు ఉండరు. అడ్డుకునే వాళ్ళూ ఉండరు.."

"ఆ విధంగా ఎంతకాలం ఉండగలను?" నంది ప్రశ్నించాడు.

"నా వివాహం అయ్యేదాకా నన్ను రక్షించిన యోగి పుంగవుడు ఉండాలనీ, నన్ను ఆశీర్వదించాలనీ నాన్నగారికి చెప్పి ఒప్పిస్తాను. నీ ధర్మ రక్షణ కార్యం విజయవంతంగా పూర్తయ్యేదాకా నా వివాహం జరగకుండా నేను చూసుకుంటాను."

"లాలసా...నీ మాటలు నాలో అనుమానాన్ని పుట్టిస్తున్నాయి." నంది అడ్డ తగులుతూ అన్నాడు. "నువ్వు కూడా ఏదైనా పథకం వేస్తున్నావా? నిజం చెప్పు!"

"నీ అనుమానం అర్థమైంది నందీ! మనసు పడని మగవాడితో మనువు కోరుకునే మగువ కాదు ఈ లాలస."

తన కళ్ళల్లోకి తీక్షణంగా చూస్తున్న లాలస కళ్ళల్లోకి నంది క్షణంపాటు తదేకంగా చూశాడు. "అలా అడిగినందుకు అపార్థం చేసుకోవద్దు."

"నువ్వు నా రక్షకుడివి నందీ. నువ్వు ఏమి అడిగినా, ఏమి అన్నా అపార్థం చేసుకోను. నీ పట్ల నా కృతజ్ఞత శాశ్వతం!"

"ఇప్పుడు నీ పథక రచనకు శ్రీకారం.." నంది చిరునవ్వు నవ్వుతూ ఆగాడు.

"ప్రథమ అంశం! వేషధారణ. నదీతీరానికి వెళ్ళాలి. నువ్వు గంగిరెద్దు అవతారాన్ని పరిత్యజించి కొత్త అవతారం ధరించాలి. నేను నిండుగర్భిణి అవతారాన్ని చాలించి ఒక సామాన్య యువతిగా, నీ శిష్యురాలిగా అవతరించాలి. నీ నూతన నామధేయం నిత్యనిర్మలానంద యోగి.."

"నీ వస్త్రాలు.."

"కాషాయమే గురుదేవా!" లాలస నవ్వింది. "వేషాలు మారాక మనం కామరూప నగరానికి ప్రయాణం ప్రారంభించాలి."

"కాలినడకా?" నంది అడిగాడు.

"అంత ఓపిక లేదు. జన్మస్థలం, జన్మనిచ్చిన తల్లిదండ్రులూ నన్ను తొందరపెడుతున్నారు. వాయువేగంతో, కనీసం అశ్వవేగంతో మనం వెళ్ళాలి!"

"అశ్వవేగమా?" నంది అన్నాడు. "సన్యాసులూ, అవధూతలూ అశ్వారోహణం చేయరు. గ్రామైక రాత్రంగా ఒక్కొక్క గ్రామంలో ఒక్కొక్క రాత్రి మాత్రమే విడిది చేస్తూ పాదయాత్ర చేస్తారు!"

"నా వల్ల కాదు. అలసటా, ఆత్రుతా నన్ను ఆవరించాయి. నూతన వేషాలతో మళ్ళీ ఇక్కడికే వస్తాం. నువ్వు పట్టణంలోని పెగ్గడవీధిలోకి వెళ్ళావు. ఆ వీధి మధ్యలో ఒక ఇంటి ఆవరణలో ఒక అశ్వశకటం ఉంటుంది. ఆ ఇల్లూ, ఆ శకటమూ దేవలుడు అనే వ్యక్తివి. ప్రతిఫలం తీసుకుని దేవలుడు తన అశ్వశకటంలో ప్రయాణికులను గమ్యం చేరుస్తాడు."

"నీకెలా తెలుసు?" నంది ఆశ్చర్యంగా అడిగాడు.




"తెలుసుకున్నాను. కళ్ళు తెరిచి చూస్తే, చెవులు తెరిచి వింటే, నోరు తెరిచి అడిగితే ఎన్నో తెలుస్తాయి." లాలస నవ్వింది.

"దేవలుడికి గంగిరెద్దు విక్రయంతో వచ్చిన సొమ్ము ఇస్తే చాలు. రేపు సూర్యోదయం సమయానికి మనల్ని కామరూప నగరానికి చేరుస్తాడు. తన ప్రయాణికులకు రెండు పూటలా ఆహారం కూడా సమకూరుస్తాడట అతను!"

"ఇంక ఆలస్యం దేనికి? నదీతీరానికి పద!" నంది పైకిలేస్తూ అన్నాడు.

***

రెండు అశ్వాలు లాగుతున్న శకటం వేగంగా వెళ్తోంది. ప్రయాణికులకు ఎండ నుండీ, వాన నుండీ రక్షణ కల్పించడానికి బండి మీద అర్ధచంద్రాకారంలో పై కప్పు ఉంది. బండిలో గడ్డి మీద కంబళి పరిచి ఉంది, కూర్చున్నవాళ్ళకు మెత్తటి సౌకర్యం కోసం. లాలస శకటం లోపల కూర్చుంది. నంది శకటచోదకుడైన దేవలుడి ప్రక్కన కూర్చుని, శకటానికి రెండువైపులా వెనుకకు దూసుకు వెళ్తున్న ప్రకృతిని చూస్తూ, ఆనందిస్తున్నాడు. దేవలుడూ, లాలసా ఇద్దరూ బండి లోపల కూర్చోమని నందిని బలవంతం చేశారు. "మా సన్యాసులకు ఎండ ఎండా కాదు; వాన వానా కాదు! ఆ రెండూ ఉన్నా లేనట్టే! ద్వంద్వాలకు అతీతులం కదా!" అన్నాడు నంది; పాత్ర పోషణలో తన నైపుణ్యాన్ని లాలసకు నర్మగర్భంగా తెలియజేస్తూ.

దారి కీకారణ్యంలోకి చొచ్చుకు వెళ్తోంది. దేవలుడు అశ్వాలు అదిలించాడు.

"అశ్వాలు వేగంగానే వెళ్తున్నాయి కదా?" అన్నాడు నంది.

"చీకటి పడేలోగా దట్టంగా ఉన్న అరణ్య భాగం దాటాలి స్వామీ!."

అశ్వశకటం దట్టంగా ఉన్న ముళ్ళపొదల మధ్య మలుపు తిరిగింది. దేవలుడు గుర్రాల్ని హెచ్చరిస్తూనే అన్నాడు.

అశ్వశకటం దట్టంగా ఉన్న ముళ్ళపొదల మధ్య మలుపు తిరిగింది. దేవలుడు కళ్ళేల్ని లాగుతూ వేగాన్ని తగ్గించాడు. అందుకు కారణం దారికి అడ్డంగా విరిగి పడిన చెట్టు బోదె రూపంలో కనిపిస్తోంది. "అనుకున్నదంతా అయ్యిందే!" దేవలుడు గొణిగాడు.

"ఏమిటి నాయనా?" నంది అడిగాడు.

దేవలుడు సమాధానం చెప్పేలోగా ఇద్దరు వ్యక్తులు దారికి రెండువైపుల నుండీ, పొదలను తప్పుకుంటూ దారి మీదికి వచ్చారు. కండలు తిరిగిన శరీరాలు కాటుక రంగులో మెరుస్తున్నాయి. భుజాల కిందకి జారిన చింపిరి శిరోజాలు, ఎర్రటి కళ్ళు చింతనిప్పుల్లా ఉన్నాయి. మెలితిరిగిన బుర్ర మీసాలు. ఎర్రటి తల పాగాలు. ఎర్రటి వస్త్రాలు. బానల్లాంటి బొజ్జలను చుట్టి, పిక్కల దాకా ఉన్నాయి ఆ రక్తవర్ణ వస్త్రాలు. ఇద్దరి చేతుల్లోనూ లావుపాటి దుడ్డుకర్రలున్నాయి. కర్రల నిండుగా ఉబ్బెత్తుగా ఉన్న కణుపులు.

నంది వాలుగా దేవలుడి వైపు చూశాడు. దేవలుడి ముఖంలో నెత్తురు చుక్క లేదు. అతని శరీరం వణుకుతోంది. నంది ఇద్దరు పర్వతకాయుల వైపు చూశాడు.

"ఎవరు నాయనా మీరు? దారికి అడ్డంగా చెట్టును..?"

"మేమే యేశాం బైరాగీ!" ఒకడు వెటకారంగా నవ్వుతూ అన్నాడు గారపళ్ళు చూపిస్తూ.

"ఉన్నదంతా సుంకం కింద ఇచ్చుకుని ఎల్లిపొండి!" రెండవ వ్యక్తి బెదిరింపుగా అన్నాడు.

"అడవి దారికి సుంకమేమిటన్నా?" దేవలుడు ధైర్యం తెచ్చుకుని అడిగాడు.

"ఈ అడవి మాది!" ఒకడు అన్నాడు.

"ఈ దారి మాది!" రెండవ వ్యక్తి సగర్వంగా అన్నాడు.

*(ఇంకావుంది)*

# పైల్స్ - హోమియో చికిత్స

పైల్స్ వున్న వారి బాధవర్ణనాతీతం, మలవిసర్జన తర్వాత ఈ బాధ కొన్ని గంటల వరకు ఉంటుంది. నొప్పి, మంట, దురద ఉండి, సూదులతో గుచ్చుకున్నట్లువుండి వీరు ఒకచోట కూర్చోలేరు, నిల్చోలేరు. ఈ మొలలు చిట్లడంవలన రక్తస్రావం జరుగుతుంది. చాలారోజుల వరకు రక్తస్రావం అయితే శరీరంలో హిమోగ్లోబిన్ శాతంతగ్గి ఎనీమియా రావడానికి ఆస్కారంఉంది. జీవనవిధానం, మారుతున్న ఆహారపు అలవాట్లు, నిద్రలేమి, వాహనాలు అధికంగా నడపటం, వేసవికాలం, నీరు అధికంగా తీసుకోకపోవడం వలన ఇవి వస్తాయి. మలద్వారంతో కలుపబడిన పెద్దపేగు చివరి భాగాన్ని మలనాళం లేదా రెక్టమ్ అంటారు. ఇక్కడ ఉన్నకణజాలంలో అధికంగాఉండే రక్తనాళాల వాపు వలన ఈ స్థితివస్తుంది. పురీషనాళం వెలుపలి భాగంలో వస్తే బాహ్య హెమరాయిడ్స్ అని, లోపలి భాగంలో వస్తే లోపలిహెమరాయిడ్స్ అనిఅంటారు. ఇవి బఠాణీగింజ లేదా ద్రాక్షపండు పరిమాణంలో గులాబీ రంగులో, మూడు లేదా నాలుగు గుత్తులు గా లేదా విడిగాకూడా ఉండే ఈ స్థితిని మూలశంక (పైల్స్) వ్యాధిగా పేర్కొంటారు.

**ఎవరికి వస్తుంది ?:** గర్భిణులలో, ప్రొస్టేట్ గ్రంథి వాపు ఉన్నవారిలో సాధారణంగా చూస్తాం. పిల్లలలో ఈ వ్యాధిని అరుదుగా చూస్తాం.

**కారణాలు :** 1. మలబద్ధకం మూలంగా అధికంగా ముక్కుటం 2. దీర్ఘకాలిక విరేచనాలు 3.గర్భస్థ పిండం ఒత్తిడి వలన, అధికంగా ఉత్పత్తి అయ్యే హార్మోన్ల వలన 4. పొత్తికడుపు లేదా పేగులలోని క్యాన్సర్ సంబంధ కణుతుల వలన 5. వంశపారం పర్యంగా 6. అధిక బరువు 7. పీచు పదార్థాలు తక్కువగా ఉన్న ఆహారాన్ని రోజూ తీసుకోవడం.. వంటివి.

**హెమరాయిడ్‌లు - రకములు:** మొదటి తరగతి ( ఫస్ట్ డిగ్రీ పైల్స్). రెక్టమ్ లేదా మలనాళం లోపలే ఉంటాయి. రెండవ తరగతి (సెకండ్ డిగ్రీ పైల్స్). పురీషనాళం తెరుచుకొని ఉన్నప్పుడు వెలుపలికి వచ్చి, మలద్వారం మూసుకున్న వెంటనే లోపలికి వెళ్ళిపోతాయి . మూడవ తరగతి (థర్డ్ డిగ్రీ పైల్స్) వెలుపలికి వచ్చి, హెమరాయిడ్‌లను లోపలికి చొప్పించిన వెంటనే లోనికి వెళ్ళిపోతాయి. నాల్గవ తరగతి (ఫోర్త్ డిగ్రీ పైల్స్) మలద్వారం వెలుపల శాశ్వతంగా వేలాడుతూ ఉంటాయి.

**లక్షణాలు:** చాలా మంది ఎక్కువగా లోపలి హెమరాయిడ్‌ల(ఇంటర్నల్ పైల్స్)తో ఏ లక్షణాలు లేకుండానే ఉంటారు. మలద్వారం తెరుచుకున్న వెంటనే తాజా రక్తం మలద్వారం ద్వారా వెలుపలికి వస్తుంది. మలద్వారం చుట్టూ దురద ఉండవచ్చు. మూడు - నాలుగు దశలలోని హెమరాయిడ్‌లు, అధికంగా నొప్పి ఉండి చీమువంటి పలుచనిద్రవం విసర్జింప బడుతుంది.

**నివారించవచ్చా:** మొలలు వచ్చిన తరువాత కంటె మొలల లక్షణాలు కనబడిన వెంటనే కొన్ని జాగ్రత్తలు తీసుకుంటే వీటిని నివారించవచ్చు. మొలలతో బాధపడేవారు ఆహారపు అలవాట్లలో, జీవన విధానంలో మార్పుతీసుకొస్తే నివారించవచ్చు.

ముఖ్యంగా తాజా పండ్లు, ఆకుకూరలు, ఫైబర్‌తో కూడిన పదార్థాలు, దప్పికఉన్న లేకున్నా పది నుండి పన్నెండు గ్లాసులనీరుతీసుకోవడం, మాంసాహారం, మసాలాలు, పచ్చళ్లుతీసుకోకుండా ఉంటే మంచిది. ఎక్కువసేపు కూర్చోకుండా, యోగా, వ్యాయామం చేయడం వలన నివారించవచ్చు.

**హోమియో చికిత్స వలన ప్రయోజనం ఉంటుందా?:** మొదటి మూడు దశలలోని హెమరాయిడ్‌లను పూర్తిగా నయం చేయుటమేకాక, శస్త్రచికిత్స అవసరం లేకుండా చేస్తుంది. అంతేకాకుండా హెమరాయిడ్ వలన వచ్చే బలహీనతను తగ్గించి, శాశ్వతంగా రాకుండా చేస్తుంది. హోమియోలో ఆస్కులస్ హిప్, ఆలోస్, హెయామెలిస్, కొలింగ్ సోనియా, ఆర్గనిక్ ఆల్, నక్సామికా మందులు బాగా పనిచేస్తాయి.



**డా. మురళి అంకిరెడ్డి**
M. D (Homeo)
**స్టార్ హోమియోపతి**



# చర్మం మీద నల్లమచ్చలు, తెల్లమచ్చలు

చర్మం యొక్క వర్ణమునకు మన శరీరంలోని మెలానిన్ పిగ్‌మెంట్ కారణంగా ఉంటుంది. ఈ మెలానిన్ పిగ్‌మెంట్ ఉత్పత్తిలో ఉన్న హెచ్చు తగ్గుల వల్ల మన చర్మంలో తెల్లమచ్చలు లేదా నల్లమచ్చలు రావచ్చు, మెలానిన్ పిగ్‌మెంట్ వల్ల చర్మం, కంటికి, జుట్టుకి వర్ణం వస్తుంది.

**నల్లమచ్చల రుగ్మతలు:**

**1. పోస్ట్ ఇన్‌ఫ్లమేటరీ హైపర్ పిగ్మెంటేషన్:** గాయం లేక వాపు వచ్చి మానడం వల్ల చర్మంలో నల్లమచ్చలు రావడాన్ని పోస్ట్ ఇన్‌ఫ్లమేటరీ హైపర్ పిగ్మెంటేషన్ అని అంటారు. ఈ అవస్తకి తరువాతనే మొటిమలు, సోరియాసిస్, ఎటోపిక్ మరియు కాంటాక్ట్ డెర్మటైటీస్, లైకెన్ ప్లానస్ వచ్చే అవకాశం వుంది. దీని వల్ల తెల్లమచ్చలు అప్పుడప్పుడు వచ్చే అవకాశం వుంది.

**2. మెలాస్మా:** శరీరంలో ఏ భాగమైతే ఎక్కువగా ఎండకి బహిర్గతం అవుతుందో అక్కడ ఈ విధంగా గోధుమ వర్ణంలో వున్న మచ్చలు వస్తాయి. ముఖ్యంగా ముఖము, చేతులు, పాదాలు, ఈ రకమైన మచ్చలు గర్భిణిలో కూడా చూడవచ్చు, కాని ఇవి ప్రసవం తరువాత వాటికంతట అవే పోతాయి.

**3. సోలార్ లెంటిజినెన్స్:** ఎక్కువ అల్ట్రావైలెట్ లైట్‌కి (కిరణాలకి) బహిర్గతం అయినప్పుడు చర్మం మీద నల్లగా చిన్నచిన్న మచ్చలు వస్తాయి. ఇవి ప్రాథమికంగా, ముఖం, చేతులు, ఛాతి, వీపు, కాళ్ళమీద వస్తాయి.

**4. ఎఫిలైడ్స్:** ఇవి సాధారణంగా పిల్లల్లో ఎక్కువగా కనబడతాయి. పిల్లలు ఎక్కువ ఎండకి బహిర్గతం అవడం వల్ల వస్తాయి. ఇవి ఎరుపు రంగు నుండి గోధుమరంగులో ముఖము, మెడ, ఛాతి, చేతుల మీద వస్తాయి. ఇది స్వయంగా వాటికంతట అవే చలికాలం వచ్చేసరికి మానిపోతాయి.

**తెల్లమచ్చలు:**

**1. విటిలిగో:** మెలెనిన్ శాతం తక్కువ అవ్వడం వల్ల చర్మం మీద తెల్లమచ్చలు ఏర్పడతాయి. ఇవి మృదువుగా, తెల్లమచ్చలుగా ఏర్పడతాయి. ఇవి శరీరం మీద అక్కడక్కడ లేదా మొత్తం కూడా రావచ్చు. **2.ఆల్బినిజమ్:** శరీరంలో పూర్తిగా మెలెనిన్ పిగ్మెంట్ లేకపోవడం వల్ల ఈ రకమైన తెల్లమచ్చలు వస్తాయి. జుట్టు రంగు మరియు చర్మం రంగు తెల్లగా మారిపోతుంది. వంశపారంపర్యంగా వచ్చే అవకాశం వుంది.

**3. టీనియా వెర్సికలర్:** ఇది ఒకరకమైన ఫంగల్ ఇన్‌ఫెక్షన్. దీనిలో చర్మంపై అనేక తెల్లమచ్చలు. పొరలలో కూడా వస్తాయి. ఈ మచ్చలు అప్పుడప్పుడు పెరుగుతాయి కూడా. చర్మం జిడ్డుగా ఉన్నవాళ్ళు, చెమటలు ఎక్కువగా వస్తున్నవాళ్ళు, వ్యాధినిరోధకశక్తి తగ్గినవాళ్ళు వీళ్ళకి ఇవి ఎక్కువ రావడానికి అవకాశం వుంది.

**నిర్ధారణ:** రోగి శరీర, మానసిక, వంశపారంపర్య చరిత్ర ఆధారంగా రోగనిర్ధారణ వేయువచ్చును.

**చికిత్సవిధానం:** ఆయుర్వేద వైద్యనుసారం దూషించబడిన వాత, పిత్త, కఫ దోషాలను సమస్థితిలోకి తీసుకుని వచ్చే ఔషదాలు అద్భుతమైన లేపనాలు, పంచకర్మ విధానాలు ఉన్నాయి. వ్యాధి ఆరంభంలోనే రోగి ఆలస్యం చేయకుండా వైద్యుల్ని సంప్రదించి వ్యాధిని పూర్తిగా నివారించుకోవచ్చును.

**డా. లక్ష్మి** M. D (Ayurveda)
**స్టార్ ఆయుర్వేద**



# జీవితమే ఒక ప్రతిఘటన

## (కోట శ్రీనివాసరావు కథాకథనం) 23

(గతవారం తరువాయి)

**నాకు వెంకటేశ్‌బాబుకి ఒక కెమిస్ట్రీ ఉంది. ఒకరికొకరం అల్లుకుపోతుంటాం.. 'ఆడవారి మాట లకు అర్థాలే వేరులే' చిత్రంలో నాది తండ్రి పాత్ర. కట్ చెప్పడానికి వీల్లేకుండా సింగిల్ షాట్‌లో ఇద్దరం చేసేశాం. ఆ షాట్‌లో నా నటన తల్చుకుని వెంకటేశ్ లంచ్‌బ్రేక్‌లో కళ్ళమ్మట నీళ్ళు కార్చారు.**

రాఘవ ఆ విషయం చెప్పగానే నాకు లోపల్లో పల కొంచెం ఆనందంగానూ, ఇంకేదోగానూ అని పించింది. కళాకారుడికి అన్నహారాలు అక్కర్లేదు. 'బాగా చేశావు' అని ఎవరైనా ఒక్క ముక్క చెబితే చాలు. ఈ మాట వాళ్ళూ వీళ్ళూ చెబితే నేను మీకు చెబుతున్నది కాదు. నాకు చాలాసార్లు అనుభవం

## అయితే బాహుబలి, లేకుంటే శాతకర్ణి తప్ప మిగిలినవన్నీ...?

లోకి వచ్చింది. జీవితంలో ఎన్ని ఒడిదొడుకులున్నా వాటిని దాటుకుని కూడా వెళ్ళి నిలబడి సినిమాలు చేసేది అలాంటి ఆత్మతృప్తి కోసమే.

ఒక రకంగా ఆర్టిస్ట్‌గా హీరో వెంకటేశ్‌గారితో నాకు ప్రత్యేక అనుబంధం ఉంది. మేం కలిసి చేసిన చిత్రాలన్నీ మంచి హిట్లు. అవన్నీ దాదాపు కథా ప్రాముఖ్యమున్న సినిమాలే. మా కాంబినేషన్‌లో తొలి సినిమా 'వారసుడొచ్చాడు'. 1988 అక్టోబర్‌లో విడుదలైంది. సుహాసిని నాయిక. శ్రీ స్రవంతి మూవీస్ పతాకంపై స్రవంతి రవికిశోర్‌గారు నిర్మించిన చిత్రం. మోహనగాంధీ దర్శకత్వం వహించారు. అందులో శేషమ్మ పాత్రలో నిర్మలమ్మ నటించారు. అమ్మిరాజు పాత్రలో మారుతీరావుగారు, సుబ్బ రాజు పాత్రలో నేనూ ఆమె అల్లుళ్ళుగా నటించాం. అంటే నేనూ మారుతీరావుగారు తోడల్లుళ్ళం అన్న మాట. ఆ సినిమాలో మోహన్‌బాబుగారిది కూడా కీలక వేషం. ఈ సినిమా గుర్తొచ్చినప్పుడల్లా మారుతీ రావుగారి మాటొకటి నాకు గుర్తొస్తుంటుందండీ.. ఒక సన్నివేశంలో నిర్మలమ్మ, అల్లుళ్ళు ఇద్దరినీ పిలిచి, 'చెరి ఇన్ని ఎకరాలు ఇస్తాను. వ్యవసాయం చేయండి. ఎవరు బాగా చేసి ఎక్కువ ధాన్యం పండిస్తే, ఆ పొలం వారికే చెందుతుంది' అని షరతు పెడుతుంది.

ఇద్దరం ఒకరిముఖాలు ఒకరం చూసుకుంటాం. అప్పుడు మారుతీరావుగారు, 'అలాగే అత్తయ్యా. చూస్తూ ఉండు.. నేను 'రాజనాలు' పండిస్తాను' అంటారు.

అప్పుడు నేనంటానూ..

'రాజనాలా అంటే సైన్మ యాక్టర్ కదా... అయితే నేను రేలంగిని పండిస్తాను' అని. ఆ సినిమా చేస్తు న్నంత సేపు మారుతీరావుగారు చాలా బాగా మెచ్చుకునేవారు.

'తెలంగాణ మాండలికంతో చంపేస్తున్నా వయ్యా నువ్వు. మేం ఎంత బాగా నటించినా, ఏం చేసినా, నువ్వు నోరు తెరిచి ఆ యాసతో నాలుగు డైలాగులు చెబితే మా ప్రతిభంతా కొట్టుకు పోతుంది' అని తరచు అనేవారు.

ఆ తర్వాత కోడి రామకృష్ణగారి దర్శకత్వంలో చేసిన 'శత్రువు' ఎంత పెద్ద హిట్టో మీకు తెలిసిందే.

అందులో నేను చేసిన వెంకటరత్నం అనే కాంట్రాక్టర్ పాత్రకు రామ్‌గోపాల్‌వర్మ పెద్ద ఫ్యాన్. ఒకరోజు వర్మగారు ఫోన్ చేసి,

'శ్రీనివాసరావుగారూ ఇప్పుడే 'శత్రువు' చూశా నండీ. స్క్రీన్ ముందు కూర్చుని విలన్ పాత్ర ఎప్పుడు వస్తుందా? అని నేను జీవితంలో రెండో సారి ఎదురుచూశాను. కాంట్రాక్టర్‌గా వ్యవస్థను గుప్పెట్లో పెట్టుకుని నడిపించే పాత్రలో మీరు ఇట్టే ఒదిగిపోయారండీ. ఈ మాట మీతో పంచుకోవాల నిపించి ఫోన్ చేశాను' అన్నారు.

'ఇంతకు ముందు మిమ్మల్ని అంతగా మెప్పిం చిన విలన్ సినిమా ఏది సార్?' అని అడిగా. పైకి అడిగాను కానీ మనసులో 'షోలే' అయి ఉంటుం దనుకున్నా. ప్రశ్న నా నోటి నుంచి రాకముందే ఆయన 'షోలే అండీ' అన్నారు. చాలా ఆనందంగా అనిపించి రామకృష్ణగారికి చెప్పా.

ఆ తర్వాత కూడా వెంకటేశ్‌గారితో చాలా చిత్రాలు చేసినా 'అబ్బాయిగారు' మరో స్పెషల్ చిత్రం. అందులో వెంకటేశ్ పినతల్లి పాత్రలో జయ చిత్ర చేశారు. ఆమె ఎంత చెబితే అంత. తల్లిమాట జవదాటని కొడుకుగా నటించారు వెంకటేశ్. నేనేమో జయచిత్రగారి బ్రదర్‌గా చేశా. మీనా హీరో యిన్. గోదావరి పరిసరాల్లోనే ఈవీవీ ఈ చిత్రాన్ని తెరకెక్కించాడు. రాశీ మూవీస్ నరసింహారావుగారు నిర్మించిన సినిమా అది. తమిళంలో భాగ్యరాజా చేశారు. చాలా మంచి కథ. జంధ్యాలగారు డైలా గులు రాశారు.

### పెద్ద హిట్ చిత్రం గణేష్

ఈ సినిమాలన్నీ ఒక ఎత్తు 'గణేష్', ఒక ఎత్తు. నా కెరీర్‌లో చాలా పెద్ద హిట్ సినిమా. అందుకే అందులో నా పాత్ర గురించి చాలా స్పెషల్‌గా చెప్పాలి. అందులోనూ ముఖ్యంగా నాకు, వెంకటేశ్



బాబుకి బాగా నచ్చిన సినిమా 'గణేష్' ఆ సినిమా మొదలుపెట్టాలనుకున్నప్పుడు ఒకరోజు డి.సురేశ్ బాబుగారు పిలిచారు.

ఫిల్మ్‌నగర్‌లో రామానాయుడు స్టూడియోకి వెళ్ళా. 'కోటగారూ... వెంకటేశ్‌బాబుతో ఓ సినిమా అనుకుంటున్నాం. అందులో హెల్త్ మినిస్టర్ సాంబ శివుడు పాత్ర ఉంటుంది. మీకు చక్కగా సరిపో తుంది. కాకపోతే గుండు కొట్టించుకోవాలండీ.. కను బొమలు కూడా తీసేయాలి. అందుకు గవర్నమెంట్ పర్మిషన్ తీసుకోవాలి. వాళ్ళ పర్మిషన్ తీసుకోకుండా కనుబొమలు తీసేస్తే క్రైమ్. బొంబాయి వాళ్ళయితే తీసేయడానికి సిద్ధంగా ఉంటారు. కానీ వాళ్ళకైనా లక్షలు ఇచ్చుకోవాలి. మీరైతే నేటివిటీ బావుంటుంది. అందుకే చెప్తున్నా. మరి కనుబొమల సంగతి ఏం చేయాలో ఆలోచించుకోండి' అన్నారు సురేశ్‌బాబుగారు.

'సరేనండీ. చాలా సినిమాలున్నాయి. ఒక్కసారి ఆలోచిస్తా' అని వచ్చేశా. ఆ తర్వాత రెండు రోజు లకు మరలా కలిశాం. 'నేను చేస్తానండీ' అన్నా.

'కనుబొమలు తీసేస్తారా' అని అడిగారు సురేశ్ బాబు.

'లేదండీ. కనుబొమలు తీయను. తీయాలంటే గవర్నమెంట్‌కు పర్పస్, రీజనూ అన్నీ చెప్పాలి. పైగా నాకు అవతల చాలా సినిమాలున్నాయి. వాళ్ళందరికీ ఇబ్బంది. నా మేకప్‌మేన్‌తో మాట్లా డాను. మేకప్‌తో మేనేజ్ చేస్తాం, మీకు నచ్చితే చూడండి' అన్నా. అందుకాయన, 'గుండు కొట్టించు కుని, కనుబొమలు తీసేస్తే మనిషిని గుర్తుపట్టడం నిజంగా కష్టమేగానీ మేకప్‌తో ఆ లుక్ వస్తుందా? వస్తుందేమో చూడండి' అన్నారు. ఆ మాట అన్నదే తడవుగా మా మేకప్‌మేన్ మోహన్ నా స్కిన్‌టోన్‌లో కలిసే విధంగా కనుబొమలకు రంగు వేశాడు. చూడ గానే నిర్మాతకు నచ్చేసింది. ఆ సినిమాలో నన్ను స్క్రీన్‌మీద చూసినప్పుడు కనుబొమలు తీసేశానేమో అనే అనిపిస్తుంది. అంత మాయ చేసింది మేకప్.

ఆ తర్వాత మా దర్శకుడికి పిల్లికళ్ళు పెట్టాలన్న ఆలోచన వచ్చింది. కానీ ఎలా పెట్టాలి? అని ఆలో చిస్తున్నప్పుడు, వెంకటేశ్‌గారి మేకప్‌మేన్ రాఘవ చూసి, అంతకుముందు ఎప్పుడో వెంకటేశ్‌బాబుకి వాడిన కళ్ళుతెచ్చి నాకు పెట్టి చూపించాడు. అంతా 'పర్ఫెక్ట్' అన్నారు. ఆ సంవత్సరం నాకు నంది అవార్డు వచ్చింది. ఆ గెటప్ అంత బాగా రావడా నికి మా మోహన్‌తోపాటు రాఘవ కూడా ఓ చేయి వేసి సహకరించాడు.

### ఇంకెన్ని చేసేవాడో!

'గణేష్' చిత్ర దర్శకుడు తిరుపతిస్వామి చాలా గ్రేట్ డైరెక్టర్. పాపం చాలా చిన్న వయసులో చని పోయాడు. లేకుంటే ఇంకా మంచి మంచి సిని మాలు తీసి ఉండేవాడు. 'గణేష్' షూటింగ్ జరిగి నన్ని రోజులు, మిగిలిన చిత్రాలకు ఆటంకం రాకుండా నన్ను చాలా కాపాడాడు. గుండు కొట్టించు కోకుండా ఉన్న సన్నివేశాలన్నీ ప్లాన్‌చేసి ముందు తీసేశాడు. ఆ తర్వాత గుండుతో నాలుగైదు రోజులు తీశాడు. మహా అయితే గుండుతో వారం



రోజులు ఉన్నానేమో. ప్రతిరోజూ సెట్‌కి వెళ్ళడం నున్నగా గుండు కొట్టించుకోవడం, సన్నివేశాలు చేయడం. ఇదీ తంతు.

ఆ సినిమా విడుదలైన తర్వాత వచ్చిన పేరు మామూలు పేరు కాదండీ. తోటి ఆర్టిస్టులు కూడా చాలా మెచ్చుకున్నారు. కనిపించిన ప్రతి ఒక్కరూ 'ఏం చేశావయ్యా కోటయ్యా' అని మెచ్చుకున్నారు. అంటే ఆ పాత్ర అంత పవర్‌ఫుల్‌గా వచ్చింది. నాయకుడు, ప్రతినాయకుడు పోటాపోటీగా ఉన్న సన్నివేశాలు చూసిన ప్రతి ఒక్కరినీ మెప్పించాయి. ఇలాంటి పాత్రల వల్ల కథకు ఒకరకమైన పటుత్వం చేకూరుతుంది. నా ప్రకారం విలన్ అనేవాడికి కాస్తంత రిలీఫ్ ఉండాలి. ఊరికే ఏదో కర్కశంగా డైలాగులు చెప్పడం వంటివి చేయకూడదు. చేసేది

**వెంకటేశ్‌గారంటే నాకు ప్రత్యేక అభి మానం. ఆయనంటే చాలా ఇష్టం. అంటే కొంచెం ప్రేమ, కొంచెం గౌరవం. మా ఇద్దరి కాంబినేషన్‌లో సినిమా తీస్తే అందులో తప్పకుండా ఏదోవుంటుందని స్పెషల్‌గా చెప్పుకునేవారు. భలే కుదిరిందిరా వాళ్ళ కాంబినేషన్ అనుకునేవారు. ఆ రోజుల్లో విలన్ పాత్రల రూపు రేఖలు తీర్చిదిద్దే తీరే వేరు. కానీ ఈ రోజుల్లో...? అంటూ కోటగారు ఎలాంటి అభిప్రాయం వ్యక్తం చేశారు?**

విలన్ పాత్ర అయినా కాస్త ఎంటర్‌టైన్‌మెంట్ ఉండాలి. ఉదాహరణకు 'గణేష్' లో కారులో వెళ్తూ చెప్పే డైలాగులు ఉంటాయి. ఎంత బావుంటాయో.

' ఆ ఫైల్ నాతానకి ఎట్ట వచ్చిందనుకుంటున్నా వయ్యా. పది లచ్చలు మీ ఎడిటర్‌కి కొట్టినా అంతే. అది తీసుకుని పన్నీరు పోసుకున్న పందిలాగా గెంతులు వేసుకుని ఏదో చోళీకే పీచే క్యాహే అని పాటలు పాడుకుంటూ వచ్చి ఇచ్చి వెళ్ళాడు' అంటాను. చాలా బావుంటుంది ఆ సీన్. అలాంటిదే మరో సన్నివేశం ఉంది ఆ సినిమాలో.

హాస్పిటల్‌కి వెంకటేశ్ వస్తే అతని చెల్లెలు 'నన్ను ముట్టుకోకన్నా..' అని చెప్పి మేడమీద నుంచి దూకేస్తుంది. మరోవైపు అతని తండ్రి పాత్ర చంద్ర మోహన్ చనిపోయి పడి ఉంటాడు. ఆ సమ యంలో వెంకటేశ్ ఏం చేయాలో అర్థం కాక అలా స్థాణువై నిలబడిపోతాడు. మామూలుగా మనం మాట్లాడుకునేటప్పుడు 'నిర్ఘాంతపోయాడు' అంటాం కదా, అలా నిలబడిపోయాడు. ఏం లుక్ పెడతాడో. .. సూపర్ అసలు. ఏం తోచనట్టు... అది నిజమా? కలా? అన్నట్టు ఒక లుక్ ఇస్తాడు. ఒక ఆర్టిస్ట్‌గా అవతలి ఆర్టిస్ట్ చేసిన విధానం మనకు అర్థమవు తుంది. 'ఎంత బాగా చేశారండీ' అని ఆయనతో ఎన్నిసార్లు అన్నానో. అలాగే లెజండ్రీ పర్సనాలిటీ చంద్రమోహన్‌గారిని గుర్తుచేసుకోకపోతే పొరపాటే అవుతుంది.

నాకు వెంకటేశ్ అంటే చాలా ఇష్టం. ఇష్టం అంటే ప్రేమ, కొంచెం గౌరవం అన్నమాట. ఆయ నకు కూడా అంతే, 'మంచి ఆర్టిస్ట్ కోటగారు' అని చాలా సందర్భాల్లో, చాలామందితో చెప్పేవారు. నేను, వెంకటేశ్ కలిసి చేస్తే 'వాళ్ల కాంబినేషన్ భలే కుదిరిందిరా'.. 'కోటగారు, వెంకటేశ్‌గారు సినిమాలో ఉన్నారంటే తప్పకుండా ఆ సినిమాలో ఏదో ఉంటుంది' అని అందరూ అనుకునేవారు. అది ఓ విశేషం కింద చెప్పుకునేవారు. ఆ రోజుల్లో... అంటే ఎన్నో దశాబ్దాలు అయ్యాయని కాదులెండి, ఆ రోజుల్లో అంటే ఒకటీ, రెండు దశాబ్దాల క్రితం విలన్ పాత్రల రూపు తీర్చిదిద్దే తీరు, ఆ పద్ధతి వేరుగా ఉండేది.

ఇప్పుడు సినిమాలన్నీ వేరు. అలాంటి గొప్ప చిత్రాలు ఇప్పట్లో రావాలంటే కొత్తగా జనరేషన్ మారాలి. లేకుంటే సినిమాలో పట్టు ఏం ఉంటుం దండీ. డబ్బులు పోసి ఏదో చేశామని చెప్పుకోవ డమో, ఫారిన్‌లో చేశామనో, ఇంకోటనో చెప్పుకో వడం తప్ప! అయితే 'బాహుబలి', లేకుంటే 'గౌతమిపుత్ర శాతకర్ణి'. అలాంటి సినిమాలుతప్ప మిగిలినవన్నీ ఇంచుమించు కాస్త కథ అటూ ఇటూగా ఒకేరకంగానే అనిపిస్తుంటాయి నాకు. పాత చిత్రాలు అలా లేవా? అని అడిగితే ఉండే వేమో. కాకపోతే ఏదో గమ్మత్తుగా, కాస్త పట్టుతో ఉండేవి.

**(ఇంకా ఉంది)**

**డా. చల్లా భాగ్యలక్ష్మి**
**సెల్: 88850 55528**



ఇందులో పాత్రేమీ లేదన్నమాట. వాళ్లు చివరి క్షణంలో మాత్రమే కనిపిస్తారన్న మాట. ఫేస్‌బుక్, టీవీ ఛానెల్, కోర్టుకు ఉన్న ప్రాధాన్యం మీ ఎమ్మెల్యేకో, మీ రాజకీయ ప్రతినిధికో, ఉన్నతాధికారికో లేదన్న మాట. ఎందుకిలా జరుగుతోంది? గత నలభై ఏళ్ల కాలం నుంచి మెల్ల మెల్లగా అధికారం చేతులు మారుతోంది. ఇంతవరకూ శాసన వ్యవస్థ, కార్యనిర్వాహక వ్యవస్థల చేతుల్లో ఉన్న అధికారం క్రమంగా న్యాయ వ్యవస్థ, మీడియా, సేవా సంస్థలు, పౌరహక్కులవారి చేతుల్లోకి మారిపోతోంది. వీరంతా కలిసి శాసన వ్యవస్థ అధికారాలను కబళించేశారు. ఇప్పుడు శాసన వ్యవస్థ అనేది బిల్లులు చర్చల్లేకుండా ఆమోదించడానికి, బడ్జెట్‌ను ప్రవేశపెట్టడానికి పరిమితమై పోయింది. ఫలితంగా రాజకీయనాయకులు, ఉన్నతాధికారులు ప్రాధాన్యం కోల్పోవడం ప్రారంభమైంది.

### మారుతున్న చేతులు

న్యాయ వ్యవస్థ, సమాచార, ప్రసార మాధ్యమం ప్రజాజీవితంలో అత్యంత ప్రాముఖ్యం సంతరించుకుంటున్నాయి. ప్రజల నిత్య జీవితంలో ఈ రెండు రంగాల పాత్ర పెరిగిపోతోంది. జీవితంలో ఇవి లేని కోణం లేదు. న్యాయాన్ని అందించేదిగా, చట్టాలకు భాష్యం చెప్పేదిగా, తరచూ కొత్త చట్టాలు రూపొందించేదిగా న్యాయ వ్యవస్థ మొదటి నుంచీ పెద్ద పాత్ర పోషిస్తోంది. కానీ, ఇప్పుడు ఆ పాత్ర మరీ పెరిగి పెద్దదైపోయింది. సామాజిక, ఆర్థిక, కుటుంబ, లింగ, ఆహార, దుస్తులు, విద్య, నీటి సరఫరా, చెత్త సేకరణ, ట్రాఫిక్, మతం, విధాన నిర్ణయాలు వగైరా అన్ని రంగాలతోనూ న్యాయవ్యవస్థకు ప్రమేయం ఉంటోంది. ప్రజాస్వామ్యానికి ఉన్న నాలుగు స్తంభాలలో (శాసన, కార్యనిర్వాహక, న్యాయ, సమాచార వ్యవస్థలు) మొదటి రెండు వ్యవస్థలూ క్రమంగా నిర్వీర్యమవుతుండగా చివరి రెండు వ్యవస్థలు విపరీతంగా ప్రాధాన్యం పెంచుకుంటున్నాయి. కార్యనిర్వాహక వ్యవస్థ అంటే ప్రభుత్వం చేయాల్సిన పనులను, తీసుకోవాల్సిన చర్యలను న్యాయస్థానాలే నిర్దేశిస్తున్నాయి. ప్రభుత్వ చర్యలను న్యాయస్థానాలే పర్యవేక్షిస్తున్నాయి. ప్రభుత్వ పరిధిలోని చర్యల మీద కోర్టులు ఆదేశాలు, ఉత్తర్వులు జారీ చేయడం దాదాపు నిత్య కృత్యమైపోయింది. వైద్య కళాశాలల్లో ప్రవేశాల

# కొత్త అధికార కేంద్రాల ఆవిర్భావం

**రాజకీయ నాయకులు తమను తాము బలహీనపరచుకుంటూ, శాసన, కార్యనిర్వాహక వ్యవస్థలను కూడా బలహీనపరుస్తుండడంతో కొత్త అధికార కేంద్రాలు విజృంభిస్తున్నాయి.**

ప్రభుత్వపరంగా, పాలనాపరంగా మీకేదైనా సమస్య ఎదురైతే ఎవరికి చెప్పుకుంటారు? ఏదైనా పని కావాలన్నా, సహాయం కావాలన్నా, ఎవరికైనా శిక్ష పడాలన్నా, ఎవరికైనా అవార్డు దక్కాలన్నా ఎవరిని ఆశ్రయిస్తారు? ఏ అధికారైనా బాధ్యతారహితంగా ఉంటే ఏ వ్యవస్థ దీన్ని చక్కదిద్దాలి? ఇదివరకైతే ఏ పాలక పక్ష నాయకుడికో, ఏ ప్రతిపక్ష నాయకుడికో చెప్పేవారు. మీ ఎమ్మెల్యేకో, మీ ఎంపీకో చెప్పుకునేవారు. మీకు సరైన సంబంధాలుంటే అంతకన్నా పెద్ద నాయకుడి దగ్గరకే వెళ్లేవారు. అటువంటి సంబంధాలు లేకపోతే ఏం చేయాలి? సంబంధిత అధికారులకో, మంత్రులకో ఓ ఫిర్యాదో, లేఖో రాసి పోస్టు చేసేవాళ్లు. కానీ ఇదంతా గత కాలం. ప్రస్తుత కాలంలో ఎవరూ ఈ విధంగా స్పందించడం లేదు. ఇలా చేయడం వల్ల ఉపయోగం ఉంటుందంటే ఎవరూ నమ్మడం లేదు కూడా. ఇప్పుడు సమస్యకు గురైన వ్యక్తో, బాధపడ్డ వ్యక్తో లేక సహాయం కావాల్సిన వ్యక్తో ఈ సన్నివేశానికి సంబంధించిన ఫొటో తీసి ఫేస్‌బుక్‌లోనో, ఇటువంటిదే మరే సోషల్ సైట్‌లోనో పోస్ట్ చేస్తున్నాడు. నూటికి సుమారు 80 పాళ్లు దీనికి వెంటనే సమాధానం వస్తోంది.

మరో మార్గం కూడా ఉంది. ఏ అధికారో, ఏ మంత్రో తప్పు చేసినప్పుడు లేదా బాధ్యతారహితంగా వ్యవహరించినప్పుడు వెంటనే ఏ టీవీ ఛానల్‌కో, కెమెరామేన్‌కో ఫోన్ చేసి చెబుతున్నారు. వాళ్ల సమస్య వెంటనే దేశవ్యాప్తంగా ప్రసారమైపోతుంది. ఆ ప్రసారంలో టీవీ ఛానల్ ప్రతినిధుల తీవ్రస్థాయి వ్యాఖ్యలు కూడా చేరతాయి. వెంటనే సంబంధిత అధికారి లేదా మంత్రి ఆ పనిని పూర్తి చేసేస్తున్నాడు. ఆ పని చేసేస్తామనీ, ఇది ఇక పెండింగ్‌లో ఉండదనీ కనీసం హామీ అయినా ఇస్తున్నారు. ఈ రెండూ సాధ్యపడకపోతే, కోర్టును ఆశ్రయిస్తున్నారు. చేతనయితే, నేరుగా హైకోర్టునో, సుప్రీం కోర్టునో కూడా ఆశ్రయిస్తున్నారు. లేదా, ఓ న్యాయవాదిని ఏర్పాటు చేసుకుని రాజ్యాంగంలోని ఆర్టికల్ 32 కింద కోర్టులో కేసు వేస్తున్నారు. ఈ ఆర్టికల్ కింద కేసు వేస్తే, సంబంధిత వ్యక్తి వెనువెంటనే స్పందించాల్సి ఉంటుంది.

అంటే, స్థానిక రాజకీయనాయకుడికో, శాసన సభ్యుడికో, ఎంపీకో, ప్రభుత్వ ఉన్నతాధికారికో






**- రాజశుక**

నుంచి నర్సరీ స్కూల్లో ప్రవేశాల వరకూ కోర్టులు ఏవో ఒక రూలింగ్ ఇస్తూనే ఉన్నాయి.

ఇంకా మన రాజ్యాంగం రూపుదిద్దుకోక మునుపే అమెరికాలో న్యాయ వ్యవస్థ క్రియాశీలత అనే మాట విస్తృతంగా వినియోగంలో ఉంది. మన దేశంలో 1980 దశకం నాటికి గాని ఇది ప్రారంభం కాలేదు. ప్రజా ప్రయోజన వ్యాజ్యాల సంఖ్య ఇబ్బడిముబ్బడిగా పెరిగిపోవడంతో ఈ క్రియాశీలత గురించి ప్రజాప్రతినిధులు, ఉన్నతాధికారులకు అవగతం కావడం ప్రారంభమైంది. ప్రజా ప్రయోజన వ్యాజ్యాలు పెరగడం శాసన, కార్యనిర్వాహక వ్యవస్థల పరిధిలోకి న్యాయవ్యవస్థ చొరబడడమేనన్న వాస్తవం వాళ్ల కళ్లకు కట్టేసరికి సమయం చేయిదాటిపోయింది. మొదట్లో న్యాయమూర్తులు సైతం ఈ వ్యాజ్యాల పట్ల విసుగు ప్రదర్శించేవారు. కానీ ఇప్పుడు పరిస్థితి మారిపోయింది. అటు ప్రభుత్వంలోనూ, ఇటు రాజకీయంగానూ అవినీతి పెరిగిపోవడంతో ఈ వ్యాజ్యాలకు ప్రాధాన్యం పెరగక తప్పలేదు. అధికార దుర్వినియోగం, అధికారుల నిర్లక్ష్యం, బాధ్యతారాహిత్యం వంటి వాటిపై కూడా ఈ వ్యాజ్యం అంకుశంలా పని చేస్తోంది.

ఈ ప్రజా ప్రయోజన వ్యాజ్యా(పిల్)లకు దీటుగా సుమోటో కేసులు కూడా పెరిగిపోవడంతో ఇక న్యాయవ్యవస్థ ఆధిపత్యం మరీ చేయిదాటిపోయింది. న్యాయస్థానాలు తమకు తాముగా కేసును విచారణలోకి తీసుకోవడానికి సంబంధించిన సుమోటో కేసులను కేవలం సామాన్య ప్రజానీకమే కాదు, మంత్రులు, అధికారులు సైతం ఒక్కోసారి కోరుకోవడం జరుగుతోందంటే అందులో ఆశ్చర్యమేమీ లేదు. ఇవన్నీ చాలవన్నట్టు పోలీసు దర్యాప్తుల మీద న్యాయస్థానాల పర్యవేక్షణ కూడా ఈ మధ్య కాలంలో విపరీతంగా పెరిగిపోయింది. ఈ మూడూ (పిల్, సుమోటో, దర్యాప్తులపై న్యాయస్థానాల పర్యవేక్షణ) కలిసి న్యాయవ్యవస్థ క్రియాశీలతగా రూపాంతరం చెందాయి. దీంతో భారతీయ ప్రజాస్వామ్య స్వరూప స్వభావాలే మారిపోయినట్టుగా కనిపిస్తోంది. పార్లమెంట్ బయట రాజ్యాంగాన్ని తిరగరాస్తున్నట్టు కూడా కనిపిస్తోంది. న్యాయవ్యవస్థ క్రియాశీలతను ప్రజా ప్రతినిధులు విమర్శిస్తున్నారు కానీ, ప్రజలు మాత్రం దీనిపై ఆనందోత్సాహాలు వ్యక్తం చేస్తున్నారు.

### న్యాయవ్యవస్థ క్రియాశీలత

పేదరికం, నిరక్షరాస్యత వంటి కీలక అంశాలలో పిల్, సుమోటోలను ఉపయోగించినప్పుడల్లా శాసన, కార్యనిర్వాహక వ్యవస్థల నుంచి పెద్దయెత్తున నిరసనలు, ఆక్షేపణలు వ్యక్తమవుతున్నాయి. న్యాయవ్యవస్థ మరీ అతిగా వ్యవహరిస్తోందంటూ విమర్శలు వస్తున్నాయి. నిజానికి, న్యాయస్థానాలు పేద, సాధారణ ప్రజల కనీస హక్కులను కాపాడేందుకే ప్రయత్నిస్తున్నాయి. కొంత కాలం కిందటి వరకూ ఇటువంటిది ఊహించలేని విషయం. న్యాయస్థానాలు ఏనాడూ శాసన, కార్యనిర్వాహక వ్యవస్థల అధికారాలను లాక్కోవడానికి ప్రయత్నించలేదు. శాసన, కార్యనిర్వాహక వ్యవస్థలే తమ అధికారాలను న్యాయవ్యవస్థకు వదులుకుంటున్నాయి. రాజకీయ స్థాయిలో పరిష్కరించుకోగలిగిన సమస్యలను కూడా శాసన వ్యవస్థ కోర్టు దాకా తీసుకు వెడుతున్నాయి. ప్రభుత్వ అనుభవరాహిత్యం వల్లనో, కక్ష సాధింపులో భాగంగానో ఇటువంటివి చోటు చేసుకుంటున్నాయి. శాసన, కార్యనిర్వాహక వ్యవస్థలు ప్రజాస్వామ్య వ్యవస్థకు, ప్రజాస్వామ్య సూత్రాలకు లోబడి పనిచేయకపోవడం వల్ల కూడా ఇటువంటి పరిస్థితి తలెత్తుతోంది.

టీవీ ఛానళ్ల యాంకర్ల కారణంగా రాజకీయ నాయకుల పరువు ప్రతిష్ఠలు, అధికారం మరింతగా దిగజారుతున్నాయి. టీవీ ఛానళ్ల యాంకర్లు వివిధ చర్చాగోష్ఠుల్లో, షోలలో రాజకీయ నాయకుల్ని దాదాపు ఉతికి ఆరేస్తున్నారు. ఒక్కోసారి వారి పరుగుల కింద తీసిపారేయడం కూడా జరుగుతోంది. టీవీ చర్చాగోష్ఠులు రాజకీయనాయకుల పరిస్థితిని మరీ దిగజారుస్తున్నాయి. దేశంలో రాజకీయనాయకులకు ఉండాల్సినంత గౌరవ మర్యాదలు ఉండడం లేదు. రాజకీయ నాయకుల్ని సాధారణంగా శాసన వ్యవస్థలకు ప్రతినిధులుగా పరిగణిస్తున్నందువల్ల శాసన వ్యవస్థలు కూడా ప్రజల దృష్టిలో చులకన అవుతున్నాయి. ప్రస్తుతం టీవీ ఛానళ్లు న్యాయాధికారులుగా, విచారణాధికారులుగా, సెన్సార్ బోర్డు సభ్యులుగా, రింగ్‌మాస్టర్లుగా వ్యవహరిస్తున్నారు. వీక్షకులు కూడా రాజకీయ నాయకులను నిలదీసే సన్నివేశాలను ఆనందంగా ఆస్వాదిస్తున్నందువల్ల టీవీ చానళ్ల రేటింగ్స్ పెరుగుతున్నాయి. గత ఒకటి రెండు దశాబ్దాలుగా భారతీయ టీవీ ఛానళ్లు రాజకీయ నాయకులను తెగనాడడమే పనిగా పెట్టుకున్నాయి.

గత రెండు మూడేళ్ల నుంచి సోషల్ మీడియా కూడా మరో అధికార కేంద్రంగా మారిపోయింది. యువతీ యువకులు ఫేస్‌బుక్, ట్విట్టర్ వంటి సోషల్ మీడియా సాధనాలకు అతుక్కుపోయి ఉండడం గతంలో కూడా ఉన్నదే. అయితే, సోషల్ మీడియాను ప్రధాన జీవన స్రవంతిలోకి తీసుకు వచ్చింది మాత్రం నరేంద్ర మోదీయే. టీవీ ఛానల్స్‌తో పోటీగా సోషల్ మీడియా కూడా రాజకీయ రంగంలో ఏం జరుగుతోందనే దాని మీద దృష్టి కేంద్రీకరిస్తోంది. సోషల్ మీడియా నుంచి ఇప్పుడు వార్తలు టీవీకి ప్రవహిస్తున్నాయంటే ఆశ్చర్యం వేస్తుంది. రాజకీయ నాయకులు సైతం కంప్యూటర్లలోనూ, తమ మొబైల్‌లోనూ సోషల్ ట్రెండ్స్‌ను అనుసరిస్తున్నారు. ఎప్పటికప్పుడు వాటిలో వస్తున్న వార్తలే వాళ్లకు సమాచారమవుతున్నాయి. సోషల్ మీడియా ద్వారా మంత్రులకు, ప్రజా ప్రతినిధులకే కాదు, పోలీసులకు కూడా ఫిర్యాదులు అందుతుండడం, వారు వాటిపై స్పందించడం రివాజుగా మారింది. మంత్రులకు ఓ శాసన సభ్యుడు ఇచ్చే ఫిర్యాదు కన్నా టీవీ ఛానల్ ఇచ్చే




**శాసన, కార్యనిర్వాహక, న్యాయ, సమాచార వ్యవస్థల్లో మొదటి రెండూ తమ ప్రాధాన్యం కోల్పోతున్నాయి. న్యాయ, సమాచార వ్యవస్థలు చురుకైన పాత్ర చేపట్టి సరికొత్త అధికార కేంద్రాలుగా విజృంభిస్తున్నాయి. టీవీ ఛానళ్లు లైవ్ ప్రోగ్రామ్‌లు, చర్చాగోష్ఠుల్లో రాజకీయనాయకులను ఉతికి ఆరేస్తూ ఉండటంతో వారు ప్రాభవం కోల్పోతున్నారు. మరి ఇలా ఎందుకు జరుగుతోంది?**

ఫిర్యాదు వేగంగా అందుతోంది. టీవీ, సోషల్ మీడియా కలిసి, రాజకీయనాయకులకు నిద్రపోనివ్వడం లేదు.

మొత్తానికి రాజకీయనాయకులు, శాసనకర్తల ప్రాధాన్యం క్రమంగా తగ్గిపోయి కొత్త అధికార కేంద్రాల శక్తిసామర్థ్యాలు అందనంత ఎత్తుకు ఎదిగిపోతున్నాయి. ప్రభుత్వ అధికారులు, మంత్రుల ప్రాధాన్యం కూడా క్రమంగా తగ్గిపోతోంది. ఎవరూ శాసనకర్తల్ని పట్టించుకోవడం లేదు. తమ సమస్యల పరిష్కారానికి ఎవరూ వాళ్ల దగ్గరికి వెళ్లాలనుకోవడం లేదు. రాబోయే తరం ఈ కాస్తయినా పట్టించుకుంటారా అన్నది సందేహమే. శాసనసభల్లో గానీ, పార్లమెంటులో గానీ ఒకప్పుడు ప్రశ్నాకాలం, సావధాన తీర్మానం, ప్రత్యేక తీర్మానం వంటివి ప్రజా సమస్యలను వ్యక్తం చేయడానికి ఉపయోగపడేవి. అప్పటికప్పుడు సమస్యలు పరిష్కారం కావాలని భావిస్తున్న ఈ రోజుల్లో వీటికి క్రమంగా ప్రాధాన్యం తగ్గిపోతోంది. సమాజంలో ఎందుకింత మార్పు చోటు చేసుకుందని ఆలోచిస్తున్నారా? రాజకీయనాయకులు స్వయంగా విఫలం కావడమే కాకుండా, దేశాన్ని, ప్రజలను కూడా విఫలం చేశారు. విపరీతమైన అవినీతి, ప్రజాధనం దోపిడీ, తమ ప్రాభవాన్ని పెంచుకోవడం, అధికారం ఉందని విర్రవీగడం, అధికార దుర్వినియోగం, ప్రజా సమస్యలు పట్టకపోవడం, సకాలంలో నిర్ణయాలు తీసుకోకపోవడం వంటివి విజృంభించాయి. ఫలితంగా ప్రజలకు శాసన, కార్యనిర్వాహక వ్యవస్థల మీద నమ్మకం పోయి, తమ సమస్యలను వెనువెంటనే పరిష్కరించే న్యాయవ్యవస్థ, టీవీ, సోషల్ మీడియా వంటి వాటి మీదకు దృష్టి మళ్లించాయి.




**"అద్దెకుండే వాడికి అరవై ఆరు ఇళ్లు! అన్నారు" అన్నాడు అహస్కరం.**

**"ఎవరూ అన్లే! మీరే అంటున్నారు" అంది అధోముఖం.**

**"తప్పడం లేదోయ్. సామెతలు తిప్పడం చెప్పడం. మనమీ ఇంట్లో ఎంతకాలం ఉంటామో ఏంటో."**

# సరే! సరే!

"ఆ మాట మళ్ళీ అనకండి! మారుతున్న ఇళ్ల సర్దీ, సర్దీ నాలో ఓపిక నశించింది. కుంగి కృశించింది".

"అదేంటో మా నాన్న ఉన్నప్పుడు ఇల్లు ఖాళీచేసినప్పుడల్లా మాకు పండగే! ఏవో లాకా లూకీలు, లీకా లాకులు మెలికలుతిప్పి ఇంటి ఓనరే మాకు బాకీ అని తేల్చేవాడు కాదంటే టెనెన్సీ యాక్టు చదివి వినిపించేవాడు".

"చెప్పుకోడం ఎందుకులెండి! అనగానే ఖాళీ చేయడం, ఉన్న సామాను పోవడం, వదిలేసేవి వదిలేయడం, పగిలేవి పగలడం, చివరికి నష్టాల్లో తేలడం. ఈ తెలివే మీకు మిగిలింది".

"ఏం చేస్తాం చెప్పు మధ్యతరగతి గోతిలో పడి కొట్టుకుంటున్న వాళ్ళం, కుంటుతున్నవాళ్ళం".

"నిరాశలూ, నిస్పృహలూ వదిలేసి, మీ సొంతిల్లా అంటే, కాదు వేరేవాళ్ళ సొంతిల్లు అని చెప్పడం ఇంకెంత కాలం చెప్పండి"

"నీకెందుకు గృహప్రవేశానికి గుమ్మడికాయ కొనుంచుకో!"

***

"ఏమోయ్! నీకో శుభవార్త! నేను రియలెస్టేట్ రంగంలో అడుగుపెట్టా" అన్నాడు అహస్కరం.

"ఆ అడుగేదో గట్టిగా వేయండి" అంది అధోముఖం ఆనందంగా.

"వేసిన అడుగు వేయి అడుగుల లోతులోకి పాతుకుపోయేట్టు వేశా. బాగా ఉన్న ఓ ఎన్నార్రై! ఆయన ఖాళీ జాగా అమ్మే పని నాకు పెట్టాడు. కొనేవాణ్ణి కనిపెట్టా!"

"కొన్నాడా లేదా చెప్పండి".

"రిజిస్ట్రేషన్ కూడా అయిపోయింది. అమ్మినాయన ఇచ్చిన రెండూ, కొన్న వాడిచ్చిన రెండూ కలిపి ఒకేసారి నాలుగు లక్షలకు అధికారినయ్యాను. చేయి, లక్ష్మీపూజ చేయి!"

"లక్ష్మీం క్షీర సముద్రరాజ తనయాం... ఏవిటండీ! ఇవన్నీ పాత అయిదొందలూ, పాత వేయి నోట్లా తెచ్చిపడేశారేం" కెవ్వుమంది అధోముఖం.

"ఖంగు తినకు, బ్యాంకు మేనేజర్‌తో మాట్లాడా!"

***

"ఏమోయ్! ఇంకో శుభవార్త!"

భర్త ఆనందనాదం విన్న అధోముఖం, పూజ గదిలో గంట మోగించి వచ్చింది.

"ఆ ఖాళీస్థలం కొన్న దేవానందం జాతకం ప్రకారం పెడగావున్న యాభైగజాలు వదిలించుకోకపోతే ఏనుగుల కాళ్లకింద పడతావని ఎవరో చెప్పారట. ఎంతో కొంతకు తీసుకోండంటున్నాడు నాతో. గోలకొండని నాకైతే రెండు లక్షల్లో యిస్తామంటే, డబ్బుల్లేక ఆ అవకాశం అందుకోలేకపోయాను అని చెప్పడంతో ఆ మాటలు అటూయిటూ తిరిగి సంవత్సరానికో లక్ష ఇచ్చేట్లుగా నన్ను తీసుకోమన్నాడు" చెప్పాడు ఆహస్కరం.

"ఆయన చెప్పుడు మాటలు వినే నైజంతో ఎంతో కొంత నేల మనదైందన్నమాట" భర్త నడుం కొలత చేతులతో చూస్తూ అన్నది అధోముఖం.

"ఎంతో కొంతేవిటి, ఒకదాని మీదొకటి ఎన్ని గదులైనా వేసుకోవచ్చు డబ్బులుంటే.." అన్నాడు అహస్కరం ఊహల్లో కళ్ళు పెట్టి.

***

వీపు గడపకు అంటించి, కాళ్లు నేలమీద చాచి, దిగులుగా ఉన్నాడు అహస్కరం.

> **అహస్కరం, అధోముఖం సొంతిల్లులేక బాధలుపడే చక్కని జంట. కానీ అంతలోనే వాళ్ళ దశ తిరిగింది. నాలుగు లక్షల క్యాష్ చేతిలో పడింది. తన స్థలంలోనే కొంత అయాచితంగా ఇవ్వజూపాడు దేవానందం. ఇహనేం! అని ఎగిరి గంతేసేంతలోనే అడ్డుపుల్ల పడింది! అహస్కరం భార్య ఎంతో అందంగా ఉంటుందని చాడీలు చెప్పారు దేవానందం భార్య దుర్భిణికి. అధోముఖం అందానికీ, ఈ స్థలానికీ ఏమిటి లింకు?**

"నవ్వీగిపోయిన మొగంతో వేళ్లాడుతున్నారు. ఏమైంది?" అడిగింది అధోముఖం.

"ఆ దేవానందం మెదడులో పురుగై కుట్టాడు, దురోదరం!"

"కాస్త వివరంగా చెప్పండి" ఆదుర్దాగా అడిగింది అధోముఖం.

"భర్త అందగాడైతే చేతికి అందడు అనే దుర్బుద్ధి పుట్టించారట పుట్టింటివాళ్ళు, దేవానందం భార్య హృదయ కాలేయంలో అనుమాన సరోవరవిహారం మొదలు పెట్టింది దుర్భిణి.

"బాల్కనీలో గడ్డం గీక్కుంటున్నారేం!" అని.

"ఇంట్లో ఉంటే మాత్రం చొక్కాలేకుండా ఒళ్లు తెరిచి చూపించాలా!" అని చీటికిమాటికి ఏవేవో లేనిపోని మొట్టికాయలు తినిపిస్తుందట

భర్త ఎక్కడికెళ్ళినా, ఎక్కడున్నాడో సెల్ఫీతీసి వాట్సప్‌లో పంపించాలట. తనింట్లో లేని వేళ, పరుపులమీద విడిచిన గుడ్డలేసి ఫొటో తీసి పెట్టుకుంటుందిట. ఆఖరికి భర్త ఏ బట్టలు ఎప్పుడు ఎలా వేసుకోవాలో తానే చెప్పాలట" చెప్పాడు అహస్కరం.

'ఆ గోలలు మనకెందుకులెండి. జరిగిందేంటో చెప్పండి' అంది అధోముఖం.

"ఆ దుర్భిణి సంగతి పసిగట్టిన దురోదరం, అహస్కరం భార్య చాలా అందమైందనీ, అందానికే అందమైందనీ దుర్భిణి చెవిలో ఊదాట్ట.."

'ఇక అర్థమయిందిలెండి! నేనంటూనే ఉన్నా, అంతా అయి చేతికొచ్చిందాకా మీ ఆనందాల్ని అందరికీ పంచి పెట్టకండీ అని. చెప్పక చెప్పక ఆ దురోదరంతోనే చెప్పారు".

"ఏదన్నా డబ్బు సర్దుతాడేమోనని సంగతి చెప్పానోయ్, నల్లమనీ తెల్లమొహం వేసిందిగా అని, తెల్ల మొహం వేసి చెప్పాడు."

"మీ మొహం నల్లమొహం చేశాడు!"

***

ఆ సంగతి మరచిపోయి, ఇంకా జాగాలెక్కడ ఖాళీగా ఉన్నాయి. అందులో ఎన్నార్రైలవి ఎన్నున్నాయని వెతుకులాటలోవున్నాడు అహస్కరం.

బెల్లుమోగితే తలుపు తీశాడు. ఎదురుగా దేవానందం!

ఆనందం లేని అహస్కరం ముఖం, తెచ్చుకున్న ఆనందంతో నిండింది.

"నేను ఇల్లు కట్టకముందే ఆ దురోదరం గది మీద గది మూడు గదులు వేశాడు. మూడో గదికి పోర్టికో అంటూ నా ఆకాశస్థలంలోకి సగం చొచ్చుకొచ్చి కట్టాడు. ఇదేమన్నా బాగుందా అనడిగితే దౌర్జన్యానికి దిగాడు. ఎవరో బట్టూ అట. గూండాలతో వచ్చి బెదిరించాడు. ఆ బట్టూకి మీరంటే గురు గౌరవం ఉందని తెలిసింది".

దేవానందం దీన అభ్యర్థనతో చెప్పివెళ్లాడు.

'అదీ సంగతి' అని భార్యతో చెప్పాడు అహస్కరం.

"ఏది చేసినా కాస్త ఆలోచించి చేయండి."

***

"ఏమండీ, ఆ దురోదరం వచ్చాడు. లేరని చెప్పమంటారా, బయటికివెళ్ళి సంగతేంటో కనుక్కుంటారా?" అంది అధోముఖం. క్షణం ఆలోచించి కదిలాడు అహస్కరం.

అహస్కరం కాళ్లమీద తలబెట్టి తీయడం లేదు దురోదరం!



"ఏవిటండీ యిది. ఏమైంది? ఎమ్మెల్యే టికెటేమన్నా వచ్చిందా ఏంటి?" అన్నాడు అహస్కరం.

"నా మొహానికి రాజకీయాలు కూడానా" అన్నాడు దురోదరం లేచి నించుంటూ.

"రాజకీయాలకు కావాల్సింది. మీలాంటి వాళ్లే కదా. సర్లెండి. ఎందుకొచ్చారో. నాతో ఏం పనొచ్చి పడిందో. నిజంగానే, ఆశ్చర్యంగానే ఉందండి" అన్నాడు అహస్కరం.

"ఆ బట్టూగాడికి అసలు సంగతి తెలిసిందండీ. ఇరగదీస్తా అంటున్నాడు" చెప్పాడు దురోదరం.

"వేటిని! పుల్లల్నా? కట్టల్నా?"

"కాదండీ, నన్నే!"

"మీరు పుల్లో, కట్టో కాదే. ఇంతకీ సంగతేంటో చెప్పండి."

"మీకనుకున్నది నాదైందని తెలిసిందండీ! మీరంటే ప్రాణమైనా యిస్తానంటున్నాడు. నన్ను కాపాడండీ" అన్నాడు దురోదరం.

"మీ ప్రాణం తీస్తానన్నాడా ఏంటి" అడిగాడు అహస్కరం.

"యాభై లక్షలు వాడికివ్వాలట. ఆ ఇల్లు మీ పేరు మీద రాయాలట. అదే సెటిల్‌మెంటు అన్నాడు. మరీ అన్యాయం కదండీ!"

"మీరేమన్నారు?"

"అహస్కరం గారి కాళ్లు పట్టుకుంటా, ఆయనే దంటే అదే. అన్నాను" అన్నాడు దురోదరం.

"సరే! నన్నేమనమంటారు?!"

మళ్లీ కాళ్లు పట్టుకున్నాడు దురోదరం.

"మీకేమన్నా సినిమారంగంలో పనిచేసిన అనుభవం ఉందా?" అన్నాడు అహస్కరం.

"అనుభవం లేదు గానీ, సినిమా తీసే ఉద్దేశంలో ఉన్నా".

"సరే! మీరా పనిలో ఉండండి".

***

బట్టూ కళ్ళల్లో మెదిలాడు!

చిన్నప్పుడు అనాథగా వచ్చిన బట్టూని పెంచి పెద్దచేశాడు. వచ్చినంతవరకు చదువు చెప్పించాడు. ఒకసారి వాడి తప్పులేకుండానే నలుగురు పిల్లలు కలిసి వాణ్ణి కొట్టారు. దెబ్బలతో ఇంటికి వచ్చాడు. జరిగిన సంగతి చెప్పాడు. ఆడపిల్లల్ని ఎవరేమన్నా చూసి సహించలేడు. దెబ్బలుతిన్న వాడి ఒంటిని ఏదో శక్తి ఆవహించింది. కండలు తిరిగి రాటు తేలాడు. అయ్యా! నేను ఎంచుకున్న దారి మీ ఆదర్శానికి పూర్తిగా వ్యతిరేకమయింది. చావంటే భయం లేదు నాకు. నాలాంటి వాడి నీడ మీ మీద పడకూడదు.

"అహస్కరుడు అంటే సూర్యుడు. మీరు మంచితనంతో మెలిగేవారు! మంచితనానికి ఈ రోజుల్లో విలువలేదు, అనలేనుగాని, బతుకుబాటలో ఏ ఆట ఆడాలో నాకు తెలుసు. ఆ ఆట నాకు బాట! బట్టూ పట్టుబడ్డాడు. ఆ పట్టు పట్టేవిటో మీకు చూపిస్తా" అని వాడి బతుకు వాడు మొదలుపెట్టాడు. ఆ తర్వాత వాడికి ఇంగ్లీషులో ఏ అవసరం వచ్చినా తన దగ్గరకే వస్తాడు.

అధోముఖం అంటే, కాళ్లు కడిగి నీళ్లు నెత్తిమీద చల్లుకున్నంత భక్తి, గౌరవం. అన్నం పెట్టిన తల్లీ అంటాడు.

"కొడుకు పెద్దవాడై, నలుగురిలో మంచిపేరు తెచ్చుకున్నప్పుడే కదరా" అని అధోముఖం ఒకసారి అంటే,

"పెంచిన కొడుకు విషయంలో అదికాదేమో తల్లీ! చెడుని చెడుతో కొట్టడం. మంచిని ఎవరూ వంచించకుండా చూడడం. బతికినంత కాలం బతకడం. అదే నా జీవితం. అది మంచోకాదో నాకు తెలియదు."

"పెళ్ళి రా" అంటే,

"చేసుకునే ప్రసక్తే లేదు" అని గట్టిగా చెప్పాడు.

***

దురోదరం వచ్చాడు. ఈసారి మనిషిలో ఏదో మార్పుతో ఉన్నాడు.

'అయ్యా! పర్మిషన్ లేని పై రెండు గదులు కొట్టి పడేయించాను. మిగిలింది మట్టసంగా చేయించి రంగులు వేయించాను. కాస్త రిజిస్ట్రేషన్ ఆఫీసుకి వస్తే దాన్ని మీ పేరు మీద రాయించి చేతులు దులుపుకుంటాను' అన్నాడు.

"సరే! మీరేదో సంతోషంగా, ధైర్యంగా కనిపిస్తున్నారు. సరదాగా కారణం అడగాలనిపిస్తోంది అడగొచ్చా" అన్నాడు అహస్కరం.

"ఏం లేదండీ, ఇదంతా చేసినందుకు నేను జాగా కోసం పెట్టింది నాకు ఇప్పిస్తానన్నాడు" చెప్పాడు దురోదరం.

"అయినా మీకు బోల్డెంత నష్టంతో మిగిలినట్లేగా".

"నేను అనుకోవడం లేదు లెండి".

***

"నేను సరే అనడం నీ కోరిక తీర్చడానికే!" అన్నాడు అహస్కరం భార్యతో.

"పోస్లెండి, ఎలా అనగలిగారా అని ఊహకు అందక తికమకపడుతున్నాం" అంది అధోముఖం.

"అయితే. ఇంకో మలుపుంది. అందుకు సరే అనలేదు అదేంటో విను."

'వామ్మో! ఏవిటండో అది'

"ఆ యాభై గజాలు మెట్రో రైలుస్టేషన్‌కు అవసరమొచ్చింది. ఆ డబ్బులు నన్నే తీసుకో మన్నాడు బట్టూ. ప్రజాక్షేమం కోసం జరిగే పనిలో అయాచితంగా వచ్చిన డబ్బు నాకెందుకు, నేను తీసుకోను అన్నాను"

"అన్నారూ, ఎందుకనరు. మంచిని వెలిగించే వారుగా" అంది అధోముఖం.

"అందుకేనమ్మా మీ వారికీ, నీకూ బట్టలు పెట్టి, దండంపెట్టి వెళదాం అని వచ్చాం" అంటూ వచ్చారు. దేవానందం, దుర్భిణి.

అధోముఖాన్ని చూడగానే "ఓసినీ నువ్వేనా! ఎలా ఉన్నావే! ఎన్నేళ్ళకు కలిశామే" అంటూ గట్టిగా ఒకరొకరు దగ్గరయ్యారు.

"నువ్వు స్కూల్లో, లంకకు కాపలావుండే ఆవిడ వేషం వేశావు గుర్తుందానే" అంది నవ్వుతూ అధోముఖం.

"లేకపోతే నీలాగా ఉంటే సీత వేషం వేసే దాన్నిగా" అంది దుర్భిణి.

సంతోషాలన్నీ పంచుకున్న తర్వాత,

'అద్దిళ్లల్లో పడేం తిరుగుతావే! మా ఇంటిపైనే ఉండువుగాని రా' అంది దుర్భిణి. స్నేహితురాలిగా నా కోరిక అన్న కళ్ళతో!

"ఏవిటండీ, మీ ఆవిణ్ణి అంత ఏకాగ్రతతో చూస్తున్నారు. ఎప్పుడూ చూసి ఎరుగనట్లుగా" అన్నాడు దేవానందం.

"సరే అంటుందా అనదా అని చూస్తున్నాలెండి" అన్నాడు అహస్కరం.

"ఆ ఇంటి అద్దె నాకు ఇస్తానంటే, సరే అంటాను" అంది అధోముఖం.

"ఎంత చెప్పవే!" అంది నవ్వుతూ దుర్భిణి.




**కోర్టు పని పూర్తి కావడంతో, డీసీపీ మేడం మళ్ళీ యు.ఎస్.ఏ.కు ఆ రోజు రాత్రి బయలు దేరి వెళ్ళిపోతుంది కాబట్టి, మేడమ్‌కి ఇష్టమైన హైదరాబాద్ వెజిటబుల్ బిర్యానీ తినిపిస్తానని డిన్నర్‌కి ఇన్వైట్ చేశాను. శ్రావణి షూటింగ్ నుండి డైరెక్టుగా హోటల్‌కు వస్తానని చెప్పడంతో నేను ఒంటరిగానే హోటల్‌కి చేరుకున్నాను. మేడం కూడా హెడ్‌క్వార్టర్స్ లో పని చూసుకుని నేరుగా హోటలుకే వస్తానంది. ఇద్దరిలో ఎవ్వరూ రాకపోవడంతో నేను లాబీలో స్ట్రోల్ చేస్తూ ఉండగానే, మేడం కారు దిగింది. నేను కారు దగ్గరకు వెళ్ళి రిసీవ్ చేసుకుని, మాకు రిజర్వ్ చేసిన టేబుల్ దగ్గరకు తీసుకొచ్చాను.**

"మేడం! వోడ్కా?" అని ప్రశ్నించాను.

మేడం ఆలోచించి, "నేను డిపార్ట్‌మెంట్ కారులో, స్టాఫ్‌తో వచ్చాను. వాళ్ళకు నేను డ్రింక్ చేసినట్టు తెలిస్తే బాగుండదు. పోనీ, ఎర్‌పోర్ట్‌లో నువ్వు డ్రాప్ చేస్తావా? డ్రైవర్ ఉన్నాడా?" అని అడిగింది.

"నేనే మీ డ్రైవర్‌ని మేడం!" అన్నాను.

"ఓహ్! నో... నో డ్రంకెన్ డ్రైవింగ్!" అని తల అడ్డంగా ఊపింది.

"కాదు మేడం! నేను డ్రింక్ మానేశాను."

"వావ్! ఎప్పటినుంచి?"

"నిన్నటినుండి! యాదగిరి నర్సింహస్వామి గుళ్ళో వదిలేశాను."

"గుడ్! వన్ లార్జ్ వోడ్కా!" అంది.

### జరిగిన కథ

ఆస్కార్ అవార్డుల పోటీల్లో అతడి చిత్రం ఎంపికైన సందర్భంగా అమెరికా వెళుతున్నాడా తెలుగు దర్శకుడు. విమానంలో కూర్చుని గతం గుర్తుచేసుకున్నాడు. జూనియర్ ఆర్టిస్టు హత్యాయత్నం కేసులో దర్శకుడికి, డీసీపీ పుష్పాకిరణ్ ప్రమేయంతో, లిఫ్ట్ ఇస్తాడు నిర్మాత. దాంతో సినిమా నిర్మించేందుకు సన్నద్ధమవుతాడు దర్శకుడు. సినిమా షూటింగ్ మొదలవుతుంది. క్రమంగా హీరోయిన్ శ్రావణి పట్ల ఆకర్షితుడవుతాడు డైరెక్టర్. అతనికి తన గతమేమిటో చెప్పి, దూరంగా వెళ్లిపోతుంది శ్రావణి. నవీన్‌ను పక్కకు తప్పిస్తాడు డైరెక్టర్. తర్వాత డైరెక్టర్ ఇంట్లో ఉన్న హార్డ్ డిస్క్ మాయమవటంతో, శ్రావణిని అరెస్ట్ చేస్తారు. డీసీపీ మేడమ్ పంపిన డీవీడీలు చూసి మతిపోతుంది డైరెక్టర్‌కి. స్నేక్ గ్యాంగ్ పాశవిక చర్యలు, కేసుల వివరాలు ఆ డీవీడీల్లో ఉంటాయి. శ్రావణిని మాల్ దగ్గర కిడ్నాప్ చేసి, డైరెక్టర్ దగ్గర ఉన్న హార్డ్ డిస్క్ తమకు తెచ్చివ్వాలని బెదిరిస్తుంది స్నేక్ గ్యాంగ్. ఆ తర్వాత స్నేక్ గ్యాంగ్‌ను అరెస్టు చేయటం, డీసీపీ మేడం ఆమెకు బెయిల్ ఇచ్చి, డైరెక్టర్ ఇంటికి తీసుకురావటం... అన్నీ చకచకా జరిగిపోతాయి. అన్నివిధాలా ఆలోచించి, ఆమెను దగ్గరకు తీస్తాడు డైరెక్టర్. ఆ తర్వాత.....

నేను డ్రింక్ ఆర్డర్‌చేసి, మేడంతోపాటు వచ్చిన వాళ్ళందరినీ భోజనం చేయమని చెప్పి వచ్చి కూర్చున్నాను.

మేడం వోడ్కా మెల్లిగా సిప్ చేస్తోంది, ఇంతకు ముందు లాగానే. నేను మేడమ్‌నే చూస్తూ కూర్చున్నాను. మేడం కొంచెం అలసిపోయినట్టు కన్పించింది. కానీ, ఇంతకుముందుకన్నా తెల్లగా, మంచు పుష్పంలా, సుకుమారంగా ఉంది.

ఇద్దరం రెండు నిమిషాలపాటు మౌనంగా కూర్చున్నాం.

తర్వాత, టేబుల్‌మీద ఉన్న నా చేతిని తన చేతుల్లోకి తీసుకుని ఆప్యాయంగా నిమిరింది. నేను తన కళ్ళల్లోకి చూశాను.

"శ్రావణిని ప్రేమిస్తున్నావా?" అని అడిగింది. ఆమె గొంతులో అనురాగం పొంగి పొర్లింది.

నాకు ఏం చెప్పాలో తోచలేదు. సందిగ్ధంలో ఉండిపోయాను.

"ఫర్వాలేదులే చెప్పు! శ్రావణిని ప్రేమిస్తున్నావా?" అంది.

"ఔను మేడం!" అన్నాను.

"గుడ్! నాకు అంతా తెలుసు. అన్నీ తెలుసు. నీలాంటివాడు నాకు ఫ్రెండైనందుకు గర్వంగా ఉంది. యూ ఆరే జెమ్ ఆఫ్ మ్యాన్! ఆమెను ఎప్పటికీ బాధపెట్టకు. హ్యాపీగా ఉండండి" అంది.

"మేడం! ఐ యాం సారీ.." అన్నాను.

"అదేంటి, సారీ ఎందుకు? మన మధ్య అటువంటి రిలేషన్ లేదు కదా? ఆ రోజు జరిగింది జస్ట్ ఫర్ ఎక్సైట్‌మెంట్! ఫన్! నా ప్రాణాలు కాపాడినందుకు, ఒక గొప్ప కేసు ఛేదించిన ఆనందంలో సరదాగా గడిపాము. ఐ యామ్ నాట్ సారీ అబౌట్ యిట్. ఈవెన్ ఐ చెరిష్ యిట్. వీఆర్ ఫ్రెండ్స్ యార్! అంతే!" అంది.

"కానీ, శ్రావణి విషయం అలా కాదు. ఆమె జీవితమంతా ముళ్ళబాటలలో సాగింది. చాలా అమాయకురాలు. నిన్న రాత్రి పోలీస్‌స్టేషన్‌లో బెయిల్ కోసం వెయిట్ చేస్తున్న సమయంలో తన గురించీ, నీ గురించీ చెప్పింది. మేమిద్దరం కారులో నీ దగ్గరకు వస్తున్నప్పుడు తన కథంతా చెప్పింది. అసలు, తను నీ దగ్గరకు రానంది. నీ ముఖం చూసే ధైర్యం లేదు తనకు. నేనే కన్విన్స్ చేశాను. ఎప్పటికైనా ఈ సిట్యుయేషన్ మీరిద్దరూ ఫేస్ చేయాల్సిందేనని, లేటైనకొద్దీ పరిస్థితులు మారిపోతాయని, మీ ఇద్దరి మధ్యలో మరెవరో దూరుతారని, మీ మన



సులు కలుషితం చేసే ప్రయత్నం చేస్తారనిచెప్పి, ఒప్పించి తీసుకొచ్చాను. ఇటువంటి ఆక్వార్డ్ సిట్యు యేషన్లో నిన్నుకలిసి ఇబ్బందిపెట్టడం, నిన్ను మోసం చేయడం ఆమెకు ఇష్టం లేదు. కానీ, నిన్న ఆమెను నువ్వు ఓదార్చి, అక్కున చేర్చుకోకపోతే శ్రావణి డిప్రెషన్లోకి పోయేది. పాపం! శ్రావణి నుదుటిమీద విధి కఠినమైన జీవితాన్ని రాసి పెట్టింది. దాన్ని సరిదిద్దడానికే, దేవుడు ఆమెకు నిన్ను ప్రసాదించాడు. అందుకే, ఆమె నిన్ను భగ వంతుడిలా పూజిస్తోంది. అందుకే, తనను ఆదరిస్తే నువ్వు కూడా అభాసుపాలవుతావని చింతిస్తోంది. దాని గురించి కూడా ఆలోచించు. నీకు భవిష్యత్తులో ఎంత కోపం వచ్చినా శ్రావణి గతం గురించిన ప్రసక్తి మాత్రం తీసుకురావద్దు. తనమీద ప్రేమతో కాక కేవలం జాలితో నువ్వు ఆదరిస్తున్నావనే భావన ఆమెకు కలిగితే, తను నిట్టనిలువునా కూలి పోతుంది. అలా జరగదని నువ్వు నాకు ప్రామిస్ చేయాలి" అంది.

నా పూర్వజన్మ సుకృతమేమో గానీ నాకు... నా జీవితంలో డీసీపీ మేడం, శ్రావణి వంటి అమృత మూర్తులైన స్నేహితులు దొరికారు.

'తప్పకుండా మేడం! నేను శ్రావణిని ప్రాణప్ర దంగా చూసుకుంటాను. ఆమెను పల్లెత్తుమాట కూడా అని బాధ పెట్టను" అన్నాను.

ఇంతలో శ్రావణి వచ్చింది. తను ఈ సంఘట నల షాక్ నుండి పూర్తిగా తేరుకోలేదు. అడుగులో అడుగు వేసుకుంటూ, భయం భయంగా టేబుల్ దగ్గ రకు వచ్చి నిలబడింది. నేను పక్కకు జరిగి 'కూర్చో' అన్నాను. కానీ, తను మేడం పక్క సీట్లో కూర్చుంది.

ఆ ఒక్క చిన్న జెస్చర్‌తో శ్రావణి ఇంకా భయ పడుతున్నదని నాకర్థమైంది. లేకపోతే నలుగురిలో నాతో కనపడితే ఏమవుతుందోనన్న అనుమానంతో అలా కూర్చుందేమోనన్పించింది.

మేడం శ్రావణి భుజం చుట్టూ చెయ్యివేసి దగ్గ రకు లాక్కుని హత్తుకుంది.

"శ్రావణీ! ఇక నీకేం భయంలేదు. ఈ



భూప్రపంచంలో నీకు డైరెక్టర్ సాబ్ కంటే మంచి మొగుడు దొరకడు. ఈ క్షణం నుంచి నువ్వు నీ గత జీవితం గురించి మరిచిపో! ఇప్పటినుంచీ నువ్వు కొత్త జీవితం మొదలుపెట్టు. ఇద్దరూ కలిసి భవిష్యత్తు గురించి ఒక మంచి నిర్ణయం తీసుకోండి. సరేనా!" అంది శ్రావణిని చూస్తూ.

శ్రావణి కళ్ళల్లో నీళ్ళు నిండాయి.

నేను ఆదుర్దాగా కళ్ళు తుడవబోయాను.

ఇంతలోనే మేడం, "ఛఛ ఏడవకు! నీకు నేనున్నాను. నువ్వు నా చెల్లెలితో సమానం. ఇప్పటినుంచి నువ్వు యాక్టింగ్‌లోతప్ప నిజజీవితంలో ఒక్క కన్నీటి చుక్క కూడా కార్చడానికి వీలులేదు." అంటూ తన కర్చీఫ్‌తో కళ్ళు తుడిచి,

"ఇదే నీ జీవితంలో చివరి కన్నీటిచుక్క. మళ్ళీ ఏడుపు రానీయకుండా చూసుకునే బాధ్యత తనది. తలెత్తుకుని ఠీవీగా, సగర్వంగా ఈ సమాజాన్ని ఎదుర్కో! సరేనా?" అని అడిగింది.

శ్రావణి తలూపింది.

అందరం భోజనం చేసిన తర్వాత బయలుదేరాం. మేడం వోడ్కా గ్లాసు అలాగే ఉంది. మేడం వోడ్కా తాగలేదు. తాగినట్టు నటించింది.

● ● ●

కారులో నా పక్కన శ్రావణి, వెనుక సీట్లో మేడం కూర్చున్నారు. మా వెనుక కార్లలో సెక్యూరిటీ వాళ్ళు ఫాలో అయ్యారు.

పీవీ నర్సింహారావు ఎలివేటెడ్ ఎక్స్‌ప్రెస్ హైవే మీద, కారు స్మూత్‌గా సాగిపోతోంది.

ఇంగ్లీషు సాహిత్యంలోని ఫెయిరీ టేల్స్‌లో హీరో హీరోయిన్లు కష్టాల్లో ఉన్నప్పుడు, నెత్తిపై మెరిసే కిరీటంతో, చేతిలో మ్యాజిక్ వ్యాండ్ పట్టుకుని ఒక గుడ్‌లక్ ఏంజిల్ ప్రత్యక్షమవుతుంది.

అలా నా శ్రావణి, కొంతలో కొంత నేనూ, పీకల్లోతు కష్టాల్లో మునిగి, దారీ తెన్నూ తెలియని అయోమయ స్థితిలో ఉన్నప్పుడు, అదృశ్యదేవత ప్రత్యక్షమైనట్టుగా మేడం చటుక్కున ప్రత్యక్షమయి మా సమస్య పరిష్కరించి, ఇప్పుడు దేశం వదిలి వెళ్ళిపోతోంది. అందరి హృదయాలు భారమయ్యాయి.

కొంతసేపటికి మేడం నోరు విప్పింది.

"సరే, ఇంకో విషయం... నీ సినిమా హార్డ్ డిస్క్ కోసం సుపారీ ఇచ్చిన టాలీవుడ్ పర్సనాలిటీని అరెస్ట్ చేసి పోలీస్‌స్టేషన్లో ఉంచి మర్యాదలు చేస్తున్నారు. అసలు అతనికి నీపైన శత్రుత్వం ఎందుకు?" అని అడిగింది.

నిజానికి నేనూ నిన్నటినుండి అదే విషయం ఆలోచిస్తున్నాను. అసలు ఆ వ్యక్తితో నాకు పరిచయమే లేదు. అతడిని నేనెన్నడూ కలిసింది కూడా లేదు.

నిజానికి టాలీవుడ్‌లో ఒక వింత పరిస్థితి నెలకొని ఉంది. బయటవాళ్ళు, సామాన్యప్రజలు, టాలీవుడ్‌లోని ప్రతీ డైరెక్టర్, నిర్మాత, హీరో, హీరోయిన్లు, మిగతా క్యారెక్టర్ యాక్టర్లు, జూనియర్ ఆర్టిస్టులు అందరూ రోజూ కలుసుకుంటూ ఉంటారనీ, అందరూ ఒక కుటుంబంలోని వ్యక్తుల్లా కలిసిమెలిసి ఉంటారనీ అనుకుంటారు. కానీ, నిజానికి ఎవరితోనూ ఎవరికీ పెద్దగా సంబంధాలుండవు. ఎవరితోనైనా కలిసి సినిమా చేస్తే తప్ప ఒకరి గురించి ఒకరికి తెలియదు.

నేను ఇప్పుడు మూడో సినిమాకు దర్శకత్వం వహిస్తున్నా, నాకు ఏ టాప్ హీరో, హీరోయిన్లు గానీ, స్టార్ ప్రొడ్యూసర్లు గానీ, స్టార్ డైరెక్టర్లతో గానీ పరిచయం లేదు. వారిని, నేను వెళ్ళి కలవాలన్నా, సామాన్య ప్రజలకు ఏ విధమైన ట్రీట్మెంట్ లభిస్తుందో నాకూ అదే లభిస్తుంది.

ఒకవేళ నా గురించి వారికి తెలిసినా, నా సినిమాలు గొప్పవని తెలిసినా... ఏమీ తెలియనట్లే, హిపోక్రటిక్‌గా నటిస్తుంటారు. నాతో అవసరముంటే మాత్రం నన్ను వెతుక్కుంటూ వస్తారు.

అందుకే, పోలీస్‌స్టేషన్లో ఉన్న ఆ టాలీవుడ్ ప్రముఖుని గురించి నాకు తెలిసినా, నేనెన్నడూ అతన్ని కలవలేదు. అట్లాంటి వ్యక్తి నా సినిమాను ఎందుకు సబొటేజ్ చేయాలనుకుంటున్నాడో నాకు తెలియదు.

అందుకే,

"అతని గురించి విన్నాను కానీ నిజంగా అతనితో నాకు పరిచయం కూడా లేదు మేడం! కానీ, ఏదో లింక్ ఉండే ఉంటుంది. టాలీవుడ్లో సంబంధం లేకుండా మిత్రత్వాలు, శత్రుత్వాలు ఎవరూ పంచుకోరు మేడం! కొంచెం ప్రయత్నిస్తే తెలుసుకోవచ్చు. తెలుసుకుంటాను మేడం!" అన్నాను.

మేడమ్‌కు ఏర్‌పోర్టులో సెండాఫ్ ఇచ్చి వస్తున్నప్పుడు, రిటర్న్ జర్నీలో, కారు నడుపుతున్నా నా




**అతడి మనసు మనసులో లేదు. ఈ సినిమా మొదలుపెట్టినప్పట్నుంచీ అన్నీ సమస్యలే! ఒక సమస్య ముగిసిపోతుందో లేదో మరో సమస్య చుట్టుకుంటోంది. కానీ శ్రావణిని ఇంతటి హింసకు గురిచేసినవాణ్ణి మాత్రం వదిలిపెట్టకూడదనుకున్నాడు. వాడెవడో తెలుసుకొని అంతు చూడాలనుకున్నాడు. మరి అతడెవరో తెలుసుకున్నాడా? చివరకు ఎటువంటి నిర్ణయానికి వచ్చాడతను?**

మనసు మనసులో లేదు. ఈ సినిమా మొదలుపెట్టినప్పటి నుంచీ ఒక సమస్య ముగిసిపోతుందో లేదో మరొకటి నా మెడకు చుట్టుకుంటోంది. ఇప్పటికైతే నాకూ, శ్రావణికీ ఏ సమస్యా లేనట్టే!

కానీ, శ్రావణిని ఇంతటి హింసకు గురిచేసిన వాణ్ణి తలుచుకుంటుంటే మాత్రం రక్తం మరిగిపోతోంది. శరీరంలోని అణువణువూ వాడిమీద ప్రతీకారం తీర్చుకోమంటోంది. వాడెవడో చూడాలనీ, వాడు ఇంత ఘాతుకానికి ఎందుకు ఒడిగట్టాడో తెలుసుకోవాలనీ ఆత్రుతగా ఉంది.

● ● ●

2012వ సంవత్సరంలో ఓ సినిమా రిలీజైంది.

దాంతో తెలుగు సినిమారంగం యొక్క రంగూ, రుచీ, దశా, దిశా, భాషా, యాసా మొదలైన అన్ని విలువలూ గంగలో కొట్టుకుపోయి, తెలుగు ప్రజల విలువల నిచ్చెనలో అట్టడుగున నిలిచే మురిక్కాలువల సంస్కృతి సినిమాల్లోకి ప్రవేశించింది. సంస్కారహీనులు తమ ఇంట్లో కూడా మాట్లాడలేని బూతును తెలుగు సినిమాకు పూసే పుణ్యం కట్టుకున్న సంవత్సరం అది. సినిమా నిండా బూతు నింపి, రెండు మూడు ప్రధాన పాత్రల మధ్య విపరీతమైన ద్వంద్వార్థాల డైలాగులను ఒక ప్రాంత యాసలో చెప్పిస్తే సినిమా హిట్టు కొట్టొచ్చనే ఓ నీచ నికృష్ట, దరిద్రపు హిట్ సినిమా ఫార్ములాకు నాంది పలికింది ఆ సినిమానే. ఏ మగాడు కూడా తన తల్లీ, చెల్లెలితో కలిసి థియేటర్లో కూర్చుని సినిమా చూసే ధైర్యం చేయలేక పోవడానికి ఆ సినిమా సృష్టించిన ఒరవడే కారణం.

దీనికితోడు అదే సమయంలో సినిమా నిర్మాణానికి సంబంధించిన కెమెరాల రంగంలో సాధించిన ఒక సాంకేతిక ప్రగతి కూడా ఇట్లాంటి సినిమాల తయారీకి తోడ్పడింది.

21వ శతాబ్దపు ఆరంభం నుండే సినిమా నిర్మాణం డిజిటల్ సాంకేతిక రంగం వైపు మొగ్గుచూపింది. అప్పటివరకు నెగటివ్ మీద అంటే ఫిల్మ్ మీద షూటింగ్ జరిపే విధానానికి స్వస్తి పలికే ప్రయత్నాలు ఆరంభమయ్యాయి. అయితే, కొంతమంది నిర్మాతలు, కెమెరామెన్లు ఈ డిజిటల్‌ఫిల్మ్ షూటింగుకు అడాప్ట్ కాకపోవడంతోనూ, డిజిటల్ కెమెరాలు ఆపరేట్‌చేసే పరిజ్ఞానం లేకపోవడంతోనూ, ఇంకా అనేక కారణాలతో, ఫిల్మ్‌మీదనే షూటింగులు జరుపుతున్నారు. ఫిల్మ్‌మీద షూటింగ్ చేయడమనేది చాలా ఖర్చుతో కూడుకున్న పని. 400 అడుగుల పొడవున్న ఫిల్మ్‌రోల్ ఖరీదు దాదాపు పదిహేనువేల

రూపాయలు ఉంటుంది. సినిమా నిడివి 15000 అడుగులు అనుకుంటే, నెగటివ్ ఫిల్మ్‌కోసం చేసే ఖర్చే ఆరేడు లక్షలవరకు ఉంటుంది. కానీ, పదిహేను వేల అడుగుల ఫైనల్ సినిమా చేతిలో పడాలంటే టేకులు, రీ టేకులు, ఎడిటింగుతో కలిసి సుమారు యాభైవేల అడుగుల ముడి ఫిల్మ్ అవసరమవుతుందనుకుంటే దాని ఖరీదు మూడు రెట్లు పెరిగి సుమారు ఇరవై లక్షలవుతుంది.

దానికి తోడు, ఇదే సమయంలో 2కె, 4కె వంటి అత్యాధునిక సినిమా ప్రొజెక్టర్లు రావడంతో, వాటిలో సినిమా దృశ్యం అత్యద్భుతంగా, స్పష్టంగా కనిపిస్తుండడంతో సినిమా థియేటర్ల యజమానులు వాటి వైపు మొగ్గు చూపడంతో, నెగటివ్‌మీద సినిమాలను సైతం చివరకు డిజిటల్ ఫార్మాట్‌లోకి కన్వర్ట్ చేయాల్సి వస్తుండడంతో, ఎక్కువ ఖర్చుపెట్టి నెగటివ్ ఫిల్మ్ మీద షూటింగ్ జరపడం వేస్టనే అభిప్రాయం బలపడసాగింది.

ఈ విధంగా సినిమా నిర్మాతల దృష్టి డిజిటల్ వైపు మరలగానే డిజిటల్ కెమెరాల విభాగంలో ప్రయోగాలు వేగవంతమయ్యాయి. 'రెడ్' కంపెనీ వారి 'MS' 'EPIC' డిజిటల్ కెమెరాలు ముందంజలో నిలబడ్డాయి. ఈ కెమెరాల ఖరీదు, మిగిలిన యాక్సెసరీస్‌తో కలిపి, ఇరవై, ముప్పై లక్షలవరకు ఉండడంతో, ఈ రంగంలో పాతుకుపోయిన వారు కెమెరాలు కొని అద్దెలకు తిప్పుకుంటూ విపరీతమైన లాభాలు ఆర్జించడం మొదలుపెట్టారు. ఒక్కరోజుకు కెమెరా రెంట్, కెమెరా అసిస్టెంట్లు, ఫోకస్ పుల్లర్, డి.ఐ. అసిస్టెంట్ల బత్తాలతో; లెన్స్‌లతో కలిపి, డిమాండ్‌ను బట్టి 25 వేల నుండి 30 వేల వరకు ఉండేది. ఫిల్మ్ ధరతో పోలిస్తే ఇది తక్కువే అయినా, చిన్ననిర్మాతలకు ఈ కెమెరాలు కూడా అందుబాటులో ఉండేవికావు.

## సినీవాలి
## కూపన్ నెం.20 విజేత

**ఎస్. హైమారాణి**
**ఎస్.ఎన్.పురం, విజయవాడ**

ఈ కెమెరాల రంగంలోని 'సోనీ', 'నికాన్', 'కానన్'ల మధ్య విపరీతమైన నిరంతర పోటీ ఫలితంగా 2009వ సంవత్సరంలో 'కానన్' కంపెనీ హై రిజల్యూషన్, 21 మెగా పిక్సెల్స్, 1080P Video వంటి సరికొత్త ఫీచర్లు కలిగిన 'Canon EOS 5D Mark II' అనే కెమెరాను మార్కెట్‌లోకి విడుదల చేసింది. ఈ కెమెరా సినిమారంగాన్ని ఒక ఊపు ఊపేసింది. సినిమా టేకింగులో విప్లవం సృష్టించింది. ఆ పీరియడ్లో నిర్మించిన ప్రతీ సినిమాలో, ఏదో ఒక సీనులో ఈ కెమెరాను ఉపయోగించకుండా సినిమాల నిర్మాణం పూర్తి కాలేదంటే అతిశయోక్తి కాదు.

ఇంతాచేస్తే, ఈ కెమెరా ఖరీదు, లెన్సులతో కలిపి, మూడు లక్షల లోపే. ఈ కెమెరా అద్దెకు తీసుకుంటే రోజుకు రెండు మూడు వేల రూపాయలు మించకుండా ఉండేది.

ఈ 'Canon EOS 5D Mark II' చిన్న నిర్మాతల పాలిటి కల్పవృక్షం అయింది.

ఈ Canon కెమెరాలతోనే బూతు సినిమాలు సృష్టించి, తెలుగు ప్రేక్షకుల మీదకు వదిలే నిర్మాత, దర్శకులు తయారయ్యారు.

సినిమా నిర్మాణంలో పెద్దఖర్చులు, హీరో, హీరోయిన్, డైరెక్టర్ల రెమ్యునరేషన్లు, ఔట్‌డోర్ లొకేషన్లు, కెమెరా, అకామడేషన్లు మాత్రమే! 5D కెమెరా ఆగమనంతో కెమెరా ఖర్చు బాగా తగ్గిపోయింది. హీరో హీరోయిన్లను కొత్తవాళ్ళను, సినిమా నిర్మాణంపై కొంత అవగాహన ఉండి ఉత్సాహవంతుడైన, అసిస్టెంట్ డైరెక్టర్‌గా పనిచేసిన కొత్తకుర్రాడిని డైరెక్టర్‌గా పెట్టుకుని సినిమాలు తీయడం ప్రారంభించారు. అయితే క్రియేటివిటీ ఉన్నవాళ్ళు కూడా కొత్త తరహా చిత్రాలు కాకుండా, కమర్షియల్ ఫార్ములానే పట్టుకుని చిన్న సినిమాలు నిర్మించడం మొదలుపెట్టారు. అవే పాటలు, ఫైట్లు, టీనేజ్ లవ్వులు తప్ప, మిగతా భాషల్లో లాగా ప్రయోగాల వైపు మొగ్గు చూపలేదు.

అయితే, ఒకటి రెండు సంవత్సరాలు మాత్రం, ఈ చిన్న సినిమాల వెల్లువలో పెద్ద సినిమాలు కూడా కొట్టుకుపోయాయి. ఈ సినిమాలకు థియే

---

నవ్య-ఈవారం సినీవాలి చదివారు కదా!
మా ప్రశ్నకు మీ జవాబు క్రింది కూపన్‌లో స్పష్టంగా రాసి
కూపన్‌ని కత్తిరించి మాకు పంపండి. లక్కీడిప్‌లో ఫ్యాన్సీ చీర గెలుచుకోండి!

## సినీవాలి-22 (15-3-2017)

మా ప్రశ్న: నాలుగు వందల అడుగుల పొడవున్న ఫిల్మ్ రోల్ ఖరీదు ఎంత?

మీ జవాబు---------------------------------------------------------------

చిరునామా---------------------------------------------------------------

------------------------------------------------------------------------

-------------------------పిన్-------------------------ఫోన్‌నెం-------------------------

ఈ కూపన్‌ను 14 మార్చి 2017 తేదీలోగా మా కార్యాలయానికి పంపగలరు.

మా చిరునామా: నవ్య వీక్లి, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం. 76, రోడ్ నెం 70, అశ్వనీ లే అవుట్, హుడా హైట్స్, జూబ్లీ హిల్స్, హైదరాబాద్-33

వివాహాది శుభకార్యాలకు కంచిపట్టు చీరల నిలయం పి.యన్.మూర్తి క్లాత్ స్టోర్స్ మెయిన్‌రోడ్, హన్మకొండ వారి సౌజన్యంతో...

*నిబంధనలు వర్తిస్తాయి

టర్లు ఇవ్వకుండా పెద్ద సినిమాల నిర్మాతలు టైట్ చేసినా, శాటిలైట్ రైట్స్ అమ్ముకుని లాభాలు గడించినవాళ్ళు చాలామంది ఉన్నారు.

డిజిటల్ కెమెరాలైన 'రెడ్' కెమెరాలతో గానీ, నెగటివ్ మీద షూట్‌చేసిన సినిమాలతో కానీ పోల్చినా క్వాలిటీ పరంగా ఉన్నతంగా లేకపోయినా డి.ఐ చేసి, గ్రాఫిక్స్ తొడిగి ఏవో గిమ్మిక్కులు చేసి, 5D సినిమాలు మాత్రం స్థానం సంపాదించుకునేవి.

పరిస్థితి ఎంతవరకు వచ్చిందంటే, 5D కెమెరా ప్యాకేజీలు ప్రారంభించారు. అంటే, సినిమా మొత్తం షూటింగు అయ్యేంతవరకు కెమెరా, ఎడిటింగ్, డబ్బింగ్, డీఐ, సౌండ్ మిక్సింగ్ చేసి ఫస్ట్‌కాపీ చేతిలో పెట్టడానికి ఓ ఐదు లక్షలకు మాట్లాడుకునేవారు. ఈ ఐదులక్షలు ప్లస్ ఇంకో ఐదులక్షలు నటీనటులకు, డైరెక్టరుకు, మిగిలిన ప్రొడక్షన్ ఖర్చులకు పెట్టినా, పబ్లిసిటీకి మరో ఐదులక్షలు ఖర్చు పెట్టుకునే విధంగా మొత్తానికి ఓ ఇరవై, ఇరవై ఐదు లక్షల్లో సినిమా చుట్టేసేవారు.

అందుకే, పెద్ద నిర్మాతలంతా ఒక కార్టెల్‌గా ఏర్పడి, 5Dతో షూట్‌చేసిన సినిమాల శాటిలైట్ హక్కు లను టీవీ ఛానళ్ళు కొనవద్దని, అలా చేయకపోతే తాము సినిమా యాడ్స్ ఇవ్వమని, ఆందోళనలు చేసేంతగా 5D కెమెరాతో తీసిన సినిమాలు, సినీరంగాన్ని ప్రభావితం చేశాయి.

ఈ వెల్లువలోనే, ఆ రోజుల్లో అంటే 2012లో పై సినిమా వచ్చింది. ఒకటి కాదు రెండు కాదు, మొదటి సినిమా ఇచ్చిన విజయం ఊపుతో, వరుసగా మూడు నాలుగు సినిమాలు బూతుతో, యూతుతో నింపేసి, బస్టాండుల్లో బాగా పబ్లిసిటీ చేసే ప్రేక్షకుల మీదకు వదిలి డబ్బుల మూటలు సంపాదించారు.

కానీ, తెలుగు సినిమా స్థాయి మాత్రం మురుగు కాలువల్లో ప్రవహించి మురికి గుంటల్లోకి చేరిపోయింది.

టాలీవుడ్‌కు విలువల గురించి పట్టింపులేదు. నిర్మాత గల్లాపెట్టె కాసులతో గలగలలాడితే చాలు. అమ్మాయిల అంగాంగ ప్రదర్శనలు, బూతు డైలాగులతో సినిమాను నింపి కొత్త ట్రెండ్ అంటారు. ఛానల్స్‌కు లక్షల్లో డబ్బులు గుమ్మరించి ఊదరగొడ్తారు. చండాలాన్ని కూడా ప్రసాదంలా భ్రమింపచేస్తారు.

టాలీవుడ్‌లోని కొంతమంది పెద్దలు, ఈ విశృంఖల ధోరణికి విస్తుపోయారు. దిగజారిపోతున్న విలువల పట్ల ఆందోళన వెలిబుచ్చినా, చివరకు వాళ్ళు కూడా ఈ 'బాబు బంగారాన్నే' నమ్ముకుని సినిమాలు తీసి బోల్తా పడుతున్నారు. వ్యాపారం వ్యాపారమే అని, విలువలను ఉపన్యాసాలకు పరిమితం చేశారు.

ఆ రోజుల్లోనే, నేను నా మొదటి సినిమాగా 'అమ్మా! నీకు వందనం!' అని కృత్రిమ గర్భధారణ కథాంశంగా స్త్రీ ఔన్నత్యాన్ని, ముఖ్యంగా ఒక తల్లి మహత్తర త్యాగాన్ని తెలిపే సినిమా తీశాను. అందరూ కొత్త నటీనటులతో, విమర్శకులు, క్రిటిక్స్, సినీపండిట్స్, సంఘసంస్కర్తలు మెచ్చుకున్నారు. సినిమా పేరులోనే ఒక గొప్పదనముందని అందరూ ప్రశంసించారు. కానీ, సినిమా విడుదల సమయంలో డిస్ట్రిబ్యూటర్లు చేసిన మోసాలతో, థియేటర్లు దొరక్క రెంట్లు కట్టి, సినిమా కొన్ని థియేటర్లలో మాత్రమే విడుదల చేసుకోవాల్సి వచ్చింది. అయితే మంచి సినిమా అని పేరు వచ్చినా, కమర్షియల్‌గా అట్టర్ ఫ్లాప్ అయింది.

అదే సమయంలో విడుదలైన ఒక యూతు, బూతు సినిమా మాత్రం విచ్చలవిడిగా విజయవంతమైంది.

పర్మనెంట్‌గా ఫ్లాప్ డైరెక్టర్ల లిస్టులోకి చేరుకున్నాను.

ఇంట్లో అమ్మా నాన్నలను పీడించి తెచ్చిన డబ్బంతా అయిపోయింది. టాలీవుడ్‌లో నేనను కున్న లక్ష్యాన్ని చేరుకోలేకపోయాను. పోనీ అంత మంచి సినిమాలు తీసినందుకుగాను, నాకు ఏ ఒకటో రెండో అనామక అవార్డులు తప్ప, గొప్ప పేరూ రాలేదు. బూతు సినిమాల డైరెక్టర్ల క్రియేటివిటీకి టాలీవుడ్ వారిని అందలం ఎక్కిస్తే, నేను ఆ ఫంక్షన్లను టీవీల్లో చూసి సంతృప్తిపడేవాణ్ణి.

ఇక మావల్ల కాదన్నారు అమ్మానాన్న. నాక్కూడా వాళ్ళను ఇంకా బాధ పెట్టడం భావ్యమనిపించలేదు.

ఐదు సంవత్సరాల్లో రెండు ఫ్లాప్ సినిమాలు తీసినా, నాకు మాత్రం ఆశ చావలేదు. కమర్షియల్‌గా హిట్ కాకపోయినా నా సినిమాల్లో మానవతా విలువలు, దేశభక్తి, మంచి డైలాగులు, మంచి పాటలతో సినిమాలు తీశానన్న తృప్తి మిగిలింది.

అయితే, ఏ చరిత్ర అయినా వైఫల్యాలను నమోదు చేయదు. మాట వరుసకు సానుభూతి చూపించినా, విజేతలకి పట్టం కడుతుంది. క్రికెట్‌లో 99 పరుగులు చేసినా, సెంచరీల రికార్డులే నమోదవుతాయి. ఇక్కడా అంతే, బై హుక్ ఆర్ క్రూక్, ఆర్ బై క్రూకెడ్ మెథడ్ అయినా ఫర్వాలేదు. బూతు సినిమా తీసినా ఫర్వాలేదుగానీ, ప్రేక్షకులను థియేటరుకు రప్పించగలిగినవాడే మొనగాడు.

మంచి విలువలతోనే అటువంటి విజయం సాధించాలన్నదే నా ఆశయం, పట్టుదల. ఆ ఆశయం నేను ఇప్పుడు తీస్తున్న సినిమా ద్వారా సాకారం కాబోతుందన్న నమ్మకం నాకుంది.

కానీ, దీనిక్కూడా అడ్డంకులు సృష్టించడానికి పన్నాగం పన్నుతున్నారు. ఈ కుట్ర ఛేదించాలి.

## అభిప్రాయాలను అమ్ముకోదట!

*ఎప్పుడూ ఏదో ఒక వివాదంలో మునిగి తేలుతూ ఉండే బాలీవుడ్ క్వీన్ కంగనా రనౌత్ సోషల్ మీడియాలో యాక్టివ్‌గా ఉండదు. వివాదాలకు ఇచ్చిన ప్రాముఖ్యం సోషల్ మీడియాకు ఎందుకు ఇవ్వరు? అన్న ప్రశ్నకు కంగనా కళ్ళుతిరిగే సమాధానం చెప్పింది. తన అభిప్రాయాలను సోషల్ మీడియాలో ట్వీట్ల రూపంలో అమ్ముకోవడం తనకు ఇష్టం లేదని చెప్పుకొచ్చింది. అయితే ట్వీట్లు చేస్తున్న వారందరూ డబ్బు కోసమే చేస్తున్నారా? అన్న ప్రశ్నకు మాత్రం సమాధానం దాటవేసింది. ఇప్పటివరకూ ఉన్న వివాదాలు చాలక ఇప్పుడు మరో కొత్త వివాదం తలకెత్తుకుందని ఆమె సన్నిహితులు బాధపడుతున్నారు.*



అందరూ నన్ను చూసి నవ్వారు. పిచ్చోడు అన్నారు. గేలిచేశారు. సినిమా అంటే వెయ్యి స్క్రీన్లలో బూతు ప్రవాహం చేస్తున్న ఆ సినిమాలా ఉండాలన్నారు. ఆ రోజంతా నేను కన్నీళ్ళు దిగమింగుకుని, ఎవరికీ ముఖం చూపించలేక రూము బయటకు రాలేకపోయాను. నా యూనిట్ మెంబర్స్ అందరూ నన్ను ఓదార్చారు.

ఆ తర్వాత ఆ బూతు సినిమాల డైరెక్టర్ టాప్ డైరెక్టర్ల లిస్టులోకి చేరితే, నేను మొదటి సినిమా లాంటిదే మరో సినిమా జాతీయ సమైక్యత మీద తీసి

దీని అంతు తేల్చాలి.

శ్రావణికి నరకయాతన చూపించినవాడు ఎవడైనా గానీ, మేడం దయ వల్ల ఆధారాలు దొరికాయి కాబట్టి, వాణ్ణి ఊచలు లెక్కపెట్టించాల్సిందేనని నిర్ణయానికి వచ్చాను.

ఆలోచనలు ముగిసేసరికి పైౖ ఓవర్ దాటాం. రష్ మొదలయింది.

శ్రావణి నావైపు చూసి నవ్వింది. నేను శ్రావణి భుజం మీద చెయ్యివేసి దగ్గరకు లాక్కున్నాను.

కానీ, నా కోసం ఇంకో 'షాక్' రెడీగా ఉందని నాకు అప్పుడు తెలియదు.

**(ఇంకా వుంది)**

## వాళ్ళతో స్నేహం మన అంతమే!

గ్రహాంతరవాసులతో స్నేహంవల్ల మానవజాతి అంతం కాగలదని ఖగోళ శాస్త్రజ్ఞులు హెచ్చరిస్తున్నారు. వారి నుండి రేడియో సంకేతాలు అందుతాయన్న ఆలోచనతో గ్రహాంతరవాసులకోసం చేసే పరిశోధనల ఫలితాలపై ముందుగానే ఒక నిర్ణయానికి రావాలనీ చికాగోలోని అడ్లెర్ ప్లానిటోరియం ఖగోళ, భౌతిక శాస్త్రజ్ఞుడు Lucianne Walkowic అంటున్నారు. విశ్వంలో తెలివైన గ్రహాంతరవాసుల సమాజం ఉంటుందన్న అన్వేషణ ఫలితం మన ప్రయోజనాలు కాపాడకపోవచ్చునన్నారు. వారు స్నేహపూర్వకమైనవారు కాకపోతే మానవజాతి నాశనం కాగలదనీ ఎన్.బి.సి ఇంటర్వ్యూలో ఆమె చెప్పారు. వారు స్నేహశీలురైతే భూమిపైన జీవన నాణ్యత వృద్ధికి దోహద పడతారన్నారు.

గ్రహాంతరవాసులతో సంబంధాలను 'ఒక డేంజరస్ గేమ్' గా స్టీఫెన్ హాకింగ్ హెచ్చరించారు. ఒకవేళ వారే స్వయంగా భూమిపై వాలితే, మన గ్రహాన్ని ఆక్రమించి వలస కేంద్రంగా మార్చుకుంటారనీ, కొలంబస్ అమెరికాను కనుగొన్నప్పుడు ఎలాంటి పరిస్థితులు తలెత్తాయో అలాంటి పరిస్థితులే తలెత్తుతాయని Lucianne Walkowic హెచ్చరిస్తున్నారు. అయితే కాలిఫోర్నియాలోని Seti (Search for Extraterrestrial Intelligence) సంస్థ మాజీ సంచాలకురాలు జిల్ టార్టర్ మాత్రం, వాళ్ళొస్తే శాంతియుతంగా, స్నేహపూర్వకంగా ఉంటారని అంటున్నారు. ఈ సంస్థ గ్రహాంతర వాసుల రేడియో సిగ్నల్స్ సేకరించే పనిలో నిమగ్నమైంది. ఈ విషయాలపై 1980లో రూపొందించిన మౌలిక ఒడంబడిక పత్రం కేవలం ఒక ఒడంబడిక పత్రమేతప్ప, గ్రహాంతరవాసులతో సంబంధాలకు ఉద్దేశించిన కార్యాచరణ ప్రణాళిక కాదని స్పష్టం చేశారు. గ్రహాంతరవాసుల సిగ్నల్ లభించాక అనుసరించాల్సిన పద్ధతులపై 1990లో ఏర్పడిన కమిటీకి షోస్టాక్ ఛైర్మన్‌గా ఉన్నారు. ఆయన ఏమంటారంటే, ఒకవేళ సంకేతాలు అందితే, అన్ని దేశాలతో చర్చించిన తర్వాతే వారికి తిరిగి సిగ్నల్స్ పంపాలనీ, ఫస్ట్ ఇంప్రెషన్ గుడ్ ఇంప్రెషన్‌గా ఉండాలన్నదే తమ అభిమతమనీ షోస్టాక్ అన్నారు. ఈ 'ఎర్త్ స్పీక్స్' ప్రాజెక్టులో 70 దేశాలకు చెందిన 2000 మంది పనిచేస్తున్నారు. రెండు శక్తిమంతమైన అతిభారీ శాటిలైట్లు గ్రహాంతరవాసుల సిగ్నల్ అందుకునే పనిలో నిమగ్నమై ఉన్నాయి.









**విజ్ఞాన వీచికలు**
**డాక్టర్ శ్రీమతి కె.అరుణావ్యాస్**
**ధర:** 100 రూపాయలు
**పేజీలు:** 144
**ప్రతులకు:** సురక్ష పబ్లికేషన్స్, డిజిపి ఆఫీస్, లక్డికపూల్, హైదరాబాద్-04
ఫోన్: 040-23233883

రచయిత్రి, వ్యాసకర్త, ఆంగ్ల, సంస్కృత భాషా పండితురాలు డాక్టర్ శ్రీమతి కె.అరుణా వ్యాస్. ప్రఖ్యాత ఐ.పి.ఎస్ అధికారి కీ.శే. కె.ఎస్. వ్యాస్ గారి సతీమణి. పోలీసు మాసపత్రిక 'సురక్ష'లో 'విజ్ఞాన వీచికలు' శీర్షికన విభిన్న అంశాలపై అరుణావ్యాస్ రాసిన 33 వ్యాసాల సంకలనం ఈ పుస్తకం. సాంకేతిక ఆవిష్కరణల నేపథ్యంలో మారుతున్న జీవిత విలువలు, వెర్రి తలలు వేస్తున్న పోకడలవల్ల కలిగే నష్టాలు, కొత్తను జాగ్రత్తగా ఆకళింపుకోవల్సిన ఆవశ్యకతను సునిశితంగా వివరించారిందులో. పాత కొత్తల మేలుకలయికగా సాగే ఈ వ్యాసాల్లో కుటుంబ వ్యవస్థను రక్షించేందుకు పాటించాల్సిన సనాతన, సంప్రదాయక విషయాలు వివరించారు.

శ్రీకృష్ణుడు మన్నుతిని నోట్లో విశ్వాన్ని చూపిస్తే మనం మౌస్ తిప్పుతూ ఇంట్లో విశ్వాన్ని దర్శిస్తున్నాం అంటూ నిత్యజీవితంలో టెక్నాలజీ వల్ల వచ్చే లాభనష్టాలు బేరీజువేశారు.

కుల, మత, రాజకీయ అగ్నిజ్వాలలకు సమిధలై పోతున్న పోలీసు తను కరిగిపోతూ దివ్యమైన వెలుగులు లోకానికి అందిస్తున్నారని చెబుతారు. కుహనా మేధావులు ఉగ్రవాదుల్ని వెనకేసుకువస్తూ పోలీసును అగౌరవపరుస్తున్నారంటారామె. సమాజంలో పెరుగుతున్న వికారాలు, కొత్త మోజులవల్ల కుదుళ్ళు కదిలిపోతున్న కుటుంబాలకు పరిష్కారాలు కనిపిస్తాయిందులో. ప్రతి ఇంటా ఉండదగిన పుస్తకం.



**తెలుగు కథా మందారాలు**
కథా సంకలనం
సంపాదకుడు:
**ఎమ్.ఆర్.వి.సత్యనారాయణ మూర్తి**
**ధర:** 250 రూపాయలు
**పేజీలు:** 320

**తెలుగుకథానిక 2015**
సంపాదకుడు:
**ఎమ్.ఆర్.వి.సత్య నారాయణ మూర్తి**
**ధర:** 100 రూపాయలు
**పేజీలు:** 124




ప్రతులకు: ఎం.రాజేశ్వరి, కార్యదర్శి, రమ్యసాహితి సమితి, జె.వి.ఎల్.రావు నగర్, పెనుగొండ. ప.గో.జిల్లా సెల్ 9848663735

మూడు దశాబ్దాలుగా తెలుగుకథ, కవితకు సేవలు అందిస్తున్న సాహిత్య సమితి రమ్యసాహితీ సమితి. పలువురు రచయితల కథా సంకలనాలు వెలువరించడంలో భాగంగా ఇప్పటి వరకు పదహారు కథల సంకలనాలు, సంపుటిలు, ప్రత్యేక సంచిక, పరిశోధనా గ్రంథాలు వెలువరించింది.

తెలుగు కథా మందారాలు పుస్తకంలో తొమ్మిదిమంది రచయితలు, రచయిత్రులు రాసిన 54 కథలున్నాయి. అదేవిధంగా 'తెలుగు కథానిక 2015' సంకలనంలో పద్నాలుగుమంది రచయితల కథలున్నాయి.

## స్వీకారాలు

**సద్గురు త్యాగరాజస్వామి పంచరత్న కీర్తనలు**
(అర్థవివరణతో)
**ఆచార్య బేతవోలు రామబ్రహ్మం, డి.వి.కె.వాసుదేవన్**
**ధర:** 45 రూపాయలు,
**పేజీలు:** 36
**ప్రతులకు:** ఎస్.ఆర్.బుక్‌లింక్స్, దానయ్యవీధి, మాచవరం, విజయవాడ-4
ఫోన్: 08662436959

**యాత్రాదీపిక-7**
మెదక్, పరిసర ఆలయాలు
పి.ఎస్.ఎమ్.లక్ష్మి
**ధర:** 50 రూపాయలు
**పేజీలు:** 104
**ప్రతులకు:** అన్ని ముఖ్యమైన పుస్తక దుకాణాలు

**చిట్టి చిట్టి మిరియాలు**
పాలపర్తి ఇంద్రాణి
**ధర:** 50 రూపాయలు,
**పేజీలు:** 80
**ప్రతులకు:** అన్ని ముఖ్యమైన పుస్తక దుకాణాలు

**-లలితా త్రిపుర సుందరి**



**రామ్‌దేవ్‌బాబా పేరు తెలియని భారతీయులు ఉండరనడంలో ఆశ్చర్యంలేదు. . యోగసాధనతో ఆయన తన దేహాన్ని ఎన్ని మెలికలు తిప్పుతూ ఉంటాడో, వివాదాలు కూడా ఆయన చుట్టూ అన్నే మెలికలు తిరుగుతూ ఆయన్ను చుట్టుకుని ఉంటాయి. పొట్ట లోపలకు లాక్కుని ఒక్క తిప్పు తిప్పే రామ్‌దేవ్ ఒక్కోసారి జనాన్ని పొట్ట పగిలేలా నవ్విస్తూ ఉంటారు. యోగాసనాలు వేయడంలో ఆయన గొప్ప దిట్ట. ఈ విషయంలో ఎవరికీ ఎలాంటి సందేహాలు లేవు. సన్యాసి అంటే కేవలం ఆధ్యాత్మికతే కాదు, దేశ, ధర్మాలు రక్షించేవాడని చాటిచెప్పిన వ్యక్తి రామ్‌దేవ్‌బాబా !**

# ఆధునిక కర్మయోగి రామ్‌దేవ్‌బాబా

యోగా అంటే రామ్‌దేవ్‌బాబానే అనే స్థాయికి ప్రపంచాన్ని తీసుకెళ్ళారాయన. రామ్‌దేవ్ కేవలం సన్యాసి మాత్రమే కాదు ఓ వ్యాపార దిగ్గజం.

అతి సాధారణ రైతు కుటుంబం నుంచి వచ్చి ఎందరో రైతులకు నేడు జీవనోపాధి కల్పిస్తున్నవాడు. రోగులెందరికో ఆరోగ్యం అందిస్తున్నవాడు. అలాంటి వ్యక్తి నేడు దేశానికి తలమానికంగా మారడం వెనక ఎన్నో సంవత్సరాల కృషి దాగి ఉంది. పట్టువదలని విక్రమార్కుడిలా ఆయన చేసిన ప్రయత్నం నేడు ఆయుర్వేదాన్ని అందలం ఎక్కించిదనడంలో అతిశయోక్తి లేదు. పతంజలి సంస్థ ద్వారా అంతర్జాతీయ సంస్థలను సైతం గడగడలాడిస్తున్నాడు.

### పుస్తకం మార్చేసింది

ఓ మధ్యతరగతి వ్యవసాయ కుటుంబంలో పుట్టిన రామ్‌దేవ్‌బాబా అసలు పేరు రామ్‌కృష్ణయాదవ్. హర్యాణాలోని మహేంద్రఘర్ జిల్లా అలీపూర్ సొంత ఊరు. అక్కడ దగ్గరలోని పల్లెటూర్లో ఎనిమిదవ తరగతి వరకు చదువుకున్నాడు. అతి చిన్న వయసు నుంచే ఆయనకు యోగా అంటే ఎంతో మక్కువ ఉండేది. ఆ మక్కువతోనే ఓ గురుకులంలో చేరి అక్కడ సంస్కృతం, ఇతర భారతీయ గ్రంథాలూ అధ్యయనం చేశారు. అరవిందఘోష్ రచన 'యోగిక్ సాధన్' పుస్తకం రామ్‌దేవ్‌బాబాను ఎంతగానో ప్రభావితం చేసింది. ఆ పుస్తకం స్ఫూర్తితో ఆయన ప్రాపంచిక విషయాలు విడిచిపెట్టి సన్యాసం స్వీకరించారు. స్వామి శంకర దేవ్‌జీ మహరాజ్ వద్ద చేరి సన్యాసం స్వీకరించారు. అప్పుడే ఆయన బాబా రామ్‌దేవ్‌గా మారారు. సన్యాసం స్వీకరించి సంస్కృత వ్యాకరణం, యోగా, దర్శన, వేదాలు, ఉపనిషత్తులలో పట్టభద్రుడయ్యారు బాబా రామ్‌దేవ్.

### ఇలా ప్రారంభమైంది

భారత్ స్వాభిమాన్, స్వదేశీజాగరణ్ పేరుతో తన ప్రయాణం ప్రారంభించారాయన. తొలుత తను విద్యాభ్యాసం చేసిన గురుకులం సమీప గ్రామాల్లో ప్రజలకు యోగ విద్య నేర్పించడం ప్రారంభించారు. కొద్ది సంవత్సరాలు హిమాలయాల్లో గడిపి, అనంతరం స్వరాష్ట్రానికి తిరిగి వచ్చారు. కొద్దిరోజులకు ఉత్తరాఖండ్‌లోని హరిద్వార్ చేరుకుని కంగ్రీవిశ్వవిద్యాలయంలో భారతీయ ఆధ్యాత్మిక గ్రంథాలు చదివారు. 1995లో యోగా ప్రచారానికి దివ్య యోగా మందిర్ ట్రస్టు స్థాపించారు రామ్‌దేవ్. ఆచార్య కరమ్‌వీర్, ఆచార్య బాలకిషన్ ఆయనకు చేదోడుగా నిలిచారు. వీరిలో ఒకరు యోగాలో పట్టభద్రులుకాగా, మరొకరు ఆయుర్వేద వైద్య పట్టభద్రులు. ఇలా ఈ జోడి హరిద్వార్ కృపాలుభాగ్‌లో ట్రస్టు ప్రధాన కార్యాలయం ఏర్పాటు చేసి యోగా బోధించడమే ముఖ్య లక్ష్యంగా నిర్దేశించుకుంది.

### యోగా శిబిరాలు

తొలినాళ్ళలో ఇతర గురువులు ఆసనాలకు

ప్రాధాన్యం ఇస్తే బాబా మాత్రం శ్వాస సంబంధమైన యోగాసనాలకే ఎక్కువ ప్రాధాన్యమిచ్చేవారు. ఇలా వైవిధ్య భరితమైన యోగా సాధనతో అనతికాలంలో గొప్ప పేరు సంపాదించుకున్నారు రామ్‌దేవ్. చిన్నవా గులా మొదలైన ఆయన ప్రయాణం లక్ష్యం వైపు దూసుకెళ్ళడం ప్రారంభించింది.

### టీవీలో యోగా ప్రచారం

హిందీ ఆధ్యాత్మిక ఛానల్ 'ఆస్థా' ద్వారా 2003వ సంవత్సరం నుండీ యోగా ప్రదర్శనలు, ప్రచారం ప్రారంభించారు రామ్‌దేవ్. దేశవ్యాప్తంగా ప్రతిరోజూ ఈ ఛానల్ చూసేవారి సంఖ్య లక్షల్లో ఉందనడంలో ఆశ్చర్యం లేదు. అలా ఆ ఛానల్ ద్వారా దేశ ప్రజలకు చేరువయ్యారు. అంతేకాదు, ఆయన యోగాభ్యాస శిక్షణలు మంచి ఫలితాలిస్తూవుండడంతో ఎంతోమంది అభిమానులు, అనుయాయులు ఆయనకు తోడ య్యారు. కేవలం యోగాశిక్షణ మాత్రమేకాదు, అవినీ తికి వ్యతిరేకంగా మాటల తూటాలు పేలుస్తూ ప్రజ లను స్వదేశీ నినాదంతో జాగృతం చేస్తూ వచ్చారు రామ్‌దేవ్. తన ప్రవచనాల ద్వారా ఇప్పటికీ, ప్రతి యోగా సాధకుడి మదిలో దేశభక్తి భావజాలం పెంపొందింప జేస్తున్నారాయన.

### నామమాత్రపు ధరలకే ఔషధాలు

ఇలా దేశ, విదేశాలకు ఆయన కీర్తి వ్యాపించింది. ప్రపంచవ్యాప్తంగా ఎంతోమంది సెలబ్రిటీలు, పారి శ్రామిక వేత్తలు ఆయన యోగా శిక్షణా శిబిరాలకు హాజ రవుతుంటారు. అంతేకాదు, ఆయన యోగసాధన, ప్రవచ నాల ద్వారా ఎంతోమంది స్ఫూర్తిపొంది మతాలకు అతీతంగా యోగా సాధన చేయడం ప్రారంభిం చారు. ఆ స్ఫూర్తితోనే హరిద్వార్‌లో పతంజలి యోగ్ పీఠ్ 2006లో ప్రారంభించారు. దాని ద్వారా యోగా, ఆయుర్వేద ప్రచారం ప్రారంభించారు.

అంతేకాకుండా అక్కడే ఆయుర్వేద వనమూలిక లతో ఔషధాల తయారీ యూనిట్లు నెలకొల్పి ఔష ధాల ఉత్పత్తి ప్రారంభించారు. అక్కడే ఉండి చికిత్స పొందేలా ఆశ్రమాన్ని రూపొందించారు. ఎందరో అక్కడకు వచ్చి అనారోగ్యాలను పోగొట్టుకున్నవారు లేకపోలేదు. ఇలా హరిద్వార్‌లో ప్రారంభమైన పతం జలి యోగ్‌పీఠ్ సంస్థ నేడు దేశం నలుమూలలకు విస్త రించింది. దేశంలోని వివిధ ప్రాంతాలలో ఉచిత వైద్య సలహాలు ఇస్తూ నామమాత్రపు ధరలకే ఆయుర్వేద ఔషధాలను పతంజలి ద్వారా రామ్‌దేవ్‌బాబా అందిస్తు న్నారు. భారతదేశంలో రెండు యోగ్‌పీఠ్ క్యాంపస్‌లు ఉండగా యూకే, యూఎస్, నేపాల్, కెనడా, మారిష స్‌లలో ఒక్కో క్యాంపస్ చొప్పున నెలకొల్పారు. ప్రస్తుతం పతంజలి యోగ్‌పీఠ్ భారతదేశంలోనే అతిపెద్ద యోగా క్యాంపస్‌గా ప్రఖ్యాతి గాంచింది.

## భారత స్వాభిమాన్ ట్రస్ట్

*భారత స్వాభిమాన్ ట్రస్ట్‌ను యోగా గురు రామ్‌దేవ్‌బాబా జనవరి 5, 2009న స్థాపించారు. భారతదేశాన్ని అవినీతి నుంచి విముక్తి చేయడమే ఈ ట్రస్ట్ లక్ష్యం. రాజీవ్ దీక్షిత్‌ను ట్రస్ట్ సెక్రటరీగా నియమించారు రామ్ దేవ్. ఎన్నికల్లో నూరుశాతం ఓటింగ్‌ను పెంచడం, జాతీయవాద భావాలను జాగృతం చేయడం విదేశీ ఉత్పత్తులు, కంపెనీలను బహిష్క రించడం, భారతీయులందరికీ ఒకే చట్టం వర్తింపచేయడం, యోగా ఆధారిత దేశంగా మార్చడం ట్రస్ట్ ముఖ్య ఉద్దేశాలు.*



### రాజకీయాల్లో...

రాజకీయాలలో కూడా రామ్‌దేవ్‌బాబా తనదైన ముద్ర వేశారు. ఎందరో ఆయనను హేళన చేసినప్ప టికీ రాజకీయాలను ప్రభావితం చేసే స్థాయికి ఎది గారు రామ్‌దేవ్. దేశానికి పట్టిన అవినీతి అనే అనా రోగ్యాన్ని కూడా పారద్రోలేందుకు తన వంతు కృషి చేశారు. అన్నా హజారే 2011వ సంవత్సరంలో చేప ట్టిన ఆన్‌లైన్ లోక్‌పాల్ ఆందోళనకు సంపూర్ణ మద్దతు ప్రకటించారు. అవినీతి వ్యతిరేక పోరాటం సలి పారు. 'విదేశీ కాదు, దేశానికి స్వదేశీ వస్తువుల వాడకం ద్వారానే ఆర్థిక బలం చేకూరుతుంది' అని కరాఖండిగా చెప్తుంటారు రామ్‌దేవ్‌బాబా. అవినీతికి వ్యతిరేకంగా అప్పట్లో రామ్‌లీలా మైదానంలో చేపట్టిన ఉద్యమంలో రామ్‌దేవ్‌కు ప్రాణాపాయం తప్పింది. ఈఘట్టం ఆయన జీవితంలో ఒక ముఖ్యభాగంగా చెప్పుకో వచ్చు. అంతర్జాతీయ కంపెనీలు ఎన్ని కుట్రలు పన్నినా వాటన్నింటినీ ఆయన ఎదురొడ్డి నిలదొక్కుకున్నారు. పతంజలి సంస్థను బలోపేతం చేస్తూ వచ్చారు. యోగా కోసం ఐక్యరాజ్య సమితి ప్రత్యేక దినోత్సవం నిర్వహించే స్థాయికి భారతీయతను, భారతీయ గౌర వాన్ని ఇనుమడింపచేశారు రామ్‌దేవ్‌బాబా.

### పతంజలి ఆయుర్వేదం- జెడ్ కేటగిరీ భద్రత

ఆచార్య బాలకిషన్‌తో కలిసి 2006వ సంవత్సరంలో రామ్‌దేవ్‌బాబా పతంజలి ఆయుర్వేదం స్థాపించారు. ఆయుర్వేద వనమూలికా ఔషధాలను నూతన యంత్రాలతో రూపొందించారు. అనంతరం నేపాల్‌కు కూడా పతంజలి సంస్థ విస్తరించింది. మెల్లమెల్లగా మొదలైన సంస్థ ఎన్నోరాష్ట్రాలలో, దేశాలలో ప్రారంభ మైంది. ఈ సంస్థ ఉత్పత్తి కేంద్రానికి 35మంది కేంద్ర రిజర్వ్ బలగాలు కాపలా కాస్తుంటాయి. 2016లో స్థాపించిన ఈ ఆయుర్వేద వనం దేశవ్యాప్తంగా ఉన్న ప్రజలకు సరిపడ ఔషధ మొక్కలను పండిస్తోంది. రామ్‌దేవ్‌బాబాకు ప్రస్తుతం ప్రభుత్వం జెడ్ క్యాట గిరీ భద్రత కల్పిస్తోంది. పతంజలి స్థాపనతో కోల్‌గేట్, డాబర్, ఐటీసీ, గోద్రేజ్‌వంటి బడా కంపెనీలు కూడా దివాళా తీసే పరిస్థితికి వచ్చాయని ఇండియా ఇన్ఫో లైన్ సంస్థ తెలిపింది. 2015వ సంవత్సరంలో మహా రాష్ట్ర ప్రభుత్వం, వన్‌ధన్ జన్‌ధన్ పథకం ద్వారా సంస్థకు కావలసిన ముడిపదార్థాలు విక్రయించేందుకు ఒప్పందం కుదుర్చుకుంది. కంపెనీ ద్వారా మొత్తం 444 రకాల ఉత్పత్తులు చేపడుతున్నారు. వాటిలో 45 రకాల సౌందర్య సాధనాలు కాగా, 30 రకాల ఆహార పదార్థాలు ఉండడం విశేషం. పూర్తి ఆయుర్వేద పద్ధ తుల్లోనే పతంజలి ఆయుర్వేదం తన ఉత్పత్తులు రూపొందిస్తున్నట్లు రామ్‌దేవ్‌బాబా ప్రకటించారు. సాధారణమైన జలుబు నుంచి పక్షవాతం వరకు అవసరమైన ఔషధాలను రోగులకు పతంజలి ఆయుర్వేదం అందజేస్తోంది. ప్రస్తుత ఔషధాలే కాకుండా నూడుల్స్, జీన్స్, కుర్తా పైజామా వంటి ఉత్పత్తులను కూడా ఈ సంస్థ ఉత్పత్తి చేస్తోంది.

అస్సాంలో 1200 కోట్ల రూపాయల పెట్టుబడితో అతి పెద్ద హెర్బల్, ఆహార ప్లాంటు పతంజలి సంస్థ స్థాపించనుంది. దేశవ్యాప్తంగా 4,700లకు పైగా రిటైల్ ఔట్‌లెట్‌లు పతంజలి ఆయుర్వేద సంస్థకు ఉన్నాయి. 2015 సంవత్సరంలో ఫ్యూచర్ గ్రూపుతో సంస్థ ఒప్పందం కుదుర్చుకుంది. 2016-17 సంవత్స రానికి గాను పదివేల కోట్ల ఆదాయమే లక్ష్యంగా సంస్థ పనిచేస్తున్నట్లు రామ్‌దేవ్‌బాబా ప్రకటించారు. ప్రస్తుతం ఐదువేల కోట్ల టర్నోవర్ ఉంది. డీలర్‌షిప్, డిస్ట్రిబ్యూషన్ విధానం ద్వారా ఎందరికో ఉద్యోగ, వ్యాపార అవకాశాలు కల్పిస్తోంది.

**- సంతోషలక్ష్మి దహగాం**

## అవార్డులు

1. *వైదిక - ఆధునిక విద్యా విధానంతో పతంజలి యోగ్‌పీఠ్ ఆధ్వర్యంలో హరిద్వార్‌లో ఆచార్య కులం అనే గురుకుల విద్యాసంస్థను రామ్‌దేవ్ బాబా స్థాపించారు. దీన్ని ఏప్రిల్ 26, 2013 సంవత్సరంలో ప్రధానమంత్రి మోదీ ప్రారం భించారు.*
2. *భువనేశ్వర్‌కి చెందిన కళింగ ఇనిస్టిట్యూట్ ఆఫ్ ఇండస్ట్రియల్ టెక్నాలజీ జనవరి 2007న బాబా రామ్‌దేవ్‌కి గౌరవ డాక్టరేట్ అందించింది.*
3. *2011లో నాటి మహారాష్ట్ర గవర్నర్ కె. శంకర నారాయణన్ శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి నేష నల్ ఎమినెన్స్ అవార్డు రామ్‌దేవ్‌కు ప్రదానం చేశారు.*
4. *ప్రముఖ దిగంబర సాధువు తరుణ్‌సాగర్ 2012 జూలైలో రామ్‌దేవ్‌కు తరుణ్ క్రాంతి అవార్డు అందజేశారు.*
5. *హర్యానా ప్రభుత్వం 2015 సంవత్సరంలో ఇచ్చిన క్యాబినెట్ హోదాను సున్నితంగా తిర స్కరించారు రామ్‌దేవ్. సన్యాసిగానే తాను సేవలందిస్తానన్నారు.*






# భయం.. భయం...

**డిటెక్టివ్ శరత్ గదిలోకి అడుగుపెట్టాడతను. అతడి వెనకే భయం భయంగా అనుసరించి వచ్చారు ఇద్దరు పిల్లలు. వాళ్ళవైపు చూశాడు శరత్. పిల్లలను చూసి నవ్వాడు.**

**మగపిల్లవాడికి ఆరేళ్ళుంటాయి. అతడు శరత్ వైపు చూశాడు కానీ శరత్ పలకరింపు నవ్వును అర్థం కానట్టు చూశాడు. తనని కానట్టు ముఖం తిప్పుకుని బెదురుగా గదంతా కలియచూస్తూ నిలబడ్డాడు. ఉండి ఉండి శరత్‌వైపు దొంగ చూపులు చూస్తున్నాడు. పాపకు నాలుగేళ్ళుంటాయి. పాపను చూసి పలకరింపుగా నవ్వాడు శరత్. భయంగా చుట్టూ చూసింది. పారిపోయే వీలులేక పిల్లవాడిని గట్టిగా పట్టుకుని ఏడవటం ఆరంభించింది. భయంతో వణికిపోసాగింది.**

పిల్లల వెంట వచ్చినవ్యక్తి పాపను ఎత్తుకుని సముదాయించాడు. ఆ పాప శరత్ ముందుకు రావటానికి ఇష్టపడలేదు. అతడు శరత్ ముందు కూర్చోగానే కుర్చీ వెనక దాక్కుంది.

'వీళ్ళు నా పిల్లలుకాదు. నాకు దొరికారు. నేను ఎంఎంటిఎస్‌లో ఆఫీసుకు వెళ్ళేటప్పుడు ఎక్కడ ఎలా కూర్చున్నారో, సాయంత్రం ఇంటికి వెళ్ళేటప్పుడూ అక్కడే కూర్చుని కనిపించారు. తిండి లేదు. అన్నం పెట్టాను. మాట్లాడరు. బెదురుతున్నారు. పాప కాస్త బెదిరితే ఏడుస్తోంది. ఏం చేయాలో తెలియ లేదు. మీరైతే వీళ్ళెవరో, ఎక్కడి వారో తెలుసుకుని కన్న తల్లిదండ్రులకు అప్పచెపుతారని ఇక్కడికి తీసుకొచ్చాను. ఖర్చు గురించి ఆలోచించకండి' అన్నాడతడు.

పిల్లల్ని పరీక్షగా చూశాడు శరత్.

కుర్చీ వెనుక దాక్కున్న పాప శరత్‌చూపు తనపై పడగానే ముడుచుకుపోయింది.

బాబు బెదురుచూపులు చూస్తూ తననికానట్టు తల తిప్పుకున్నాడు.

'వాళ్లు ఏమీ మాట్లాడటం లేదు. మాటలు రానట్టున్నాయి. భాష తెలియనట్టుంది' అన్నాడతడు, శరత్ చూపులు గమనించి.

'పోలీసులకు చెప్పాల్సింది' అన్నాడు శరత్.

'నాకు ఇష్టం లేదు. ప్రొసీజర్లు, తతంగాలు లేకుండా తల్లిదండ్రుల్ని మీరే వెతికిపెట్టండి. త్వరగా పనైపోతుంది' అన్నాడతడు.

పిల్లలిద్దరినీ మరోసారి పరిశీలనగాచూసి చైల్డ్ ట్రామా స్పెషలిస్ట్ చరణ్‌కి ఫోన్ చేశాడు శరత్.

***

పిల్లలిద్దరినీ పరిశీలించిన చరణ్, శరత్‌ని గదిలోకి పిలిచాడు.

'ట్రామటైజ్డ్ పిల్లలు (Traumatized) ఎందరినో నేను చూశాను. కానీ వీళ్ళు అనుభవించిన ఘోరమైన సంఘటన భిన్నమైనదిగా ఉండి ఉంటుంది. మామూలు ట్రామా కాదది. వాళ్ళు అనుభవించిన ఘోరమైన అనుభవాలవల్ల పిల్లలు తమలో తామ ముడుచుకుపోయారు. మగపిల్లవాడు ఒక రకమైన 'డిటాచ్‌మెంట్' (detachment) లక్షణాలు చూపిస్తున్నాడు. అమ్మాయి అబ్బాయిలా తాను వేరు, తన శరీరం వేరు అన్నభావన అభివృద్ధి చేసుకోలేక పోయింది. అందుకే ఏడుస్తోంది. కానీ నా పరిశీలన వల్ల వీళ్లది 'టెంపరరీ మ్యూట్‌నెస్' అనిపిస్తోంది. అంటే 'తాత్కాలిక మూగతనం'. వీళ్ళు చూసిన ఘోరమైన సంఘటన ప్రభావం వల్ల అలా అయ్యారు'.

'అదేమై ఉంటుంది?' అడిగాడు శరత్.

'అది నువ్వే కనిపెట్టాలి' అన్నాడు చరణ్.

కాస్సేపు ఆలోచించాడు శరత్. వీళ్ళు ఎలాంటి భయంకర అనుభవం పొంది ఉంటారో మనం ఎలా తెలుసుకోవటం?' అడిగాడు.

'నేను వీళ్ళకు పలురకాల బొమ్మలు చూపిస్తాను. అవిచూసి ఎలా స్పందిస్తారో గమనిద్దాం. దాని ద్వారా ఏమైనా తెలుస్తుందేమో' అన్నాడు చరణ్.

'సరే' అన్నాడు శరత్.

***

తనకేం పట్టనట్టు కూర్చుని దిక్కులు చూస్తున్నాడు పిల్లవాడు.

**డిటెక్టివ్ శరత్ గదిలోకి ప్రవేశించాడొక వ్యక్తి. అతని వెనుకే ఒక మగపిల్లాడు , ఒక ఆడపిల్ల భయం భయంగా లోనికి వచ్చారు... బెదురు చూపులు, భయం తప్ప నోరు విప్పడం లేదు. ముడుచుకుపోతున్నారు. ఈ పిల్లలు ఎం.ఎం.టి.ఎస్. రైలులో కనిపించారు. ఏం జరిగిందో విషయం మీరే కనిపెట్టి వాళ్ళని తిరిగి తల్లిదండ్రులకు అప్పగించండి అభ్యర్థించాడు ఆ వ్యక్తి. మరి శరత్ ఏం చేశాడు?**

నోట్లో వేలు వేసుకుని పాప భయం భయంగా చూస్తోంది.

వాళ్లకు ఒకో బొమ్మ చూపిస్తున్నాడు చరణ్. అవి రకరకాల నేరాలకు సంబంధించిన బొమ్మలు.

విభిన్న రకాలుగా హత్యలు చేస్తున్న బొమ్మలు.

అబ్బాయిలో ఎలాంటి స్పందన కనిపించటం లేదు.

అమ్మాయి కళ్ళల్లో భయం కనిపిస్తోందితప్ప మరో స్పందన లేదు.

కత్తులతో చేసే హత్యల బొమ్మలు అయిపోయాయి. ఉరి తీయటం, ఆత్మహత్యలు వంటి బొమ్మలు చూపించాడు చరణ్. ఏక్సిడెంట్‌ల బొమ్మలు చూపించాడు. పిల్లల స్పందనలో పెద్దగా మార్పు రాలేదు.

ఆలోచిస్తూ వాళ్ళవైపే చూస్తూ కూచున్నాడు చరణ్.

'ఏమై ఉంటుంది?' అడిగాడు శరత్.

'అదే తెలియటం లేదు. పిల్లల మనస్సులు చాలా సున్నితమైనవి. కానీ ప్రపంచం వాళ్లను పెట్టినన్ని కష్టాలు మరొకరిని పెట్టదు. పెద్దయితే కనీసం ఇది బాధ కలిగిస్తోందని చెప్పగలుగుతారు. పిల్లలు ఏమీ చెప్పలేరు. ప్రపంచంలో ఎక్కడ ఏమి జరిగినా ముందుగా దాని ప్రభావం పడేది పిల్లలు, మహిళల పైనే' అన్నాడు చరణ్.

ఆలోచిస్తూ ప్యాకెట్‌లోంచి సిగరెట్‌తీసి పెదవుల నడుమ పెట్టుకున్నాడు.

'వీళ్ళు ఏదో షాక్‌కి గురయ్యారు. అందుకే మాట్లాడలేకపోతున్నారు' అంటూ లైటర్ వెలిగించాడు. దాన్ని సిగరెట్ దగ్గరకు తెచ్చాడు.

యథాలాపంగా పిల్లలవైపు చూసిన శరత్ కళ్ళు పెద్దవయ్యాయి.

నిప్పు వైపే తీక్షణంగా చూస్తున్నాడు పిల్లవాడు.

నిప్పును చూస్తూనే పాప పెద్దగా కేక పెట్టింది.

'అమ్మా' అంటూ పిల్లలు ఇద్దరూ ఒక్కసారిగా అరిచారు. హృదయ విదారకంగా ఏడుపు మొదలు పెట్టారు. గదంతా అరుస్తూ పరుగులెత్తసాగారు. బిగ్గరగా ఏడవసాగారు.

***

'మాకేం పని లేదనుకున్నావా?' అరిచాడు ఇన్‌స్పెక్టర్ ఇంద్రజిత్.

శాంతంగా అతనివైపు చూశాడు శరత్. వేరే పని లేకపోవటం కాదు, ఇదే మన పని. ఈ ఇద్దరు పిల్లల తల్లి హత్యకు గురయింది. అది తెలుసు



కుంటే పిల్లల్ని వాళ్ళ ఇంటికి చేర్చటమేకాదు, నేర స్థుణ్ణి పట్టుకునే వీలుంటుంది' చెప్పాడు శరత్.

'వీళ్లమ్మను ఎవడో కాల్చి చంపేశాడంటావు. వీళ్లది ఏ ఊరో తెలియదు. మర్డర్ బై బర్నింగ్ కేసులు ఎన్ని వెతకమంటావు?'.

'నేను అడిగింది గుర్తు తెలియకుండా కాలి పోయిన మహిళల శవాల కేసులు ఏమైనా ఉన్నాయా? అని మాత్రమే'.

'ఇదిగో... ఈ ఫైల్స్‌లో ఉంటాయి వెతుక్కో' అంటూ వాటిని విసిరేశాడు ఇంద్రజిత్.

శరత్, అతడి అసిస్టెంట్ రాము కలిసి ఆ ఫైళ్ళన్నీ వెతకసాగారు.

కాలిపోయి దొరికిన, గుర్తు తెలియని మహి ళల శవం కేసులు రాసుకోసాగారు. వాళ్ళిద్దరివైపు ఓసారి నిరసనగా చూశాడు ఇంద్రజిత్. 'ముందు పిల్లలు తప్పిపోయిన కేసు రిజిస్టర్ చేయించండి. ఏమైనా ఆధారాలు లభిస్తే చెప్పండి' అన్నాడు.

'అలాగే' అన్నాడు శరత్ తల ఎత్తకుండానే.

***

'బాస్ గడచిన నెల రోజుల్లో ఇరవైరెండు కేసులు నమోదయ్యాయి. ఏం చేద్దాం?' అడిగాడు రాము.

'నీ అసిస్టెంట్లను పంపు. ఆ శవాలు దొరికిన ప్రాంతాల్లో అందర్నీ ప్రశ్నించమను. పిల్లల ఫొటోలు తీసుకెళ్ళి ఆ చుట్టుపక్కల చూపించమను. ఎవరైనా గుర్తు పడతారేమో. సంఘటన జరిగిన చుట్టుప క్కల ఇళ్ళల్లో చూపించి ఈ పిల్లలు తెలుసా? అని అడగమను' చెప్పాడు శరత్.

'యెస్ బాస్' అన్నాడు రాము లేస్తూ.

***

'ఎంతవరకూ వచ్చింది వీళ్లమ్మను వెతకటం?' శరత్ ఎదురుగా కూర్చుంటూ అడిగాడు ఇంద్రజిత్.

'రాము, అతడి అసిస్టెంట్లు వెతుకుతున్నారు. ఏదో ఒకటి తెలుస్తుంది' సమాధానం ఇచ్చాడు శరత్.

'వాడు ఎక్కడో చంపి, ఇంకెక్కడో తెచ్చి కాల్చి పారేస్తే ఎలా తెలుస్తుంది?'

'అందుకే శవాలు దొరికిన స్థలానికి దగ్గరలో ఉన్న గ్రామాలలో కూడా తిరుగుతున్నారు రాము అసిస్టెంట్లు'.

శరత్ మాట పూర్తవుతుండగానే ఫోను వచ్చింది.

'బాస్.. జనగాం జిల్లాలో నార్మెట్ట మండలం లోని కన్నెబోయినగూడెం ఉంది. అక్కడకు రావాలి'. రాము అసిస్టెంట్ ఫోన్ చేశాడు. ఇంద్రజిత్ వైపు చూసి, 'చలో' అన్నాడు శరత్ లేస్తూ.

***

చిన్న గ్రామం అది. వందల సంఖ్యలోనే ఇళ్లున్నాయి.

శరత్, ఇంద్రజిత్ కారు దిగగానే రాము ఎదు రొచ్చాడు.

'పిల్లలు ఇద్దరినీ ఈయన గుర్తు పట్టాడు' చెప్పాడు.

'వీళ్ల నా అత్త కూతురు అంజమ్మ పిల్లలు. వీళ్ల చచ్చిపోయారనుకున్నాం' చెప్పాడతడు.

'ఎందుకు అలా అనుకున్నారు? అంజమ్మ ఏమైంది?'

'అదే తెలియలేదు. అంజమ్మను భోనగిరిలో ఉండే గురవయ్యకు ఇచ్చి పెళ్ళి చేశాం. వీళ్లిద్దరూ వాళ్ళ పిల్లలే. కానీ అంజమ్మ శ్రీనుతో సంబంధం పెట్టుకుంది. శ్రీనుతో వెళ్ళిపోయింది. తరువాత అంజమ్మ పిల్లలు కనబడలేదు. శ్రీనును అడిగితే, అంజమ్మ తనను కూడా వదిలేసి కరీమ్‌తో పారిపో యిందని చెప్పాడు. తరువాత తెలిసింది కరీమ్ అదేదో దేశం వెళ్ళిపోయి తీవ్రవాదుల్లో చేరి చచ్చి పోయాడని. అంజమ్మతోపాటు పిల్లలు కూడా కన బడకపోతే వీళ్లూ పోయారనుకున్నాను'.

'శ్రీను ఎక్కడుంటాడు?' అడిగాడు శరత్.

***

'ఇదే శ్రీను దుకాణం' చూపించాడు పిల్లవాడు.

దుకాణంవైపు వెళ్తుంటే రాము నుంచి మెసేజ్ వచ్చింది. ఇంద్రజిత్‌కు ఆ మెసేజ్ చూపించాడు శరత్. దాన్నిచూసి ఇంద్రజిత్ ముఖం కోపంతో ఎరుపెక్కింది.

'ఏం కావాలి సార్?' వినయంగా అడిగాడు శ్రీను, దుకాణంలో అడుగుపెడుతున్న ఇంద్రజిత్‌ని.

ఇద్దరు పిల్లల ఫొటోలు శ్రీనుకు ఇచ్చి 'వీళ్లమ్మ ఎక్కడుందో కావాలి' అడిగాడు శరత్.

పిల్లల ఫొటోలు చూస్తూనే శ్రీను ముఖం మాడిపోయింది.

'నన్ను మోసం చేసి వెళ్ళిపోయింది..' దుఃఖం నటిస్తున్న శ్రీను మెడ వెనుక ఒక చెయ్యివేసి బలంగా పట్టుకున్నాడు ఇంద్రజిత్.

'నిజం చెప్పరా.. లేకపోతే నా చేతిలో చస్తావు' అరిచాడు.

'నిజం సారూ.. ఆ కరీమ్‌గాడితో..'

ఏదో చెప్పబోతున్న శ్రీను మూతిమీద ఒక్కటి చ్చాడు ఇంద్రజిత్.

'అబద్ధం చెప్పకు. కరీమ్ తీవ్రవాదుల్లో చేరేం దుకు రెండేళ్ళ ముందే వెళ్ళిపోయాడు. కరీమ్ వెళ్ళి పోయిన సమయంలో అంజమ్మ నీతోనే ఉంది. అందరినీ నమ్మించటం కోసం ఇది నువ్వు అల్లిన కట్టుకథ' అన్నాడు శరత్.

'నిజం చెప్తావా? ఛస్తావా? మరొకటిచ్చాడు ఇంద్రజిత్.

'నిజం చెప్తా. నన్ను చంపకండి. అంజమ్మను గురవయ్య మంచిగా చూసుకునేవాడు కాదు. దాంతో మా ఇద్దరి మధ్య సంబంధం ఏర్పడింది. ఇద్దరం కలిసి గురవయ్యను చంపేశాం. వాడి శవాన్ని కాలువలో పారేశాం. కానీ నాకు అంజమ్మను పెళ్ళి చేసుకోవాలనిపించలేదు. మాటి మాటికీ పెళ్ళి చేసు కోమని పోరుతుంటే కోపం వచ్చింది. కొట్టి కిరస నాయిలుపోసి కాల్చేశాను. శవాన్ని తీసుకెళ్ళి దారిలో ఎక్కడో పారేశాను. పిల్లల్ని సికిందరాబాద్ రైలెక్కించి ఇప్పుడే వస్తానని చెప్పి వచ్చేశాను. దొరా నన్ను క్షమించండి. తప్పయి పోయింది' ఏడుస్తూ చెప్పాడు శ్రీను.

'అంజమ్మను పిల్లల ముందే కాల్చావా?' అడి గాడు శరత్.

'అవును దొరా. పిల్లల్ని కట్టేశా. లేకపోతే గోల చేస్తున్నారు' అన్నాడు.

కసిగా, కోపంతో వాడి డొక్కలో బూటు కాలితో బలంగా తన్నాడు ఇంద్రజిత్.

**కస్తూరి మురళీకృష్ణ**
***సెల్: 98496 17392***

# మంచి మనసులు

–రాచమళ్ళ ఉపేందర్

**బాల్యం ప్రతి మనిషి జీవితంలో మధురాతి మధురం. తొలకరి చినుకులు గుప్పిటపడుతూ దోస్తులతో వేసిన చిందులు, అలసిపోయేలా ఆడిన దాగుడుమూతలు, ఎగరేసిన గాలిపటాలు, ఇసుకలో కట్టిన పిచ్చుకగూళ్ళు మరపురాని తీపి జ్ఞాపకాలు. ఆ జ్ఞాపకాలు నెమరేస్తూ ఉత్సాహం పొందడమన్నా, స్నేహితులు కనిపిస్తే మనసారా పలకరించి, ఆత్మీయత పంచుకోవడమన్నా కిరణ్‌కి ఎంతో ఇష్టం.**



కిరణ్ ఆటోడ్రైవర్. సొంతూరు పాతలింగాల. అక్కడి నుండి ప్రతిరోజు ఇరవై కిలోమీటర్ల దూరం ఖమ్మం సిటీకి వచ్చి ఆటో నడుపుతాడు. ఈ రోజు మాత్రం సీరియస్‌గా ఉన్న పేషంట్‌ను హైదరాబాద్ ఆసుపత్రిలో దింపి ఇంటికి బయలుదేరాడు. ఓ కాలనీలోని బస్టాప్ దాటి వెళుతూ సడన్ బ్రేక్ వేశాడు. ఆటో లోంచి ఆత్రంగా బయటకు చూశాడు. బస్టాప్‌లో సుమారు ముప్పై ఐదేళ్ల యువతి. చందమామలాంటి అందం. మల్లెపువ్వు లాంటి నవ్వు. చూడముచ్చటైన కురులు, టెన్త్‌క్లాస్ రోజుల్లో తన మనసు నిండా అందమైన ఊహలు నింపిన రూపం అదే. చాలా ఏళ్ళకు కళ్ళెదుట నిలిచింది. అతడిలో పట్టలేని ఆనందం. ఆత్రుతగా ఆటో వెనక్కు తిప్పి ఆమె ముందుకు వెళ్ళి ఆపాడు.

"హలో మేడమ్ గుర్తుపట్టారా?" లేదన్నట్టు చూశాయి ఆమె కళ్ళు.

"సరేలెండి! ఆటో కావాలా?"

"వద్దు, బస్సులో వెళతాను".

ఆమె మాట్లాడుతుంటే కింద పెదవి మధ్యలోవున్న పుట్టు మచ్చ చూశాడు. డౌటే లేదు తను నా టెన్త్ క్లాస్‌మేటే అనుకున్నాడు. ఇద్దరూ కలిసి సరదాగా గడిపిన క్షణాలు, కలిసి చేసిన అల్లరి ఒక్కొక్కటిగా అతనికి గుర్తుకు రాసాగాయి. 'మీరు జానకి గదా?' అడగబోయి మళ్ళీ ఆగిపోయాడు. ఎందుకంటే ఆమె అతన్ని గుర్తు పట్టలేదు. బస్సు వచ్చేవైపు తిరిగింది. అతనిలో ఒక్కసారిగా అనేక ప్రశ్నలు. 'నేను గుర్తుకు రాకపోవడమేంటి? తెలిసినా తెలియనట్లు నటిస్తోందా?' కాసేపు ఏం చేయాలో పాలుపోలేదు. "మీ పేరు జానకి గదండి?!" ఆమె హావభావాలను కనిపెడుతూ ఈసారి ధైర్యంగా అడిగాడు. ఠక్కున అతని వైపు తిరిగింది. కోపంగా చూస్తూ, "మీరు పొరబడుతున్నారు. నేను జానకిని కాదు" అంటూ అప్పుడే వచ్చిన బస్సెక్కింది. అతని గుండెకు గాయం! ఏదో తెలియని బాధ. ఆ బస్సు వెనుకే నీరసంగా ఆటోని కదిలించాడు.

రెండు కిలోమీటర్లు దాటగానే ముందు టైరులో గాలి తుస్సుమనటంతో బస్సు ఆగిపోయింది. సడన్ బ్రేకుతో ఆటో ఆపాడు కిరణ్. ఆమె బస్సులోంచి దిగి, టైమ్ చూసుకుంటూ ఆందోళన పడుతోంది. "మేడమ్! ఆటో కావాలా?" ఆప్యాయంగా పిలిచాడతను. బస్టాప్‌లో కనబడినతనే. ఆమెలో చిరాకు!

అప్పటికే ఆలస్యమయిందనే తొందరలో అతని ఆటో ఎక్కింది.

"ఎక్కడికెళ్ళాలి మేడమ్?"

"సూపర్ మార్కెట్‌కి."

"మీరు సూపర్ మార్కెట్ మేనేజరా?"

వెకిలిగా నవ్వుతూ, "కాదు. అందులో పని చేస్తున్నాను".

"ఔనా!" అంటూ తలూపాడు. ఆమెను అద్దంలో పరిశీలనగా చూస్తూ డ్రైవింగ్ చేస్తున్నాడు.

"అందరికీ ఎలా ఉంటుందో గానీ, నాకు మాత్రం మా ఊరివాళ్ళను, అందునా బాల్యమిత్రులను మరచిపోవాలంటే ప్రాణం పోయినంత పనౌతుందండి. తెలిసిన వ్యక్తులు, ఎదురైనప్పుడు పలకరించలేని వ్యక్తి, కరడుగట్టిన ఉగ్రవాదితో సమానం. అయినా కాలం మారిపోయిందిలెండి. అంతస్తుంటేనే పలకరింపులు. లేనోడికి మిగిలేది వెక్కిరింతలు, ఈసడింపులే" భారంగా నిట్టూర్చాడు.

"మీరేమంటారు?" ఆమెలో మౌనం. సమాధానం కోసం వెనక్కి చూశాడు. చీరకొంగులో దాచుకున్న కళ్ళు ఆమె చెంపలు తడిపేస్తున్నాయి. ఉలిక్కిపడ్డాడు. "తప్పుగా మాట్లాడితే క్షమించండి, అనవసరంగా మిమ్మల్ని బాధ పెట్టానా?".




"నువ్వే నన్ను క్షమించు కిరణ్. నువ్వు కనబడగానే బాగున్నావా? అని ఒక్కమాట అడగలేకపోయాను."

"ఛ... ఛ.... మన మధ్య క్షమాపణలేంటి జానకి! నిన్ను చూస్తుంటే ఏదో సమస్యలో ఉన్నట్లున్నావు" అంటూ ఆటో పక్కకు ఆపాడు.

"నువ్వు ఖమ్మంలో ఇంటర్ చదువుతుండగా సిటీ అబ్బాయిని ప్రేమించావని, పెద్దలు కాదన్నా పెళ్ళి చేసుకున్నావని ఊరంతా తెలిసింది. నువ్వు తొందర పడ్డావేమో అనుకున్నానుగానీ నీ ధైర్యానికి ముచ్చటేసింది. ఆ రోజు నుండి నువ్వు ఊరి ముఖమే చూడలేదు. నీ తల్లిదండ్రులు మళ్ళీ నీ ఊసెత్తినట్లు లేదు. మన క్లాస్‌మేట్స్ అప్పుడప్పుడు కలుస్తూనే ఉంటారు, నువ్వు తప్ప. నువ్వెలా ఉన్నావో నని తలచుకుంటూనే ఉంటాను. ఇప్పుడు కలిశావు. నాకైతే గొప్ప థ్రిల్లింగ్‌గా ఉంది. కన్నీళ్ళతో సమ స్యలు పరిష్కారం కావు. ఏడవకు!" ఓదార్పుగా అన్నాడు.

"కలలు ఎండిన మనసుకు అన్నీ పగుళ్ళే. కలలు పండిన మనిషిలో సంతోషపు ఊటలు. గుట్టగా పేర్చుకున్న దట్టమైన నా కలలు మంచులా కరిగిపోయాయి" ఆమె కళ్ళు ఎర్రగా మారాయి.

"అంతకష్టం ఏం వచ్చింది జానకీ? ధైర్యమే ముందడుగుకు చక్కని ఔషధమని నీకు చెప్పాల్సిన అవసరమే లేదు. బాధపడకు. నీకు అండగా నేనున్నాను. నీ బాధేంటో చెప్పు!"

"ఏముంది కిరణ్! ప్రేమ గుడ్డిదంటారు. నిజమో కాదో తెలియదు. నా ప్రేమ మాత్రం నన్ను ఓడిపోయేలా చేసింది. నేను ఇంటర్ చదువుతుండగా చిత్రకారుడితో పరిచయం ఏర్పడింది. అతనికి చదువు లేదు, పైగా అనాథ. గొప్ప గొప్ప భావాలు, ప్రకృతి రమణీయ దృశ్యాలు అతని చిత్రాల్లో కనువిందు చేస్తాయి. మనసును రసడోలికల్లో ముంచెత్తాయి. వాటిని చూస్తే కొత్త బంగారు లోకంలో విహరించినట్లే అనిపించింది. పెళ్ళికాగానే హైదరాబాద్ వచ్చేశాం. తర్వాత మా అమ్మానాన్నలతో మాట్లాడేందుకు చాలాసార్లు ఫోన్ చేశాను. కానీ వారు మాట్లాడలేదు. నేను కూడా తిరిగి ఊరికి వచ్చే ప్రయత్నమూ చేయలేదు. నా భర్తకు దేవుడిచ్చిన శాపం మాట్లాడలేకపోవటం. మూగవాడే కానీ చురుకైనవాడు, తెలివైనవాడు. చెవులు కూడా బాగా పని చేస్తాయి! అతను గీసిన చిత్రాలకు మార్కెట్లో మంచి గిరాకీ కూడా ఉంది" అన్నది.

కాళ్ళకింద భూమి కదులుతున్నట్లైంది. క్షణ కాలం తనను తానే మర్చిపోయి, కొయ్యబారిపోయాడు. తను విన్నది నిజమేనా? 'మూగవాణ్ణి, పైగా ఎవరూ లేని అనాథను నూరేళ్ళ జీవితంలోకి ఎలా ఆహ్వానించింది. సంసారాలను సంపదతో ముడివేస్తున్న రోజులివి. ఎంత లోతైన ప్రేమ!' అతని మనసు పరిపరివిధాలుగా ఆలోచనల్లో మునిగింది.

"జానకీ, పోయి పోయి మూగవాడినెలా ప్రేమించావు. నీ భవిష్యత్తు చీకటవుతుందని తెలియదా?"

"నా భర్త మూగవాడైనా ప్రేమించడం తెలుసు, ఆప్యాయత పంచడం తెలుసు, అన్నార్తులకు దానం చేయడం తెలుసు, ముఖ్యంగా నన్ను ప్రాణానికి ప్రాణంగా చూసుకుంటాడు. అంతమంచి వ్యక్తికి తోడుగా నిలబడ్డాను. కానీ విధిరాత తప్పించుకోవడం ఎవరి వశం? కనికరం లేని దేవుడు నా భర్తపై శీతకన్ను వేశాడు. ఓరోజు మేం షాపింగ్‌కి వెళ్ళొస్తుంటే ఆయన్ను బస్సు ఢీకొట్టింది. వెన్నుపూసతో పాటు కుడిచేయి పాక్షికంగా దెబ్బతిన్నది. మంచం పట్టాడు" ఒక్కసారిగా భోరుమంది.

"అయ్యో పాపం!" అంటూ జాలిపడ్డాడు కిరణ్.

"ఇంటికి వెళ్దాం పద! ఒకసారి ఆయన్ను చూడాలన్పిస్తోంది" అన్నాడు కిరణ్.

"సరే!" అన్నదామె.

ఆటో వెనక్కి తిప్పాడతను.

***

మురికివాడలోకి ప్రవేశించింది ఆటో. చిన్నచిన్న సందులు, కంపుకొడ్తున్న డ్రైనేజీ దాటుకుంటూ రెండు గదుల ఇంట్లోకి నడిచిందామె. వెనుకనే అతనెళ్ళాడు. అలికిడికి కర్ర శబ్దం చేశాడు మంచంపై పడుకున్న జానకి భర్త. ఇంట్లో ఏదైనా శబ్దమొస్తే కర్ర ఆడించడం అతనికి అలవాటు.

"నేనండి జానకి" అంటూ సైగలు చేసింది.

"ఈ వేళ తొందరగా వచ్చినట్లున్నావేం?" అంటూ సైగచేసి అడిగాడు.

"నా క్లాస్‌మేట్ కలిస్తే ఇంటికి తీసుకొచ్చాను" అని చెప్పింది.

"ఓహో అలాగా!" అన్నట్లు తలూపి పక్కకు తిరగలేక మంచంపై నుండే ఒక చేయి పైకి లేపాడు.

'మంచానికే పరిమితం కావడం, మనిషికి దుర్భరమైన పరిస్థితి' అనుకుంటూ అతన్ని దూరం నుంచే పరిశీలనగా చూశాడు కిరణ్. జానకి భర్త చేతిపై పచ్చబొట్టు కనబడింది. తనకళ్ళను తానే నమ్మలేకపోయాడు. వెదకబోయిన తీగ కాలికి తగిలినట్లైంది. వడివడిగా నడుస్తూ బయటకొచ్చాడు. ఏం చేయాలో, ఏం మాట్లాడాలో తెలియని సందిగ్ధం.

సంతోషం, దుఃఖం కలగలసిన కన్నీళ్ళు ఆపుకోలేక పోతున్నాడు.

"బయటకొచ్చావేంటి కిరణ్? చిన్న ఇల్లు కదా ఇబ్బందిగా ఉందేమో?"

"అదేం లేదు. మీ వారినిలా చూసేసరికి గుండె తరుక్కు పోయింది. తట్టుకోలేక పోయాను. వైద్యం చేయించటం లేదా?"

"మొన్నటివరకు మంచి ఏరియాలో ఉన్నాం. ఇప్పుడు మురికివాడకు చేరింది మా నివాసం. సూపర్‌మార్కెట్‌లో పని చేస్తున్నాను. నెలకు సరిపడా సరుకులుతప్ప, చిల్లిగవ్వ ఇంటికి రాదు. ఇక వైద్యానికి డబ్బెక్కడ తేను. డాక్టర్లు ఆపరేషన్‌కి నాలుగు లక్షలు కావాలన్నారు. అప్పటికీ పరిచయస్థుడిని అడిగి చూశాను. తన కోరిక తీరిస్తే అడిగినంత డబ్బిస్తానని వెంటపడ్డాడు. ఈ ఘోర పరిస్థితిని తట్టుకోలేక ఆత్మహత్యకు ప్రయత్నించాం. కన్నబిడ్డను అనాథను చేయలేక విరమించుకున్నాం" గుండెల్లో బాణం దిగిన పావురంలా మారింది జానకి.

చావు మాట వినగానే భయపడ్డాను. "పుట్టిన జీవి గిట్టక తప్పదు. ఊహించని మలుపులు జీవితానికి బిగించిన చక్రాలు. వాటితో పరుగెత్తాల్సిందే. ఇది నేను తలచింది కాదని కూలబడితే మిగిలేవి కన్నీళ్ళే. ఓటమిని ఒక్కొక్క మెట్టుగా మార్చుకుని పైకెక్కేందుకు పోరాటం చేయాలి" అన్నాడు కిరణ్.

ఈలోపు "అమ్మా!" అంటూ పరుగెత్తుకొచ్చింది పాప.

"నా బంగారు తల్లే!" అంటూ పాపను గుండెలకు హత్తుకొని ముద్దాడింది.

"మా పాప కిరణ్!" కిందకు దించుతూ అంది.

"చిట్టీ రామ్మా" చేతులు చాపాడు కిరణ్.

"ఆ... నేను.. రాను" బుంగమూతి పెట్టింది.

"కొత్త గదా! మారాం చేస్తోంది!"

"చిన్నపిల్లలు కొత్తవారికి అంత తొందరగా అలవాటు కారులే జానకి" అన్నాడు కిరణ్.

"ఏదైనా పెట్టమ్మా! బాగా ఆకలేస్తోంది. ఇందాక పక్కింటి అంకుల్ మామిడిపండు తిన్నాడే, నాక్కొంచెం పెట్టవా అని అడిగా, అంతే నావైపు కోపంగా చూశాడు. వామ్మో నాకు బాగా భయమేసింది. రోజూ నీతోనే వస్తానమ్మా, ఏదైనుంటే పెట్టమ్మా!" గోల చేయసాగింది.

"ఉండవే కాసేపాగు" సముదాయిస్తోంది జానకి.

ఆకలికి అరమరికలుండవు. దయ, జాలి అసలే ఉండవు. అందుకే కూటి కోసం కోటి విద్యలన్నారు. పాపం పాల బుగ్గల పసిబిడ్డ ఆకలంటుంటే కిరణ్ తట్టుకోలేక పోయాడు.

"ఇప్పుడే వస్తానుండు జానకి" అంటూ గబగబ బయటకెళ్ళాడు. కాసేపటికి చేతిలో సంచితో వచ్చాడు. స్వీట్స్, మామిడిపళ్లు తెచ్చాడు. "ఇదిగో జానకి పాపకు ఇవ్వు" తీసుకోవాలని లేకున్నా పాప ఆకలి తీర్చడానికి వేరే మార్గం లేక తీసుకుంది.

"థాంక్స్ కిరణ్!"

"థాంక్స్ చెప్పి నన్ను దూరం చేయకు. ఇల్లు తెలిసిందిగా, అప్పుడప్పుడు వస్తుంటాలే" పాప చేతులు ముద్దాడి వేగంగా వెళ్ళిపోయాడు కిరణ్.

***

రెండ్రోజుల తర్వాత ఉదయాన్నే జానకి ఇంటి ముందు ఆటో ఆగింది. రెండు కుట్టు మిషన్లు, బియ్యం బస్తా, కిరాణా సరుకులు కిందకు దించాడు. ఆశ్చర్యపోయింది జానకి. "కిరణ్ ఏమిటిదంతా? సానుభూతికి హద్దుంటుంది. ఈ విషయం ఆయనకు తెలిస్తే చాలా బాధపడతారు".

"ప్లీజ్ జానకి! కాదనకు! ఇది సానుభూతితో కాదు, మన స్నేహం కోసం" చిరునవ్వుతో అన్నాడు. ఒకవైపు మంచం పట్టిన భర్త, మరో వైపు చంటిది, చాలాసేపు ఆలోచించింది. పరిస్థితులకు తలొగ్గక తప్పలేదు ఆమె.

"ఓడిపోయిన జీవితాన్ని గెలుపుగుర్రంలా పరుగెత్తించడం మన చేతుల్లోనే ఉంది. ప్రయత్నాన్ని మించిన ఆయుధం లేదు. ప్రయత్నించు, గెలిచేదాకా... ఓటమి పారిపోయేదాకా..." ధైర్యాన్ని నిండుగా నూరిపోశాడు. "వీలున్నప్పుడు మళ్ళీ వస్తానంటూ" వెళ్ళిపోయాడు.

రేయింబవళ్ళు కష్టిస్తూ టైలరింగ్ నేర్చుకుంది. మెల్లగా సంపాదన కూడా మెరుగుపడుతోంది. పోషణ సజావుగా సాగుతోంది. భర్త ఆరోగ్యం గురించిన దిగులు మాత్రం ఆమెలో ఎక్కువ కాసాగింది.

**సడన్ బ్రేక్‌తో ఆటో ఆపి తల బైటపెట్టి వెనక్కు చూశాడు. సందేహం లేదు. ఆమే! తన క్లాస్‌మేట్ ! నిర్ధారించుకుని వెళ్ళి పలుకరించాడు. తల్లిదండ్రుల్ని ఎదిరించి సిటీ కుర్రాణ్ణి ప్రేమించి పెళ్ళాడిన తమ వూరి అమ్మాయి! ఆమెతోపాటు ఇంటికి వెళ్ళి ఆమె వివరాలు తెలుసుకుని ఆశ్చర్యపోయాడతను. ఆమెను కష్టాల్లోంచి గట్టెక్కించడమే కాదు ఆమెకోసం గొప్ప త్యాగం చేశాడతను. అతడికేంటి అవసరం? ఇదంతా ఎందుకు చేశాడు?**

ఓరోజు జానకికి పోస్టు వచ్చింది. ఆత్రుతగా కవర్‌విప్పి చూసింది. నాలుగు లక్షల రూపాయల చెక్. "హమ్మో! ఇంత డబ్బే!" ఊపిరి బిగపట్టింది. కాసేపటికి కుర్చీలో కూలబడింది. చెక్‌తో పాటున్న లెటర్ చదవసాగింది. "జానకి నీ మంచి మనసుకు నా అభినందనలు. అన్ని సౌకర్యాలున్నా భార్యాభర్తల మనసులు కలవని రోజులివి. అలాంటిది మూగవాడు కూడా మనిషేననీ, అతనికీ ఓ మనసుంటుందనీ గుర్తించావు. ప్రతిక్షణం నీ భర్తకోసం ఆరాటపడటం చూస్తుంటే నీ ప్రేమెంత గొప్పదో అర్థమౌతోంది. నీ కోసం, నీ భర్త ఆరోగ్యం కోసం నా ఈ చిన్నసాయం తప్పకుండా స్వీకరించు. దయచేసి స్వీకరించు. వీలైనంత త్వరలో కలుస్తాను, ఇట్లు.. నీ క్లాస్‌మేట్ కిరణ్"

'తను కేవలం ఆటో డ్రైవర్. ఇంత డబ్బెలా పంపాడు? దేని కోసం ఇదంతా చేస్తున్నాడు?' అంతుబట్టడం లేదు. గబ గబా వీధి మూల మలుపువైపు నడిచింది. రూపాయి కాయిన్ బాక్సు నుంచి కిరణ్ నంబర్‌కు డయల్ చేసింది. "దిస్ నంబర్ ఈజ్ స్విచ్‌డాఫ్" అని వినవస్తోంది. అంతులేని ఆలోచనలతో ఇంటికి చేరింది.

చూస్తుండగానే వారం రోజులు గడిచాయి. తన భర్తను హాస్పిటల్‌కు తీసుకెళ్ళింది. ఉదయం తొమ్మిది గంటలకు మొదలైన ఆపరేషన్ మధ్యాహ్నం మూడు గంటల వరకు సాగుతూనే వుంది. ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని, పాపను దగ్గరకు తీసుకుని కూర్చుంది జానకి. మరో అరగంట తర్వాత ఆపరేషన్ థియేటర్ నుంచి బయటకు వచ్చాడు డాక్టర్. "చెప్పండి డాక్టర్! నా భర్తకు ఎలాగుంది? త్వరగా చెప్పండి!"

"నువ్వు చాలా లక్కీ! ఆపరేషన్ సక్సెస్" నవ్వుకుంటూ వెళ్ళిపోయాడు డాక్టర్. జానకిలో నేల నుంచి నింగికెగిరినంత ఆనందం. ఆపరేషన్ థియేటర్‌లోకి పరుగు తీసింది. భర్తను చూసి మురిసిపోయింది. నాల్రోజులకు హాస్పిటల్ నుండి డిశ్చార్జ్ అయ్యారు. ఈ శుభవార్త కిరణ్‌కు చెప్పటానికి ఎంతో ప్రయత్నించింది, కానీ నెంబర్ కలవటం లేదు.

తన భర్త ఎప్పటిలానే నడుస్తున్నాడు. మళ్ళీ అందమైన చిత్రాలు గీయటం మొదలుపెట్టాడు. జానకి లేడీస్ టైలరింగ్‌లో మంచి పేరు ప్రఖ్యాతులు సంపాదించింది. ముగ్గురు వర్కర్లతో షాపు



ప్రారంభించింది. పాపను మంచి స్కూల్లో వేసింది.

***

నెల రోజులు గడిచాయి. ఓరోజు తన సెల్ నుండి కిరణ్ నంబరుకు ప్రయత్నించింది. ఈసారి తన అదృష్టం బాగుంది. నంబర్ రింగవుతోంది. "హలో!" అన్నది అవతల గొంతు. జానకిలో సంతోషం. "హలో! కిరణ్! నేను జానకిని" అన్నది.

"నేను కిరణ్‌ను కాదండి వాడి దోస్తని. నా పేరు రవి!"

"కిరణ్ ఏమయ్యాడు? ఈ నంబర్ అతనిదేగా?!" అయోమయంగా అడిగింది.

"అతనిదే, కానీ ఈ సెల్ నాకు అమ్మేశాడు. అదొక్కటే కాదు, ఏదో డబ్బు అవసరమైందని తన కున్న ఎకరం పొలం, ఉన్న ఇల్లు కూడా అమ్మేశాడు. ఏడాది కిందటే చనిపోయిన అతని భార్య కుట్టు మిషన్లు కూడా ఎక్కడో అమ్మేశాడు. ఒక్కగానొక్క కూతుర్ని హాస్టల్‌లో చేర్పించాడు. ఏం జరిగిందిరా? ఎందుకిలా చేస్తున్నావు? అంటే ఏమీ చెప్పలేదు. హైదరాబాద్ వెళ్తున్నా అని మాత్రం చెప్పాడు".

"సరేనండి! థాంక్స్!" అని ఫోన్ కట్ చేసింది. కిరణ్ హైదరాబాద్ వచ్చాడా? వస్తే ఎక్కడున్నాడు? ఎలావున్నాడు? నన్ను కలవటానికి ఎందుకు రావట్లేదు?" దిగులు పట్టుకుందామెకు.

***

పాప బర్త్‌డే కేక్ కోసం తన భర్తతో కలిసి బైక్‌పై వెళుతున్న జానకి కొత్తగా నిర్మిస్తున్న అపార్ట్‌మెంట్ వైపు చూస్తోంది. ఇటుకలు మోస్తున్న కిరణ్ కనిపించాడు. "బండి ఆపు" అంటూ భర్త భుజాలు పట్టుకుని ఊపింది.

పోగొట్టుకున్న విలువైన వస్తువేదో దొరికినంత సంబరం. "కిరణ్!" అంటూ గట్టిగా పిలిచింది. పని చేస్తున్న కూలీలంతా నిలబడిపోయారు. కిరణ్ కంగారుగా రోడ్డుమీదకొచ్చాడు. కిరణ్‌ను చూడగానే జానకి భర్త కళ్ళు సంతోషంతో మెరవసాగాయి. ఏదో చెప్పాలనే ఆరాటం, కానీ ఏమీ చెప్పలేకపోతున్నాడు. జానకి మాత్రం భర్తను గమనించడం లేదు. కిరణ్‌ను ఆరాధనగానూ, అపురూపంగానూ చూస్తోంది.

"కిరణ్! చూడు, నువ్వు నిలబెట్టిన మా కుటుంబం. మునిగిపోయే ఓడకు చుక్కానిలా నిలబడ్డావు. మా కోసం కొవ్వొత్తిలా కరుగుతున్నావు. అయినా ఇదంతా ఎందుకు చేస్తున్నావు?"

"ఇందులో నేను చేసిందేముంది? కారుచీకటిలో వెలుగు చూడటం అసాధ్యం. కానీ చిరుదివ్వె వెలిగించడం ఉత్తమం. అది వెలుగును కనుగొనే దారి చూపిస్తుంది. నా సాయం గోరంత, నీ కష్టం కొండంత. అయినా తల్లికోసం ఈ మాత్రం చేయకపోతే నేను మనిషినెలా అవుతాను?"

"తల్లా? ఎవరు?" ఆశ్చర్యంతో ఆమె పెదాలు విడిపోయాయి.

"వదిన తల్లితో సమానం కదా!"

"వదినా? నేనా?" అర్థం కాలేదామెకు.

"ఇతను నా అన్నయ్య" అంటూ జానకి భర్తను గాఢంగా కౌగిలించుకున్నాడు కిరణ్. ఇద్దరూ అనురాగంలో తడిసిపోతున్నారు. ఇద్దరి కళ్ళల్లో ఆత్మీయ జల్లులు.

"వదినా! 'మూగోడా! మూగోడా' అని అందరూ ఆట పట్టిస్తుంటే అవమానంతో ఇల్లొదిలి వెళ్ళిపోయాడు అన్నయ్య. అమ్మ చిన్నప్పుడే పోయింది. అన్నయ్య లేడనే మనోవ్యాధితో మా నాన్న కన్ను మూశాడు. నాకు అన్నయ్యంటే ఎంతో ఇష్టం. అన్నయ్య కోసం వెదకని రోజు లేదు. నీ మూలంగా నా అన్నయ్య నాకు దొరికాడు. నేటి లోకం నోరు లేని జీవాలను పెంచడానికి తహతహలాడుతోంది. కానీ నోరు లేని మనిషిని ఆదరించటానికి వెనకడుగు వేస్తోంది. నువ్వలా కాదు, చీకటి జీవితంలో వెలుగులు నింపిన ఉత్తమురాలివి. అలాంటి నీకోసం ఎంతచేసినా తక్కువే" అన్నయ్య నడుము చుట్టూ చెయ్యివేసి గర్వంగా తల పైకెత్తి నిలబడ్డాడు కిరణ్.

"నీదెంత గొప్ప మనసయ్యా! నిజంగా నీవు దేవుడిచ్చిన కొడుకువే" అంటూ రెండు చేతులతో తలను దగ్గరకు తీసుకొని ప్రేమగా గుండెలకు ఆనించుకుంది.

జానకి కళ్ళనిండా కన్నీటి ఊటలు. అవన్నీ ఆనందబాష్పాలే.

**సెల్:98492 77968**

## మనమీదేసర్రోయ్!

సరసి








**ప్రేమకథలు, కుటుంబ కథా చిత్రాలు, హర్రర్, సస్పెన్స్ థ్రిల్లర్ చిత్రాలు, కాన్సెప్ట్ ఓరియంటెడ్ ప్రయోగాత్మక చిత్రాలతో ప్రేక్షకులకు వినోదం పంచిన సినిమా ఇండస్ట్రీ ఇప్పుడు సరికొత్త ట్రెండ్‌కి నాంది పలికింది. నిజ జీవితంలో గెలిచిన గొప్ప వ్యక్తులు, పోరాట యోధులు, స్ఫూర్తిదాయకంగా నిలిచిన మహామహులతో పాటు భిన్నరంగాల్లో ఉత్తమ ప్రతిభ కనబరిచి నేటి తరానికి ఆదర్శ వ్యక్తులుగా నిలిచిన మహనీయుల జీవిత కథలను, గాథలను వెండితెరపై ఆవిష్కరిస్తున్నారు. .**

# బయోపిక్ విజయసూత్రం

ఇందుకు అనుకూలంగా కలెక్షన్ల కోసం, జయాపజయాలకోసం చూడకుండా అగ్ర నటీ నటులు కూడా ముందుకు వస్తున్నారు. ప్రేక్షకులు కూడా ఇలాంటి సినిమాలు చూసేందుకు ఎక్కువ ఆసక్తి కనబర్చడం కూడా విశేషం. ఈ సందర్భంలో బయోపిక్ సినిమాలపై ప్రత్యేక కథనం మీరూ చదివేసేయండి మరి!

బయోపిక్ అంటే జీవిత గాథ, లేక చారిత్రక నేపథ్యం. ఇలా ఏదైనాసరే మనం మరిచిపోయిన, మనకు తెలియని, గుర్తింపుకి నోచుకోని ఆదర్శవంతులను ఈ బయోపిక్‌ల ద్వారా ప్రపంచానికి తెలియజెప్పడం చాలా ఆనందం కలిగించే విషయం అని చెప్పవచ్చు. ఈమధ్యకాలంలో అయితే పుస్తకాలు చదివేవారి సంఖ్య తగ్గిందనే చెప్పవచ్చు. ఇక జీవిత చరిత్రలు, పాత కథలు చదివే తీరికా ఓపికా ఎవరికుంటాయి చెప్పండి. ఏదైనా చదవమంటే అమ్మో టైమ్‌లేదు అని చెప్పేవారే ఎక్కువ. మరి వారికి గొప్ప వ్యక్తులు, ఆదర్శమూర్తుల గురించి చాలా తక్కువ టైమ్‌లో కూలంకషంగా తెలియజేసే అద్భుతమైన మంత్రం బయోపిక్. రెండున్నర గంటల్లో సదరు గొప్పవ్యక్తుల జీవిత కథలు బయోపిక్‌ల రూపంలో కళ్ళకు కట్టినట్టు వెండితెరపై ఆవిష్కృత మవుతున్నాయి. అంతేకాకుండా ఆయా గొప్ప వ్యక్తులు అనుసరించిన విధానాలు, ఆచరించిన పద్ధతులు, భవిష్యత్తు తరాల కోసం చేసిన ప్రాణ త్యాగాల తీరు.. తదితర అంశాలు ప్రేక్షకులను ప్రభావితం చేయటం చెప్పుకోదగ్గ ఫలితాన్నిస్తున్నాయి. వీటి వల్లే అవి హిట్ అవుతున్నాయి. ప్రేక్షకుడు కూడా వీటిని చూడ్డానికి ఇష్టపడుతున్నాడు.

### వీటివైపే మొగ్గు

ఆదర్శమూర్తుల జీవితం తెరకెక్కించాలన్న విషయం. ఇతరత్రా అంశాలన్నింటినీ పరిగణనలోకి తీసుకుని బాలీవుడ్, కోలీవుడ్, టాలీవుడ్ సినీ ఇండస్ట్రీకి చెందిన దర్శక నిర్మాతలు బయోపిక్‌ల నిర్మాణానికి శ్రీకారం చుట్టేశారు. ఓ పక్క రెగ్యులర్ సినిమాలు చేస్తూనే అవకాశం దొరికినప్పుడల్లా వినోదం, విజ్ఞానం అనే కాన్సెప్ట్‌తో బయోపిక్‌ల రూపకల్పన చేశారు. అయితే ఇటీవల కాలంలో రూపొందిన కొన్ని బయోపిక్‌లు విశేష ప్రేక్షకాదరణ పొందటంతో రెగ్యులర్ సినిమాలకు బదులు చాలామంది దర్శక, నిర్మాతలు బయోపిక్‌ల నిర్మాణంపై ఆసక్తి చూపించటంతో ప్రస్తుతం సినీ ఇండస్ట్రీలో ఇదొక ఇంట్రెస్టింగ్ ట్రెండ్‌గా మారింది. వినోదం, విజ్ఞానం, వ్యాపారం కలగలిపిన బయోపిక్ బాలీవుడ్ విజయ సూత్రంగా మారిపోయింది. నేటి తరానికి కావాల్సిన సకల కమర్షియల్ హంగులను బయోపిక్‌లకు జోడించి దర్శక, నిర్మాతలు విజయాలు సాధిస్తుండటంతో ఈ ట్రెండ్ రోజు రోజుకీ మరింత ఊపందుకుంటోంది. దీనికి తోడు సినీ ఇండస్ట్రీలో అగ్ర హీరోహీరోయిన్లు సైతం బయోపిక్స్‌లో నటించేందుకు ముందుకు రావడంతో ఈ ఊపు మరింత పెరిగిందని చెప్పుకోవచ్చు. ఇదిలా ఉంటే, కొంతమంది దర్శక, నిర్మాతలు కాసుల వర్షమే ధ్యేయంగా భిన్న రంగాలకు సంబంధించి పబ్లిక్ హాట్ ఫేవరెట్‌గా ఉన్న సెలబ్రిటీల బయోపిక్‌లు నిర్మించేందుకు అత్యుత్సాహం చూపిస్తున్నారు. ఆ సెలబ్రిటీల జీవిత కథలు తెరకెక్కించేందుకు భారీ మొత్తంలో ఖర్చు చేస్తున్నారు. ఉద్దేశం ఏదైనప్పటికీ ప్రేక్షకులకు స్ఫూర్తిదాయక బయోపిక్‌లు అందిస్తున్న సదరు దర్శక, నిర్మాతలకు జోహార్లు చెప్పాల్సిందే.

### నిర్మాణంలోనూ మార్పులు

ఒకప్పుడు బయోపిక్‌లు ఒకటీ అరా తీసేవారు.

### సచిన్‌పై...

*బాలీవుడ్‌లో త్వరలో విడుదల కాబోతున్న మరో స్పోర్ట్స్ బయోపిక్ 'సచిన్ : ఏ బిలియన్ డ్రీమ్స్'. క్రికెట్ దిగ్గజం, భారతరత్న పురస్కార గ్రహీత సచిన్ టెండూల్కర్ జీవితం ఆధారంగా రూపొందుతున్న బయోపిక్ ఇది. ఈ బయోపిక్‌లో స్వయంగా సచిన్ టెండూల్కర్ నటించటం ఓ విశేషమైతే, యువ సచిన్‌గా సచిన్ తనయుడు అర్జున్ టెండూల్కర్ నటించటం మరో విశేషం. బాలీవుడ్ బయోపిక్‌ల చరిత్రలో ఇదొక విశేషం కూడా.*



ఆ తర్వాత మారుతున్న కాలానికి అనుగుణంగా బయోపిక్‌ల రూపకల్పనలోనూ, వాటిని తీసే విధానం లోనూ మార్పులు వచ్చాయి. ఎంత ఖర్చయినా సరే గ్రాండ్‌గా సినిమా తీయాలని సదరు దర్శక, నిర్మాతలు డిసైడ్ అయిపోతున్నారు. అందుకోసం వాస్తవ పరిస్థితులకు అనుగుణంగా కొంత ఊహ, కల్పిత అంశాలు కూడా జోడించి, అత్యాధునిక సాంకేతిక పరిజ్ఞానానికి కమర్షియల్ విలువలద్ది బయోపిక్‌ల రూపంలో ప్రేక్షకులను మెస్మరైజ్ చేసే ప్రయత్నంలో దర్శక, నిర్మాతలు సక్సెస్ అయ్యారు.

డర్టీ పిక్చర్ సినిమాకి ముందు ప్రపంచవ్యాప్తంగా చిత్ర పరిశ్రమలన్నీ ఎప్పటికప్పుడు బయోపిక్‌లను ముందుకు తీసుకురావడానికి ప్రయత్నించాయి.

### అలా మొదలైంది

టాలీవుడ్, కోలీవుడ్‌లతో పోలిస్తే బాలీవుడ్‌లో బయోపిక్‌లు ఎక్కువగా వచ్చాయి, వస్తున్నాయి. కొన్ని దశాబ్దాల పాటు ముంబైని గడగడలాడించిన ముంబై అండర్‌వరల్డ్ డాన్ వరదరాజన్ ముని స్వామి మొదలియార్ జీవితం ఆధారంగా 1988లో 'దయావన్' చిత్రాన్ని తెరకెక్కించారు. వినోద్‌ఖన్నా, మాధురీ దీక్షిత్, ఫిరోజ్ ఖాన్ ప్రధాన పాత్రధారులుగా రూపొందిన ఈ చిత్రం అప్పట్లో ప్రేక్షకులను విశే షంగా అలరించింది.

ఫ్రీడమ్ ఫైటర్ సర్దార్ వల్లభాయ్ పటేల్ జీవితం ఆధారంగా 1993లో 'సర్దార్' పేరుతో కేతన్ మెహతా దర్శకత్వంలో ఓ బయోపిక్ విడుదలైంది. ఆ సినిమా తర్వాత 1994లో పూలన్‌దేవీ జీవితానికి వెండితెర రూపమిస్తూ విడుదలైన 'బాండిట్ క్వీన్' వివాదస్పద బయోపిక్‌గా సంచలనం క్రియేట్ చేసింది. తర్వాత శేఖర్‌కపూర్ దర్శకత్వంలో తెరకె క్కిన ఈ బయోపిక్ కూడా మంచి విజయం సాధించింది.




## తెలుగులో బయోపిక్‌లు...

*తెలుగులో శాతవాహన చక్రవర్తి గౌతమి పుత్ర శాతకర్ణి జీవితం ఆధారంగా తెరకెక్కిన చిత్రం 'గౌతమిపుత్ర శాతకర్ణి'. బాలకృష్ణ వందవ చిత్రమిది. వివాదాస్పద రాజకీయనాయకుడు వంగవీటి మోహనరంగా జీవితాన్ని 'వంగవీటి' పేరుతో దర్శకుడు రామ్‌గోపాల్‌వర్మ ఓ చిత్రం విడుదల చేశారు. అలాగే వెంకటేశ్వరస్వామి భక్తుడు హాథీ రామ్ బాబా జీవితం ఆధారంగా రూపొందిన చిత్రం 'ఓం నమో వెంకటేశాయ'. రానా దగ్గుబాటి నటించిన ఘాజీ చిత్రం ఇటీవలే విడుదలై ప్రేక్షకాదరణని పొందింది. మన నౌకా దళం సత్తా చాటిన చిత్రమిది. అలాగే ప్రముఖ బాడ్మింటన్ క్రీడాకారుడు, కోచ్ పుల్లెల గోపీచంద్ జీవితం ఆధారంగా ఓ బయోపిక్ త్వరలోనే సెట్స్‌పైకి వెళ్ళనుంది. మహానటి సావిత్రి జీవితం ఆధారంగా 'మహానటి' పేరుతో ఓ బయోపిక్ రానుంది. ఇలా తెలుగులో మున్ముందు మరెన్నో బయోపిక్‌లు రానున్నాయి.*




2001లో 'జుబేదా' పేరుతో ఓ బయోపిక్ విడుద లైంది. ప్రముఖ నటి జుబేదా బేగం జీవితం ఆధా రంగా రూపొందించబడింది చిత్రం. ఎందరో హేమాహేమీలు నటించిన ఈ చిత్రానికి ఏ.ఆర్. రెహ్మాన్ స్వరాలు సమకూర్చాడు. ఆ ఏడాది జాతీయ ఉత్తమచిత్రంగా ఎంపికైంది. దేశంకోసం ప్రాణత్యాగం చేసిన ఫ్రీడమ్ ఫైటర్ భగత్‌సింగ్ జీవిత నేపథ్యంలో 'ది లెజెండ్ ఆఫ్ భగత్‌సింగ్' చిత్రం 2002లో ప్రేక్షకుల ముందుకొచ్చింది. భగత్ సింగ్‌గా అజయ్ దేవగన్ నటించారు. జాతీయ ఉత్తమచిత్రంతో పాటు ప్రాంతీయ ఉత్తమ చిత్రంగా 'భగత్‌సింగ్' రెండు జాతీయ అవార్డులు దక్కించుకుంది. రియల్ లైఫ్ ఎన్‌కౌంటర్ స్పెషలిస్ట్ దయానాయక్ జీవితాన్ని స్ఫూర్తిగా తీసుకుని 2004లో 'అబ్ తక్ చప్పన్' చిత్రం రూపొందిం చారు. ఈ చిత్రానికి సీక్వెల్‌గా 'అబ్ తక్ చప్పన్ 2' కూడా విడుదలై విశేష ప్రేక్షకాదరణ పొందింది. దేశంకోసం పోరాడిన స్వాతంత్ర్య సమరయోధుడు నేతాజీ సుభాష్ చంద్రబోస్ జీవితానికి శ్యామ్ బెనగల్ 'నేతాజీ సుభాష్ చంద్రబోస్ : ద ఫర్‌గాటెన్ హీరో' పేరుతో బయోపిక్‌గా వెండితెర రూపమిచ్చారు. సచిన్ ఖడేకర్ ప్రధాన పాత్రధారిగా నటించిన ఈ చిత్రానికి ఏ.ఆర్.రెహ్మాన్ సంగీతం అందించారు. 1857 సిపా యిల తిరుగుబాటుకు నాంది పలికిన ఫ్రీడమ్ ఫైటర్స్‌లో మంగళ్‌పాండే ఒకరు. ఆయన జీవితం ఆధారంగా కేతన్ మెహతా 2005లో 'మంగళ్ పాండే' బయోపిక్ రూపొందించారు. ముంబై అండర్ వరల్డ్ డాన్స్ దావూద్ ఇబ్రహీం, ఛోటారాజన్ జీవితాల ఆధారంగా రామ్‌గో పాల్ వర్మ 'కంపెనీ' పేరుతో 2005లో ఓ చిత్రం తెరకెక్కించారు. ఆ తర్వాత ఫ్రీడమ్ ఫైటర్స్ జీవితాలను స్ఫూర్తిగా తీసుకుని రంగ్ దే బసంతి సినిమా తీశారు. అది ఎంత హిట్ అయిందో మనందరికీ తెలిసిందే. 2002 కామన్‌వెల్త్ గేమ్స్ హాకీలో గెలుపొందిన మహిళా జట్టు స్ఫూర్తిగా తీసుకుని చక్ దే ఇండియా చిత్రం రూపొం దించారు. గురు, గాడ్‌ఫాదర్‌లాంటి ఎన్నో చిత్రాలు తెరకెక్కాయి.

మరాఠా యోధుడు బాజీరావు పీష్వా జీవితం ఆధారంగా దర్శక, నిర్మాత సంజయ్ లీలా భన్సాలీ తెరకెక్కించిన చిత్రం 'బాజీరావు మస్తానీ'. ఎపిక్ హిస్టారికల్ రొమాన్స్ చిత్రంగా తెరకెక్కింది. ఓషో జీవితంపైన కూడా రెబల్లీస్ ఫ్లవర్ పేరుతో ఓ బయోపిక్ తెరకెక్కింది.

కువైట్ ఇరాక్ యుద్ధ సమయంలో దాదాపు లక్షా డెబ్బైవేల మందిని కాపాడిన రంజిత్ కత్యాల్ జీవితం ఆధారంగా తెరకెక్కించిన బయోపిక్ 'ఎయిర్ లిఫ్ట్'.

1986లో 'పాన్ ఆమ్ ఫ్లైట్ 73'ను హైజాక్ చేసిన టెర్రరిస్టుల బారి నుండి దాదాపు 359 మంది ప్రయాణికులను రక్షించే క్రమంలో ప్రాణాలు కోల్పో యిన ఎయిర్ హోస్టెస్ నీరజా భానోత్ జీవితం ఆధారంగా తెరకెక్కిన మరో బయోపిక్ నీర్జా.

'సుల్తాన్', 'దంగల్', 'ఎం.ఎస్.ధోని', 'అజార్', 'సచిన్', 'బుధియా సింగ్' వంటి బయోపిక్స్‌తో క్రీడా నేపథ్య సెలబ్రిటీలకు దర్శక, నిర్మాతలు ఈ యేడాది పెద్ద పీట వేశారు. వీటితోపాటు ఎం.ఎస్. సుబ్బలక్ష్మి, మీనాకుమారి, మధుబాల, ఆర్.డి. బర్మన్, గురుదత్, కిషోర్‌కుమార్, ధారాసింగ్, ధ్యాన్‌చంద్ వంటి సినీ, క్రీడాకారులు, అబ్దుల్ కలామ్ వంటి ప్రముఖుల జీవితాలను తెరపై ఆవిష్కరించే ప్రయత్నంలో ఇప్పటికే దర్శక, నిర్మాతలు నిమగ్నమై ఉన్నారు. ఇప్పుడిప్పుడే దక్షిణ భారత భాషలన్నింటిలోనూ ఇటువంటి సినిమాలు ఊపిరిపోసుకుంటున్నాయి.

**– విజేత**

# సాఫ్ట్‌వేర్‌లో సరిగమలు

14

-కంఠంనేని స్వప్న



ఇండియాలో ఎంతటి అవినీతి అయినా సాధ్యమేనని ఎన్నోసార్లు విన్నాడు. తనకు కూడా స్వయంగా అనుభవమే కానీ మరీ ఇంత దారుణమా?

ఇందుకేనేమో ఎన్నో జాగ్రత్తలు తీసుకుంటున్నామని గవర్నమెంట్ భావించినా, ఒక పక్క జరిగేవి జరుగుతూనే ఉంటాయి. అవినీతి మనలో అంతర్భాగమైనప్పుడు వ్యవస్థ కుళ్ళిపోక తప్పదు.

హర్ష మనసు ఇంతలా ఆక్రోశించడానికి కారణం.. ఆ సిమ్‌నంబర్ హర్ష పేరు మీద రిజిస్టర్ అయి ఉండటమే!

ఐడీ ప్రూఫ్‌గా అతని పాన్‌కార్డ్ కాపీ కూడా ఆ టెలిఫోన్ కంపెనీ వాళ్ళ ఫైల్స్‌లో ఉంది. సిగ్నేచర్ కొద్దిగా తేడాగా ఉన్నా రెండిటినీ పోల్చి చూసినట్లు లేదని అర్థమయి పోతోంది.

వేరే ఇంకెవరైనా ఆ పని చేసుంటే వెంటనే ఫిర్యాదు చేసి ఉండేవారు. అవసరం అనుకుంటే పోలీస్ కంప్లయింట్ కూడా ఇచ్చి ఉండేవాడు.

కానీ ఆ పని చేసింది తనకెంతో ఇష్టమైన వ్యక్తి!

అందుకే అక్కడితో పరిశోధన ఆపేశాడు.

"నా పాన్‌కార్డ్ కాపీ నీకెలా దొరికింది?" మెసేజ్ పెట్టాడు.

"సిమ్‌కార్డ్ రిజిస్ట్రేషన్ ఎవరి పేరు మీదుందో కనుక్కోవటానికి ప్రయత్నించారన్న మాట" రెండు నిమిషాల్లో రిప్లయ్ వచ్చింది.

"నువ్వు చేసిన పని చట్టరీత్యా నేరం!" పంపాడు.

"ఎవ్రీథింగ్ ఈజ్ ఫెయిర్ ఇన్ లవ్ అండ్ వార్!" సమాధానం వచ్చింది.

ఇంకేం మాట్లాడాలో అర్థం కాలేదు అతనికి.

"వారంలో నేనెవరో తెలుసుకుంటానన్నావు. ఇవాల్టితో ఆ గడువు అయిపోయింది" కవ్విస్తున్నట్లుగా ఉంది మెసేజ్.

"అవును. బెట్‌లో ఓడిపోయాను" నిరాశగా రాశాడు.

"ఓడిపోయానని బాధ పడుతున్నావా హర్షా? చదువులో, ఇంటర్వ్యూలో, ఉద్యోగంలో, ప్రమోషన్లలో, తెలివితేటల్లో ఎప్పుడూ నీదేగా గెలుపు. మనకి ఇష్టమైన వాళ్ళముందు ఓడిపోవటం కూడా సంతోషంగానే అనిపిస్తుంది కదూ!"

"అంత సంతోషంగా అనిపించేట్లుంటే నువ్వే ఓడిపోయి చూడొచ్చుగా!" ఉక్రోషంగా టైప్ చేశాడు.

"కీప్ ట్రైయింగ్! గెలిచేవరకూ!!" కాసేపటికి వచ్చింది సమాధానం.

జగమొండి చెప్పదల్చుకోలేదనుకుంటా! గొణుక్కున్నాడు.

***

కావ్యకి చాలా దిగులుగా అనిపిస్తోంది.

అక్షయ్ ఆఫీస్‌కి రావటం మానేసి అప్పుడే నెలవుతోంది.

అసలతను మళ్ళీ తనకు కనబడతాడా?

రాత్రుళ్ళు నిద్రపట్టదు. పగలు తిండి సహించదు. ఏ పనీ చేయాలనిపించదు. ఎవరైనా మాట్లాడిస్తే భోరున ఏడవాలనిపిస్తోంది. కంట్రోల్ చేసుకోవటం కష్టంగా ఉంటోంది. అలాంటప్పుడు, తనను చూసిన వాళ్ళకెవరికైనా తనను కమ్ముకున్న దిగులు తెర స్పష్టంగా కనబడుతుంది.

ఎప్పుడూ గొంతులో ఏదో బంతిలాగా అడ్డం పడుతున్న ఫీలింగ్. ఏడుపు గొంతులోనే నొక్కేయటం వల్లనేమో!

అతనితో మాట్లాడాలనిపిస్తోంది. కానీ ఏం మాట్లాడుతుంది? అతని ముందు నోరు పెగలదు. పోనీ అతనైనా మాట్లాడించవచ్చు కదా! అతనసలు మాట్లాడించడు.

ఇన్నాళ్ళ తర్వాత కనబడతాడనుకుంటే రోజులు లెక్కపెట్టుకుంటూ గడిపేయవచ్చు. కానీ తన దగ్గర ఆ లెక్క కూడా లేదే!

ఏ పనిచేస్తున్నా అతని గురించి ఆలోచిస్తూనే ఉంటోంది ఒక పక్క.

ఇదివరకు తనెంత సంతోషంగా ఉండేది?

ఇప్పుడెందుకు ఏదీ సంతోషాన్నివ్వటం లేదు?

ఎవరైనా ఆనందంగా నవ్వుతూ, తుళ్ళుతూ కనబడితే వింతగా అనిపిస్తుందే? వాళ్ళకు కష్టాలేమీ లేవా అని ఆశ్చర్యంగా అనిపిస్తోంది.

వెధవ ప్రేమని సినిమాల్లో, బుక్స్‌లో హైప్‌చేసి చెప్తారు. ఇంత కష్టంగా ఉంటుందని తెలీక జనాలు నిజమేననుకుంటారు.

నిద్రపట్టక త్వరగా లేచి రెడీ అయి ఆఫీస్‌కి చేరుకుంది కావ్య.

ఇంకా ఎవరూ వచ్చినట్లు లేదు.

తన సీట్లో కూర్చుని మెయిల్ బాక్స్ ఓపెన్ చేసింది.

ప్రాజెక్టుకు సంబంధించి కొత్త ఫీచర్స్, పాత బగ్స్... ఇవి తప్ప ఇంకేమీ లేవందులో.

ఇదివరకు మెయిల్ చెక్ చేసుకుంటే అక్షయ్ నుంచి ఏదయినా మెయిల్ కనబడేది. ఆఫీస్ పని గురించి తప్ప మరే విషయమూ అతని మెయిల్‌లో లేకపోయినా మెయిల్ ఇష్టంగా ఓపెన్ చేసేది. ఒకటికి పదిసార్లు చదివేది.

దూరంగా ఒక వరస ముందు క్యూబ్స్‌లో ఆ చివరకి కూర్చుని కనబడేవాడు. ఎప్పుడూ లేచి నిలబడినట్లుండే జెల్‌పెట్టిన జుట్టు, గడ్డం మీద నొక్కు... చక్కటి బోన్ స్ట్రక్చర్ ఉన్నవాళ్ళకి అలా ఉంటుందట గడ్డం. ఎక్కడో చదివింది తను. అంత అందంగా, స్పెషల్‌గా అక్షయ్‌ని తయారుచేసి ఇన్ని కష్టాలెందుకు పెట్టాడో దేవుడు.

అప్రయత్నంగా లేచి అతని డెస్క్ దగ్గరకు నడిచింది. అతని చెయిర్‌ని ఆప్యాయంగా ముట్టుకుంది.

## జరిగిన కథ

అక్షయ్, కావ్య, సీమ, హర్ష ఓ మల్టీ నేషనల్ కంపెనీలో పనిచేస్తుంటారు. అక్షయ్ వాళ్ళ అక్కా, బావ యాక్సిడెంట్‌లో చనిపోతారు. వారి కూతురు నైరాని ఎటువంటి లోటు రానీకుండా పెంచాలనుకుంటాడు అక్షయ్. ఒకరోజు నైరా కనిపించకుండా పోతుంది. అక్షయ్ పోలీస్ కంప్లయింట్ ఇవ్వడంతో ఇన్వెస్టిగేషన్ మొదలవుతుంది. ఓ టీవీ ఛానల్ ద్వారా స్టింగ్ ఆపరేషన్ చేసి, ప్రాస్టిట్యూట్ రింగ్‌వారిని అరెస్టు చేయిస్తాడు అక్షయ్. పేపర్లో వచ్చిన ఓ వార్త ఆధారంగా పసిపిల్లలను బలిచ్చేవారిని వెతుకుతూ కలకత్తా, నిమ్తలాఘాట్ వెళతాడు. అక్కడ అఘోరాలు బలివ్వబోతున్న చిన్నారుల్ని కాపాడతాడు అక్షయ్. ఈలోపు నైరా ఆచూకీపై వస్తున్న రకరకాల సమాచారాన్ని శోధించటం మొదలుపెడతారు. పిల్లలను కిడ్నాప్ చేసి, వారిని బిచ్చగాళ్లుగా మారుస్తున్నారని తెలుసుకొని, ఆ దిశగా తన ప్రయత్నాలు మొదలుపెడతాడు అక్షయ్. కొంతమంది పిల్లలను రక్షిస్తాడు. ఒక వారంలో ఆమె ఎవరో కనిపెడతానని, తనకు మెసేజెస్ చేసే అమ్మాయితో ఛాలెంజ్ చేస్తాడు హర్ష. ఆమె సిమ్‌కార్డు డీటెయిల్స్ కోసం ప్రయత్నిస్తాడు. ఆ తర్వాత.....



అతని మానిటర్ స్క్రీన్‌మీద దుమ్ము పేరుకుపోయి ఉంది. చున్నీతో తుడుస్తుండగా అలికిడయింది.

గబగబా వచ్చి తన డెస్క్ వద్ద కూర్చుంది.

ఫ్రెండ్స్ అందరూ నైరా ఆచూకీ కనిపెట్టడానికి ఏదో ఒక ప్రయత్నం చేస్తున్నారు, తను తప్ప. తను కూడా ఏదయినా చేయాలి. ఏం చేయాలి?

ఆలోచనలో పడింది.

ఆరోజు మధ్యాహ్నానికి ఆమెకు తానేమీ చేయొచ్చో సమాధానం దొరికింది.

ఆమె ఇంటర్‌నెట్‌లో ఏదో బ్రౌజ్ చేస్తుండగా ఒకపక్కన ఫ్లాష్ అవుతోందా అడ్వర్టయిజ్‌మెంట్.

అమెచ్యూర్ డిటెక్టివ్స్‌కి సంబంధించిన అడ్వర్టయిజ్‌మెంట్ అది.

దానిమీద రీసెర్చ్ చేస్తుంటే ఎన్నో ఆసక్తికరమైన విషయాలు కనబడ్డాయి.

చాలామంది ఇంటర్‌నెట్ డిటెక్టివ్స్‌గా పనిచేసే వాళ్ళు ఉన్నారట. వీళ్ళు స్వచ్ఛందంగా, ఎటువంటి ప్రతిఫలం ఆశించకుండా తమ ఖాళీ సమయాల్లో డిటెక్టివ్స్‌గా పనిచేస్తూ, క్రిమినల్ కేసులు పరిశోధిస్తూ ఉంటారు.

వీరిలో కొందరు ఉద్యోగం పోయి ఖాళీ సమయంలో ఏం చేయాలో తెలీక ఈ పనిమీద ఉంటే, మరికొందరు చేసే ఉద్యోగం సంతృప్తినివ్వక ఇందులోకి వచ్చినవాళ్ళు. వీళ్ళు సాధారణంగా చాలా తెలివైన వాళ్ళయి ఉంటారు. చిన్నప్పుడు కుటుంబ సమస్యల వల్లో, మరే ఇతర కారణాల వల్లో పెద్దగా చదువుకుని ఉండకపోవచ్చు. సరైన విద్యార్హత లేకపోవటం వల్ల వీళ్ళు ఏదో ఒక రొటీన్ ఉద్యోగం చేస్తుంటారు. అయితే వాళ్ళలో ఏదో చేయాలనే తపన ఉంటుంది. అటువంటప్పుడు క్రిమినల్ కేసులు సాల్వ్ చేయటం ద్వారా తమకు తామే ఇంటెలెక్చువల్‌గా ఛాలెంజింగ్‌గా అవకాశాలను కల్పించుకుంటారు.

కొంతమంది పోలీస్ డిపార్ట్‌మెంట్ లేదా మిలటరీకి చెందినవాళ్ళు ఇందులో ఉంటారని చదివి ఆశ్చర్యపోయింది కావ్య. అయితే వీళ్ళు శారీరక బలహీనత వల్లో, అన్ని అర్హతలూ లేకపోవటం వల్లో బాక్ ఎండ్ ఉద్యోగాలకు పరిమితం అయినవాళ్ళు కావచ్చు. డెస్క్ వర్క్ చేసే వీళ్ళకి, తాము కూడా ఫీల్డ్‌లోకి దిగాలని ఉంటుంది. కానీ ఉద్యోగం అందుకు అనుమతించదు. అటువంటివాళ్ళు కొందరయితే, పోలీస్ ఆఫీసర్ల పిల్లలు మరికొంత మంది కూడా ఈ పని చేస్తుంటారు. ఇది వారి మెదళ్ళకు మేతలాగా పనిచేస్తుంది.

మొదట్లో తోచక ఓ ఆటలాగా దీన్ని మొదలెట్టిన వాళ్ళకు కూడా రానురాను ఇది ఒక అబ్‌సెషన్ అయిపోయిందట.

ఇటువంటి ఔత్సాహిక అమెచ్యూర్ డిటెక్టివ్‌ల కోసం కొన్ని వెబ్‌సైట్లు కూడా ఉన్నాయి.

ఇందులో క్రిమినల్ కేసులు, ఎన్నేళ్ళైనా పరిష్కారం దొరకని కేసులూ పోస్ట్‌చేస్తే ఇంటర్‌నెట్ డిటెక్టివ్‌లు రంగంలోకి దిగుతారు. సోషల్‌మీడియా మొత్తాన్ని స్కాన్ చేస్తారు, ఏదయినా క్లూ దొరుకుతుందనే ఉద్దేశంతో.

కొన్నిసార్లు బాధితులు మనకు తెలిసిన వాళ్ళయినప్పుడు అన్ని కోణాల్లో ఆలోచించలేము. వాళ్ళగురించి మనకున్న అవగాహనతో ఒకేరకంగా ఆలోచిస్తాము. దానితో పరిశోధన ముందుకు సాగదు.

ఇంటర్‌నెట్ డిటెక్టివ్‌లకి ఇది ఒక పజిల్ మాత్రమే.

ఎటువంటి ముందస్తు భావనలు లేకుండా వీళ్ళు సమస్యని పరిశోధిస్తారు. పరిష్కరిస్తారు.

ఏ వెబ్‌సైట్‌లో నైరా కేస్ పోస్ట్ చేయొచ్చో ఆలోచనలో పడింది కావ్య. వెబ్ స్లూత్స్, డో నెట్‌వర్క్ లాంటి చాలా కమ్యూనిటీలు ఆన్‌లైన్‌లో కనబడుతున్నాయి. యు.ఎస్. గవర్నమెంట్ కూడా ఇటువంటి సైట్స్‌వల్ల వచ్చే ఉపయోగాలు గమనించి నేమస్ అనే సైట్‌ని 2008లో లాంచ్ చేసిందట. ఇందులో మిస్సింగ్ కేసుల వివరాలు పొందుపరచి ఉంటాయి. ప్రజలు ఎవరైనా సరే లాగిన్ అయి తమకు తోచిన సమాచారం ఇవ్వచ్చు, ఆ వెబ్‌సైట్‌లో.

పరిశోధన కొనసాగుతున్న కేస్ వివరాలను పబ్లిక్‌గా వెబ్‌సైట్‌లో పెట్టవచ్చా? సడన్‌గా డౌట్ వచ్చింది కావ్యకి.

ఒక వెబ్‌సైట్‌లో రిజిస్టర్ చేసుకుని వెబ్‌సైట్ మోడరేటర్‌కి మెయిల్ చేసింది. కొన్ని గంటల తర్వాత సమాధానం లభించిందామెకి. ఈ వెబ్‌సైట్స్‌లో పోస్ట్ చేయటం వల్ల న్యాయపరమైన, చట్టపరమైన చిక్కులేవీ రావట. అయితే కొన్నిసార్లు పోలీసుల పరిశోధన మధ్యలో ఉండగా ఈ అమెచ్యూర్ డిటెక్టివ్స్ చేసే విశ్లేషణ వాళ్ళను గందరగోళానికి గురి చేస్తుండవచ్చు. కాబట్టి ప్రతి పోస్ట్ పోలీసుల వరకూ వెళ్ళదనీ, తాము వడపోత చేశాకే నమ్మదగినవి అనుకున్నవి మాత్రమే పోలీసుల వరకూ పంపుతామందామె.

అసలింతకీ ఫిల్టర్ చేయటానికి ఈమెకున్న అర్హతలేమిటా అని ఆలోచనలో పడింది కావ్య.

తర్వాత పేరాలో కావ్యకు జవాబు లభించింది. ఎఫ్.బి.ఐ.లో సీనియర్ ర్యాంక్‌లో చేసి రిటైర్ అయిందట ఆ వెబ్‌సైట్ నడిపే ఆవిడ. పంపిన ప్రతి విశ్లేషణనీ, క్లూస్‌నీ పరిగణనలోకి తీసుకోరట పోలీసులు. అమెచ్యూర్ డిటెక్టివ్‌ల మేధస్సు మీద నమ్మకం లేక కొంతమంది పోలీసులు వీళ్ళిచ్చే సమాచారాన్ని పట్టించుకోకపోతే, మూసేసిన కేసులు తిరగదోడాల్సి వస్తుందనీ, దానివల్ల పని భారం ఎక్కువవుతుందనీ మరికొందరు పోలీసులు చూసీ చూడనట్లు వ్యవహరిస్తారట.

పోలీస్ డిపార్ట్‌మెంట్ వాళ్ళు తమకు తాముగా కూడా ఒకోసారి ప్రజల సహాయం అడుగుతారట. ముఖ్యంగా కోడ్‌వర్డ్స్‌ని విడగొట్టడానికి, డీక్రిప్ట్ చేయటానికి ఇంటర్‌నెట్ డిటెక్టివ్‌లపై ఆధారపడతారట. వాటికోసమే కోడ్‌బ్రేకర్స్ లాంటి వెబ్ సైట్లున్నాయట.

చివరగా ఆమె చెప్పిన సమాచారానికి ఖంగు తింది కావ్య. ఒకవేళ మరేవైనా ఇంటర్నెట్ గూఢచారుల వెబ్‌సైట్స్‌లో రిజిస్టర్ చేసుకుంటే ఇక్కడ రిజిస్ట్రేషన్ క్యాన్సిల్ అవుతుందట.

స్వచ్ఛందంగా నిర్వహించే సంస్థల్లోనూ ఈ కాంపిటీషన్ ఏంటో అర్థం కాలేదు కావ్యకి. అడిగితే 'తమ్ముడు తమ్ముడే.. పేకాట పేకాటే' లాంటి సమాధానం రావటంతో నోరు మూసుకుంది.

ఒకసారి దేవుడికి దణ్ణం పెట్టుకుని నైరా ఫోటో, కేస్ వివరాలు అన్నీ పోస్ట్ చేసింది. మోడరేటర్ మొత్తం రివ్యూచేసి మర్నాటికి ఆ పోస్ట్ పబ్లిష్ చేసింది.

నైరా తప్పిపోయిన ప్రదేశం వివరాలు అడుగుతూ ఒక ఇంటర్నెట్ గూఢచారి స్పందించాడు. ఆ ప్రదేశం నుంచి కొద్ది కొద్దిగా విస్తరిస్తూ ఆ చుట్టుపక్కల ఉన్న ఏరియాలనీ, అక్కడుండేవారి వివరాలు సోషల్ నెట్‌వర్క్‌లో చెక్ చేస్తాడట. ఏదో ఒక క్లూ తప్పక దొరుకుతుందనీ, అయితే ఇదంతా చాలా శ్రమతోనూ, ఒత్తిడితోనూ కూడుకున్న వ్యవహారమనీ అన్నాడు. అయినప్పటికీ ఒక పసిపిల్లను రక్షించటానికి ఎంత శ్రమయినా పడతానని ఉద్వేగంగా సమాధానం ఇచ్చాడు.

ఎక్కడో మరోదేశంలో ఉండి ఎవరో తెలియని వారి కోసం అతను అంతలా శ్రమ పడతాననడం

**కావ్యకి దిగులుగా అనిపిస్తోంది. నిద్రపట్టదు. తిండి సహించదు. ఏ పనీ చేయాలనిపించదు. ఫ్రెండ్స్ అందరూ నైరా ఆచూకీ కోసం ఏదో ఒక ప్రయత్నం చేస్తున్నారు, తనుతప్ప. తను కూడా ఏదో ఒకటి చేయాలి? అని ఆలోచిస్తూ, బ్రౌజ్ చేస్తుండగా, ఒక అడ్వర్టయిజ్‌మెంట్ ఆమెను ఆకర్షించింది. ఇంతకీ ఏమిటా అడ్వర్టయిజ్‌మెంట్? ఏం చేయదలుచుకుంది ఆమె?**

కావ్యను కదిలించింది. కృతజ్ఞతలు తెలుపుతూ అదే మాట అందతనితో.

అప్పుడు చెప్పాడతను.

తన మూడేళ్ళ కూతురుని ఒక వ్యక్తి కిడ్నాప్‌చేసి దారుణంగా హింసించి చంపాడనీ, మరెవ్వరూ అటువంటి హింసకు గురి కాకూడదనీ, తనకు ఆత్మ సంతృప్తి కోసమే కనీసం బ్రతికి ఉన్న వేరే పిల్లలనయినా రక్షించడానికి ప్రయత్నిస్తుంటానన్నాడు. తన బిడ్డని కిడ్నాప్ చేసిందీ, చిత్రహింసలు పెట్టి చంపిందీ పక్కింటి అతనే అని తర్వాత తేలిందట. వాళ్ళు ఊరంతా వెతుకుతున్న సమయంలో పక్కింట్లోనే నరకయాతనకి గురయింది అతని కూతురు.

'కొంచెం జాగ్రత్తగా విశ్లేషించి ఉంటే కనుక్కోగలిగే వాళ్ళము. ఆ టైమ్‌లో ఇమోషన్స్ మమ్మల్ని ఆలోచించుకోనీయలేదనుకుంటాను. కేర్‌ఫుల్‌గా ఒక్కొక్క డాట్‌నీ కనెక్ట్ చేస్తూ పోతే ఏ మిస్టరీ అయినా విడిపోక తప్పదు. ఏరోజూ ఎవరికీ సహాయపడని పక్కింటి వ్యక్తి ప్రతిరోజూ మేము పాపని వెతకటానికి వెళ్తుంటే తోడొస్తుంటే అయినా మాకు తట్టలేదు. ఎటువంటి క్లూ దొరకకుండా మమ్మల్ని మిస్‌లీడ్ చేయటానికే మమ్మల్ని వెన్నంటి ఉన్నాడని తర్వాత తెలిసింది' చెప్పాడతను.

అతనికి కావల్సిన వివరాలు ఇచ్చింది కావ్య.

***

ఆ రోజు క్లయింట్‌కి మాడ్యూల్ డెమో ఉంది.

యు.ఎస్. నుంచి విజిట్‌కి వచ్చారు క్లయింట్ టీమ్.

క్లయింట్ టీమ్ ఇండియాలో ఉండే టైమ్‌లోనే రిలీజ్ డేట్ కూడా ఉండడంతో డెవలప్ చేసిన ఫీచర్స్‌ని వాళ్ళకి డెమోచేసి, తర్వాత గో, నోగో మీటింగ్ పెట్టుకునేలా ప్లాన్ చేశారు.

గో, నోగో మీటింగ్‌లో రిలీజ్ వాళ్ళకు సంతృప్తికరంగా ఉంటేనే ప్రొడక్షన్‌లోకి పంపటానికి అనుమతిస్తారు. లేనప్పుడు ఏమేమి సరిగ్గా లేవో లిస్ట్ చేసి మళ్ళీ ప్లానింగ్ మొదలుపెట్టాల్సి ఉంటుంది. మళ్ళీ నెల, రెండు నెలలు అదనంగా పట్టే ప్రక్రియ అది.

'నోగో' రావటాన్ని సాఫ్ట్‌వేర్ రంగానికి చెందిన వాళ్ళు తీవ్ర అవమానంగా పరిగణిస్తారు. తర్వాత ఒకవారం తలెత్తుకు తిరగలేరు. ఇంతలోకి మరేదో ప్రాజెక్ట్ వాళ్ళకి 'నోగో' వచ్చిందని తెలిసి వీళ్ళు సర్దుకుంటారు.

డెమో ఏర్పాట్లు చేసుకుంటున్నారు బ్రహ్మి, అతని ప్రాజెక్ట్ టీమ్.



కాన్ఫరెన్స్ రూమ్‌లో ప్రొజెక్టర్‌కి ల్యాప్‌టాప్ కనెక్ట్ చేస్తోంది రోహిణి.

సుధీర్ కులాసాగా కాళ్ళూపుతూ కూర్చున్నాడు.

కావ్య భయంతో కళ్ళు పెద్దవిచేసి చూస్తోంది.

బ్రహ్మీకి చెమటలు కారిపోతున్నాయి.

అక్షయ్ ఉంటే తనకి ధైర్యంగా ఉండేది. ఈ పైలాపచ్చీస్ గ్యాంగ్‌తో తమ డెమో ఎలా జరుగుతుందో? అంతా దేవుడి మీద భారం వేశాడు బ్రహ్మీ.

డెమో టైమ్‌కి కాన్ఫరెన్స్ రూమ్‌కి చేరుకున్నారు క్లయింట్ టీమ్.

వాళ్ళు మొత్తం ముగ్గురున్నారు.

ఒకతను దాదాపు ఏడడుగులున్నాడు. లావుగా పెద్ద టెడ్డీబేర్‌లా అనిపించాడు.

మిగిలిన ఇద్దరిలో ఒకతను చాలా యాక్టివ్‌గా, కాన్ఫిడెంట్‌గా ఉన్నాడు. అతనే తమని గ్రిల్‌చేసి ప్రశ్నలు అడుగుతాడని చూడగానే బ్రహ్మీకి అర్థమైపోయింది. మరో అతను చాలా అందంగా ఉన్నాడు. ప్రతివాళ్ళను చూసి ముప్ఫయి రెండు పళ్ళూ కనపడేలా నవ్వుతున్నాడు. అతను చేతులు తిప్పటంలో, చూడటంలో, నడవటంలో, ఇలా ప్రతిపనిలో వయ్యారం కనబడుతోంది.

పరిచయాలయ్యాయి.

టెడ్డీబేర్ లాంటి వ్యక్తి సీనియర్ మేనేజర్ అట. మిగతా ఇద్దరూ అతనికింద బిజినెస్ మేనేజర్లు.

ఇండియాకి తమ పనిని మొదటిసారి అవుట్ సోర్స్ చేశామన్నాడతను. ఇండియాలో తమ ఆపరేషన్స్‌ని విస్తరించాలనే ఆలోచనలో ఉన్నామన్నాడు.

ఈ కంపెనీతో పాటు, మరో రెండు కంపెనీలను, ఇండియాలో వాళ్ళుండే వారంలో విజిట్ చేస్తారట.

టీమ్స్‌ని కలిసి, మాట్లాడి ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ పరిశీలించి ఏ కంపెనీకి బిజినెస్ ఇవ్వచ్చో ఆలోచిస్తామన్నాడు.

యు.ఎస్‌లోని బిజినెస్ టీమ్ వీడియో కాన్ఫరెన్స్‌లో జాయిన్ అయింది.

ప్రాజెక్ట్‌కి బిజినెస్ అనలిస్ట్‌గా ఉన్న రాధ ఆరోజు 'వర్క్‌ఫ్రమ్ హోమ్' ఆప్షన్ తీసుకుని ఇంట్లో నుండి పనిచేస్తోంది. ఆమె ఫోన్‌లో మీటింగ్‌లో జాయిన యింది.

డెమో మొదలయింది.

అంతా ఉత్సాహంగా, కుతూహలంగా స్క్రీన్ వైపు చూస్తున్నారు.

రోహిణి యూజర్ ఐడి, పాస్‌వర్డ్ ఎంటర్‌చేసి లాగిన్ మీద క్లిక్ చేసి చెప్పటం మొదలెట్టింది.

"ఇప్పుడు మనకు హోమ్‌పేజ్ కనబడుతుంది. లాగిన్ అయ్యే వ్యక్తిని బట్టి వేర్వేరు ఇన్‌ఫర్మేషన్ కనబడుతుంది. ఉదాహరణకు మీ బిజినెస్ మేనేజర్లు ఇద్దరూ రెండు లైన్స్ ఆఫ్ బిజినెస్‌లను మేనేజ్ చేస్తుండవచ్చు. ఒకరి యూనిట్‌కి సంబంధించిన వివరాలు మరొకరికి తెలియనక్కర్లేదు. తెలీకూడదు కూడా. కానీ వాళ్ళిద్దరికీ మేనేజర్‌గా మీకు రెంటికీ సంబంధించిన వివరాలు, రిసోర్స్‌లు అవసరమవుతాయి. కాబట్టి మీరు ముగ్గురూ మాడ్యూల్ ఓపెన్ చేస్తే మీకు వేర్వేరు పేజీలు కనపడతాయి.

బ్రహ్మీ ఏవో సైగలు చేస్తున్నాడు.

రోహిణికి అర్థం కాలేదు.

క్లయింట్ టీమ్ వాళ్ళ మొహాలు నిర్వికారంగా ఉన్నాయి.

వెనక్కి తిరిగి స్క్రీన్ వేపు చూసింది రోహిణి.

ఆమె లాగిన్ అవటానికి ఎంటర్ చేసిన వివరాలు తప్పనీ, ఆ యూజర్ లేదనీ ఎరుపు రంగు అక్షరాలు కనబడుతున్నాయి.

"హి హ్హి" నవ్వింది రోహిణి.

"సెక్యూరిటీ ఉందని చూపించడానికి, తప్పు వివరాలు ఎంటర్ చేశారు. కాబట్టి తప్పు డీటెయిల్స్ వాడితే మీకు ఆక్సెస్ ఉండదు' కవర్ చేసింది కావ్య.

కావ్యవైపు కొరకొరా చూసింది.

కొన్ని యూజర్‌ఐడీలు, పాస్‌వర్డ్‌లు ఇచ్చి వాళ్ళను ఆన్ చేయమని చెప్పింది నిన్న తను. మర్చిపోయినట్లుంది.

రోహిణి చూపు చూశాక అప్పుడు గుర్తొచ్చింది కావ్యకి.

నిన్నటినుంచి ఏదో పని పెండింగ్ ఉండిపోయింది, గుర్తు రావట్లేదు అని ఒకటే ఆలోచిస్తోంది తను. ఇదన్నమాట. నాలుక కరుచుకుంది కావ్య.

అయిదు నిమిషాలు టైమ్ తీసుకుని యూజర్స్‌ని ఆడ్ చేశారు.

కొత్త యూజర్స్ క్రియేట్ చేయటం తేలికైన ప్రక్రియనీ, అది కూడా వీళ్ళకు చూపించడం కోసమే క్రియేట్ చేయలేదనీ, కలర్ ఇచ్చింది రోహిణి.

క్లయింట్ టీమ్ నమ్మినట్లే కనబడ్డారు.

ఇప్పుడు హోమ్‌పేజ్ కనబడుతోంది.

ఉత్సాహంగా చేయితిప్పుతూ అడిగాడు క్లయింట్ టీమ్‌లో అతను.

"ఎందుకు పింక్ కలర్ వాడలేదు? బ్లూ బాగున్నప్పటికీ నాకు గులాబీరంగు ఇష్టం. నా డాష్‌బోర్డు కలర్స్ నేను మార్చుకోవచ్చా?"

సుధీర్ మెల్లగా చెయిర్‌ని అతనికి దూరంగా జరుపుకున్నాడు.

"బ్లూ, గ్రీన్ కళ్ళకు సూతింగ్‌గా ఉంటాయని ఆ రంగులు వాడతాము" వింతగా చూస్తూ చెప్పాడు బ్రహ్మీ.

కళ్ళు గుండ్రంగా చేసి బుగ్గన వేలేసుకుని విన్నాడతను.

ఒక లింక్ మీద క్లిక్ చేసి చూపించమన్నాడు రెండో అతను.

"తప్పకుండా!"

క్లిక్‌చేసింది రోహిణి.

ఏమీ జరగటం లేదు.

"అదొట్టి ఇమేజా? నిజంగా పనిచేస్తుందా?" అడిగాడతను. వెటకారం స్పష్టంగా అర్థమవుతోంది.

"లేదు, పనిచేస్తుంది. లెట్‌మీ చెక్!" గబగబా కోడ్ చేంజ్ చేయటం మొదలెట్టింది రోహిణి.

యూఎస్‌లోని టీమ్‌వాళ్ళు బ్రహ్మీకి పింగ్ చేయటం మొదలెట్టారు.

""డెమో ఫ్లో మొత్తం ఒకసారి చెక్ చేయలేదా? క్లయింట్ ముందు ఏమిటిదంతా?"

పది ప్రాజెక్ట్‌లు అంటగట్టి ఇక్కడ మేనేజ్‌మెంట్ చోద్యం చూస్తోంది. రోజూ ఏదో ఒక డెమో

## సక్సెస్ కోసం తమ్ము పాట్లు!

దక్షిణాదిన సక్సెస్ కోసం కాదు, ఉత్తరాదిన సక్సెస్ కోసమే తమన్నా పడరాని పాట్లు పడుతోంది. నటన, గ్లామర్‌తో పాటు ఎక్స్‌పోజింగ్‌కు రెడీ అంటున్న తమన్నాకు అవకాశాలు రావడం లేదట! బాలీవుడ్‌లో డ్రస్సింగ్‌కు ఎక్కువ ప్రాముఖ్యం ఇస్తారు. ఈ విషయాన్ని గుర్తించి క్లీవేజ్ షోకి బాగానే ట్రై చేస్తోంది. హెయిర్ స్టయిల్ కూడా మార్చేసింది. మొత్తానికి తనను తాను పూర్తిగా మార్చుకున్నా అవకాశాలు మాత్రం రావడం లేదని తెగ బాధపడుతోందట! తమన్నా లేటెస్ట్ ఫోటోలు చూసిన వారందరూ తమన్నా అందం అదుర్స్ అంటున్నారట కానీ, నువ్వే మా హీరోయిన్‌వి అనడం లేదట! ఈ ప్రయత్నాలేవో ముందే చేసి ఉంటే ఈ పాటికి అక్కడ జెండా పాతేసి ఉండేదని ఆమె అభిమానులు అంటున్నారు.



# ఒక్కొక్కరితో మూడుసార్లు

ఇందులో విపరీతార్థం ఏమీ లేదు. ఒక హీరో హీరోయిన్ కలిసి రెండో సారి సినిమా చేయడం గగనమవుతుంటే రెజీనా ముగ్గురు హీరోలతో మూడు సినిమాల చొప్పున చేస్తోంది. ఆ లెక్క ఏమిటంటే.. ప్రస్తుతం రెజీనా చేసిన 'నక్షత్రం' సినిమా విడుదల కాబోతోంది. ఈ సినిమాలో సందీప్ కిషన్, సాయి ధరమ్ తేజ్‌లు చేస్తున్నారు. గతంలో ఈ ఇద్దరు హీరోలతో విడి విడిగా రెండు సినిమాలు చేసింది. ఇది మూడవ సినిమా! ఇక నారా రోహిత్‌తో 'శంకర', 'జ్యో అచ్యుతానంద'లో చేసింది. ఇప్పుడు మూడవ సినిమా పవన్ మల్లెల దర్శకత్వంలో రోహిత్‌తో జతకట్టనుంది. ఇలా వరుసగా ముగ్గురు హీరోలతో మూడు సినిమాలు చేసిన ఘనత బహుశా రెజీనాకు మాత్రమే దక్కిందని కొందరు అంటున్నారు .



ఉంటుంది. ప్రతిదానికీ ముందు టీమ్‌తో కూర్చుని ఎక్కడ చూస్తాడు తను.

"ఇప్పుడు వర్క్ అవుతుంది చూడండి. చిన్న పాచ్ మిస్ అయింది." ఉత్సాహంగా చెప్పి లింక్ మీద క్లిక్ చేసింది రోహిణి.

ఇప్పుడొట్టి వైట్‌స్క్రీన్ కనబడుతోంది. అక్షరాలు, రంగులు అన్నీ మాయం అయ్యాయి.

"గుడ్ ప్రోగ్రెస్" అన్నాడు క్లయింట్ మేనేజర్.

రెండో అతను కిలకిలా నవ్వి, సుధీర్ భుజం మీద చేయి వేశాడు.

మళ్ళీ అయిదు నిమిషాలు కోడ్‌మీద పని చేశారు రోహిణి, కావ్య.

ఈలోగా యూఎస్ నుంచి వీడియో కాన్ఫరెన్స్‌లో జాయిన్ అయినవాళ్ళు క్లయింట్ టీమ్‌ని మాటల్లో పెట్టారు. కాసేపు వాతావరణం గురించీ, స్పోర్ట్స్, సినిమాలు, పిల్లల గురించి మాట్లాడించి టైమ్ తెలీకుండా మేనేజ్ చేశారు. కాసేపటికి రోహిణి, డెమోకి రెడీ అని బొటన వేలెత్తి చూపించింది.

అందరూ ఊపిరి పీల్చుకున్నారు.

ఈసారి సజావుగానే డెమో కొనసాగింది.

టెడ్డీబేర్ లాంటి క్లయింట్ టీమ్‌మెంబర్ తేనె తాగి మత్తుకు జోగుతున్నట్లుగా కుర్చీలో కూర్చున్నాడు. చూసేవాళ్ళకు అతనసలు వినడం లేదనిపిస్తుంది. కానీ సరిగ్గా టైమ్‌కి ప్రశ్నలు వేస్తున్నాడు.

ఉన్నట్లుండి ఒక ఫీచర్ మీద వాదన మొదలయింది.

"మేమిచ్చిన రిక్వయిర్‌మెంట్ ఇదికాదు" అన్నాడు క్లయింట్ మేనేజర్.

కాసేపు రోహిణికీ, అతనికీ వాదం జరిగింది.

ఇంట్లోనుంచి కాల్‌లో జాయినయిన రాధ అభిప్రాయం అడిగారు.

వాళ్ళవద్ద నుంచి రిక్వయిర్‌మెంట్స్ అన్నీ సేకరించి డాక్యుమెంట్ చేసింది ఆమె కాబట్టి.

సమాధానం లేదు.

"రాధా!" గట్టిగా పిలిచాడు బ్రహ్మీ.

"మమ్మీ! నిన్ను పిలుస్తున్నారు" చిన్నపిల్లల గొంతు వినబడింది ఫోన్‌లో.

"కాల్‌లో జాయిన్ అయి కొడుకునో, కూతురునో కూర్చోబెట్టి వేరే పని చేసుకుంటున్నట్లుంది" పళ్ళు నూరాడు బ్రహ్మీ.

"డాడీని వంట పూర్తి చేసేయమని చెప్పు" ఫోన్‌లో వినబడుతోంది.

"మమ్మీ, నా గేమ్ సగంలో ఉంది. కంప్యూటర్ నాకు కావాలి" సణుగుతున్నదొక చిన్నపిల్ల గొంతు.

"మ్యూట్ తీసేసినట్లున్నావురా, మొత్తం వాళ్ళకు వినబడి ఉంటుంది" గొణగటం వినబడుతోంది.

"కెన్ యూ రిపీట్?" చాలా కాన్ఫిడెంట్‌గా అడిగింది రాధ.

చేసేది లేక మళ్ళీ మొత్తం సమ్మరీలా చెప్పింది రోహిణి.

కాసేపు వాదించుకున్నాక మళ్ళీ డెమో కొనసాగింది.

"నా యూజర్ ఐడీతో లాగిన్ అవండి" అడిగాడు టెడ్డీబేర్.

అతని వివరాలు ఎంటర్‌చేసి లాగిన్ బటన్ మీద క్లిక్‌చేసింది రోహిణి.

అంతే. సిస్టమ్ క్రాష్ అయింది. బ్లూ స్క్రీన్ కనబడుతోంది.

తలెక్కడ పెట్టుకోవాలో ప్రాజెక్ట్ టీమ్‌కి అర్థం కాలేదు.

టెన్షన్‌లో ఏం మాట్లాడుతున్నాడో తనకే అర్థం కాక "మీ డెసిషన్ ఏమిటి? గోనా? లేక నోగోనా?" అడిగాడు బ్రహ్మీ.

నిరసనగా చూశారు క్లయింట్ టీమ్ వాళ్ళు.

"ఐ డోంట్ నో వాటు టు సే?" అన్నాడు టెడ్డీబేర్.

వాళ్ళు వెళ్ళిపోయాక యూఎస్ టీమ్‌తో బ్రహ్మీకి అక్షింతలు పడ్డాయి.

వాళ్లు క్లాస్ పీకటమే కాక, అతని మేనేజర్‌కి కూడా మెయిల్ పెట్టడంతో, మేనేజర్ బ్రహ్మీని పిలిచి అరగంట చీవాట్లేశాడు.

"మొత్తం నువ్వొకసారి ముందే చెక్‌చేయాలి" అందరి మాటల సారాంశం అదే.

ప్రాజెక్ట్ టీమ్‌ని మీటింగ్‌కి పిలిచాడు బ్రహ్మీ.

"కావ్య యూజర్స్‌ని క్రియేట్ చేయలేదంది రోహిణి.

ఇంటికెళ్ళే ముందు హడావుడిలో ఉన్నప్పుడు లిస్ట్ ఇచ్చిందంది కావ్య.

సుధీర్ టెస్టింగ్ సరిగ్గా చేయలేదన్నారు ఇద్దరూ.

సుధీర్, రాధ తనకా రిక్వయిర్‌మెంట్ సరిగ్గా చెప్పలేదన్నాడు.

చివరికి అందరూ కలిసి బ్రహ్మీతో అన్నారు.

"ఒకరోజు ముందే మాక్‌డెమో పెట్టుకుని మీరు మొత్తం చూస్తే ఈ గొడవంతా ఉండదు".

తల పట్టుకున్నాడు బ్రహ్మీ.

ఇంత ఘోరమైన డెమో తర్వాతకూడా వాళ్ళు తనవైపే వేలెత్తి చూపిస్తుంటే, ఏం మాట్లాడాలో అర్థం కాలేదతనికి. "పూర్వజన్మలో ఏం పాపం చేసుంటాడో తను, ఈ జన్మలో ఇలాంటి ఉద్యోగంలో పడ్డాడు. ఇంతకంటే కూలి పని చేసుకోవటం ఉత్తమం!" గొణుక్కున్నాడు.

***

అదొక స్టార్ హాస్పిటల్.

తెల్లటి అత్యాధునిక భవంతి. ఫాల్స్‌సీలింగ్‌కి అమర్చిన లైట్ల వెలుతురులో మరింత దేదీప్యమానంగా మెరిసిపోతోంది.

సమయం రాత్రి పదకొండవుతోంది.

ఐసోలేషన్ వార్డ్ అంతా నిశ్శబ్దంగా ఉంది. అప్పుడప్పుడూ పేషెంట్స్ దగ్గు, మూలుగులు వినబడుతున్నాయి. ఇతరులకు తేలిగ్గా సోకే అంటువ్యాధులు ఉన్నవాళ్ళను, మిగతావారికి దూరంగా, ఐసోలేషన్ వార్డ్‌లో ఉంచుతారు.

పర్మిషన్ లేనిదే డాక్టర్లు, నర్సులు కూడా అటు వైపు వెళ్ళరు. ట్రీట్‌మెంట్ ఇవ్వాల్సి వచ్చినప్పుడు, తప్పనిసరైతే తప్ప ఆ వార్డ్‌లోకి వెళ్ళాలని కూడా ఎవరూ అనుకోరు.

ఐసోలేషన్ వార్డ్ వెనకభాగంలో ఉన్న గోడదూకి పిల్లిలా కాంపౌండ్‌లోకి ప్రవేశించాడు అక్షయ్.

**(ఇంకా వుంది)**

# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో
## PCOD సమస్యకు సరైన పరిష్కారం



డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్

నేటికాలపు ఆధునికతతో పాటు పెరుగుతున్న ఆరోగ్య సమస్యలలో స్త్రీలను ఎక్కువగా వేధించేది పీ.సీ.ఓ.డి. సమస్య. దాదాపు 25 నుండి 30 శాతం వరకు స్త్రీలు ఈ వ్యాధితో బాధ పడటం జరుగుతోంది. యుక్తవయస్సు వారిలో ఇది తొలుత – మొటిమలను, బరువు పెరగడం మరియు అవాంఛిత రోమాలను కలుగజేసే ఒక సౌందర్య సమస్యలా పరిణమిస్తే – వివాహిత స్త్రీలలో వీటితో పాటు సంతానలేమి సమస్యను కూడా కలుగజేస్తుంది. నేటి మానవుని జీవనశైలిలో ఎన్నో మార్పులు రావడం, అధిక మానసిక ఒత్తిడికి లోనవడం సరైన ఆహార నియమాలు మరియు వ్యాయామాలు లోపించడం వంటి అంశాలన్నీ ఈ వ్యాధికి దారితీసే ప్రధాన కారణాలుగా చెప్పవచ్చు.

**పీ.సీ.ఓ.డి. అనగా:** అపరిపక్వమైన అండం (ఇమ్మెచ్యూర్ ఫాలికల్) నీటి బుడగల వలె మారి అండాశయపు గోడలపై ఉండిపోవటాన్ని పీ.సీ.ఓ.డి. అంటారు. ఇలా రెండు అండాశయాలపై ఏర్పడినట్లయితే దానిని బైలేటరల్ పీసీఓడి అని అంటారు.




సాధారణంగా నెలసరి ఉన్న మహిళలలో నెలసరి మొదలైన 11-14 రోజుల మధ్యలో ఇరు అండాశయాలలో ఏదో ఒక అండాశయం నుండి అండం విడుదల అయి – ఫలదీకరణకు సిద్ధంగా ఉంటుంది. కానీ పీ.సీ.ఓ.డి. సమస్య ఉన్న మహిళలలో అండం విడుదల కాకుండా అపరిపక్వత చెంది – అండాశయపు గోడలపై నీటిబుడగల వలె ఉండిపోతుంది.

**కారణాలు:** పీ.సీ.ఓ.డి.కి గల ఖచ్చితమైన కారణాల పరంగా ఇంతవరకూ స్పష్టత లభించలేదు. కానీ ఇది హార్మోన్‌ల అసమతుల్యత వలన కలుగుతుందని చాలా వరకు నమ్మడం జరుగుతుంటుంది. • F.S.H., L.H., టెస్టోస్టిరాన్ మరియు ప్రొలాక్టిన్ హార్మోన్‌ల స్థాయి పెరగడం. • **ఇన్సులిన్ రెసిస్టెన్స్:** దీని వలన రక్తంలో ఇన్సులిన్ శాతం పెరిగిన కారణంతో టెస్టోస్టిరాన్ హార్మోన్‌ల స్థాయి పెరిగిపోతుంది. ఇలాంటి పరిస్థితి స్థూలకాయానికి దారితీసి, పీ.సీ.ఓ.డి. సమస్యను ప్రేరేపిస్తుంది. • వంశపారంపర్యత, అధిక మానసిక ఒత్తిడి, వ్యాయామం లోపించడం వంటి అంశాలన్నీ ఈ సమస్యకు గల కారణాలుగా చెప్పవచ్చు.

**లక్షణాలు:** నెలసరి రాకపోవడం, నెలసరిలో ఎక్కువ లేదా తక్కువ రక్తస్రావం అవటం, నెలసరిలో రక్తస్రావం 4–5 రోజులకు మించి కొనసాగటం, రెండు ఋతుచక్రముల మధ్యలో రక్తస్రావం అవడం • నెలసరి సరిగా వచ్చినప్పటికీ, అండాశయం నుండి అండం విడుదల కాకపోవడం • ముఖం మరియు వీపు భాగంలో మొటిమలు రావడం • చర్మపు మడతలలో మరియు మెడ భాగంలో చర్మం మందంగా మరియు నల్లగా మారటం • సంతానలేమి సమస్య, బరువు పెరగడం, జుట్టు ఎక్కువగా రాలిపోవటం, తలనొప్పి • కొందరిలో బరువు సాధారణంగా ఉండటం మరియు మరికొందరిలో బరువు తగ్గటాన్ని కూడా గమనించవచ్చు. • ముఖం మరియు ఛాతీపై మగవారికి మాదిరిగా వెంట్రుకలు రావడం • మానసిక అశాంతి (Mood Swings) వంటి లక్షణాలను గమనించవచ్చు.

**దుష్ప్రభావాలు:** టైప్-II డయాబెటిస్, గుండె జబ్బులు, కొలెస్టిరాల్ సమస్యలు, అధిక రక్తపోటు, ఎండోమెట్రియం క్యాన్సర్ వంటి సమస్యలకు పీ.సీ.ఓ.డి. దారి తీస్తుంది.

**తీసుకోవలసిన జాగ్రత్తలు:** నిత్యజీవన విధానంలో తగినన్ని మార్పులు చేసుకోవాలి – ముఖ్యంగా ఒత్తిడిని తగ్గించుకోవాలి. ప్రతిరోజూ క్రమం తప్పకుండా వ్యాయామం చేయాలి. • బరువును అదుపులో ఉంచుకోవడం ద్వారా డయాబెటిస్, అధిక రక్తపోటు, కొలెస్టిరాల్ వంటి సమస్యలకు దూరంగా ఉండవచ్చు. • అధిక కొవ్వు పదార్థాలను మరియు జంక్ ఫుడ్స్‌ను తీసుకోకపోవడం వంటి జాగ్రత్తలు తీసుకోవడం ద్వారా పీ.సీ.ఓ.డి. సమస్యను కొంతవరకు నియంత్రణలో ఉంచవచ్చు.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ చికిత్స:** హార్మోన్‌ల అసమతుల్యత వలన ఏర్పడే ఇలాంటి వ్యాధులను హోమియోపతి మెడిసిన్ ద్వారా పూర్తిగా నయం చేయవచ్చు. రోగికి సరిపడిన కాన్స్టిట్యూషనల్ చికిత్సను అందించటం వలన ఎలాంటి సైడ్ ఎఫెక్ట్స్ లేకుండా దీనిని పూర్తిగా నయం చేయడమే కాకుండా, ఎలాంటి కాంప్లికేషన్‌లు ఉన్నా వాటిని తప్పక తగ్గించవచ్చు. యుక్తవయస్సులోనే దీనికి సరైన చికిత్సను తీసుకోవడం వలన ఇన్‌ఫెర్టిలిటీ, ఒబేసిటీ వంటి కాంప్లికేషన్‌ల నుండి మనల్ని మనం కాపాడుకోవచ్చు. 'హోమియోకేర్'ను సంప్రదించింది మొదలు, రోగి యొక్క శరీర తత్వాన్ని బట్టి 'జెనెటిక్ కాన్స్టిట్యూషనల్ సిమిలిమం' విధానం ద్వారా హార్మోన్ వ్యవస్థను పరిపుష్టం చేసి, ఎటువంటి దుష్ఫలితాలు లేకుండా శాశ్వతంగా పీ.సీ.ఓ.డి. సమస్యను దూరం చేయటం జరుగుతుంది. ఇప్పటివరకు పీ.సీ.ఓ.డి. సమస్య నివారణకై 'హోమియోకేర్' చికిత్సలు పొందిన వారిలో దాదాపు 94% మందికి పైగా పేషెంట్లు సత్ఫలితాలు పొందడం జరిగింది. ఇటీవలే పూర్తయిన పరిశోధనల వలన తెలిసిన విషయం ఏమిటంటే పీ.సీ.ఓ.డి. సమస్య నివారణ నిమిత్తం, ఇతర వైద్య విధానాలలో అందించే ట్రీట్‌మెంట్ – ఓరల్ కాంట్రాసెప్టివ్ పిల్స్, హార్మోన్ ట్రీట్‌మెంట్, యాంటీ డయాబెటిక్ మందులతో 60–70 శాతం మెరుగైన ఫలితాలు మాత్రమే వచ్చాయి. ఇంతకన్నా అధికశాతం మేరకు సత్ఫలితాలను రాబట్టడం ద్వారా హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ వైద్యవిధానం – PCOD నివారణకు మెరుగైనదని మరియు సులభమైనదని నిరూపించబడినది.

# పెదనాన్న నవ్వు

–ఆదూరి వెంకట సీతారామమూర్తి

**పోస్టుమేన్ కార్డు ఇచ్చి వెళ్ళాడు.**

**అశుభవార్త! మొన్న పౌర్ణమినాడు పెదనాన్న పోయారు. రేపు నాలుగవ తేదీన పదో రోజు.**

**ఎప్పుడో ఒకప్పుడు ఇటువంటి వార్త వస్తుందని తెలుసు. ఎనభైఏళ్ళు దాటినవాడు. ఆరోగ్యమూ అంతంత మాత్రమే. అయితే మాత్రం? ఆయన పోవడం వెలితే అన్పించింది. కళ్ళంట నీళ్ళు రాలేదు. మనసు మాత్రం మొద్దుబారి పోయింది. విషయం తెలుసుకున్న సుగుణ 'మనకి పక్షిణీ ఉంటుంది. ముందు తలారా స్నానంచేసి రండి' అంటూ లేవదీసింది.**



ఎక్కడో కొన్నివందలమైళ్ళ దూరంలోవున్న ఊళ్లో పెదనాన్నపోతే ఇక్కడ మాకు మైల ఏమిటి?

పరుపులూ, బీరువాల్లో బట్టలూ, ఊరగాయలూ ముట్టుకోవడానికి వీల్లేదు.

పూర్వం దగ్గర బంధువులు పోతే ఆ విచారంలో వాళ్ళుంటే, వారిని కదిలించడం ఇష్టంలేక వారితో ముభావంగా ఉండి దూరంగా తప్పుకొని పోయేవారేమో! అలా ఆ కుటుంబ సభ్యులకు దూరంగా ఉండడం ఇప్పుడిలా మైలకింద మారిందేమోనని నాకు అనిపిస్తూ ఉంటుంది. కాకపోతే ముట్టుకుంటే ఏమయ్యిందీ?

నా ఆలోచనలు ఎలావున్నా సుగుణ ఛాదస్తం సుగుణది. అది ఛాదస్తం కాదట. శుభ్రతట. ధర్మోద కాలకి తప్పకుండా వెళ్ళాలంది.

నేను రాను, కావలిస్తే మీరు వెళ్ళండి అన్నాను.

ఈ నాలుగు రోజులూ నా కళ్ళల్లోనూ మనసులోనూ పెదనాన్నే మెదులుతున్నారు. ఆయన రూపే చాలా రకాలుగా కనిపిస్తోంది.

***

మనిషి జీవితం ఎంత చిత్రమైనదీ! జీవితాన్ని నదితో పోలుస్తారు. ఎక్కడో పుట్టి ప్రవాహమై ఎక్కడెక్కడో ప్రవహించి ఎన్నో వంపులు తిరిగి ఎన్నిటినో కలుపుకుంటూ చివరికి ఏ సముద్రంలోనో కలిసి పోవడం.

పెదనాన్న జీవితాన్ని నేను చూసింది తక్కువే అయినా గుర్తుండిపోయే చిత్రమైన కథ అని పిస్తుంది.

తాతగారి ఆబ్దికాలకి నాన్నగారితోపాటు పెదనాన్న గారింటికి వెళ్ళడం చెరువులో స్నానాలు, పెద్దచెరువు గట్టునా, గోర్జీలోనూ ఆటలు... సాయంకాలాలు ఆరుబయట లేత వెన్నెల్లో కూర్చుని అన్నాలు తినడం అన్నీ జ్ఞాపకమే!

చీకటిపడ్డాక ఇల్లు చేరేవారు పెదనాన్న. చేసేది వ్యవసాయం. ఏ వేళప్పుడు వచ్చినా పెరట్లో నూతి దగ్గర ఓ పాతిక బాల్చీల నీళ్ళతో స్నానంచేసి పొందూరు ఖద్దరు లుంగీ కట్టుకుని వచ్చి తీరికగా అందర్నీ నవ్వుతూ పలకరించేవారు. దొడ్డమ్మ ఆయన కోసం వెండి కంచంలో వేడివేడి భోజనం వడ్డించేది.

మేం ఉదయం లేచేసరికి ఆయన పొలానికి వెళ్ళిపోయేవారు. లేత సూర్యకిరణాలు శరీరాన్ని తాకుతుంటే ఆ పచ్చిగాలి పీలుస్తూ పొలాలగట్ల వెంట తిరగడం ఎంత బాగుంటుందో మీ పట్నవాసం వాళ్ళకి తెలీదురా అనేవారు. పదకొండు గంటల ప్రాంతంలో తిరిగొచ్చి, స్నానం చేసి భోజనానికి కూర్చునేవారు. శారీరక శ్రమకు తగ్గ బలమైన ఆహారం తీసుకునేవారు. ముద్దపప్పు, కూర, ముక్కలపులుసు, పచ్చడి... తియ్యటి పెరుగు పెరుగన్నంలో పేరిన నెయ్యి, పంచదార కలిపి నంజుకునే వారు. అదీ ఆయన ప్రత్యేకత!

మధ్యాహ్నం కాస్సేపు నిద్ర. మళ్ళీ పొలం.

ఒకమారు నన్నూ పొలానికి తీసుకెళ్ళారు. నాలుగుమైళ్ళు నడక. ఆయన పాంకోళ్ళతో పొలం గట్లంట నడుస్తుంటే నేను అందుకోలేకపోయేవాణ్ణి.

చుట్టూ ఆకుపచ్చని పొలాలు. పల్చటి సూర్యకాంతి. స్వచ్ఛమైన చల్లటిగాలి, పొలానికి ఆనుకుని కళ్ళం, అందులో విశ్రాంతి తీసుకునేందుకో నులకమంచం, మూలనకుండతో మంచినీళ్లు... ఆ వాతావరణమే కొత్తగా, హాయిగా, అందంగా అనిపించేది. ఆ బాల్యస్మృతి ఇప్పటికీ నా మనసుపొరల్లో పచ్చగా, వెచ్చగా, అంతే అందంగా ఉండిపోయింది.

ఒకసారి వేసవి సెలవుల్లో వెళ్ళినప్పుడు పొలంలో తాటికాయలు కొట్టించి ముంజలు ఒలిపించిపెట్టారు. ముంజలు ఒలవని తాటికాయల్ని ఎలా తినాలో నేర్పారు. మరోమారు చెరుకు గాను గాడే సీజన్లో బెల్లం గట్టిపడే ముందు వేడివేడి ఆ తీపిపాకం ఆకుడొప్పల్లో పోసి ఇచ్చారు. దాని రుచే రుచి. బంగారు తీగ చెరుకు గడలకు లోటేలేదు. ఆయన వాటిని ముక్కలు చేయకుండానే అవలీలగా వలుచుకు తినేవారు!

కాయకష్టం చేసిన శరీరం ఆయనది. పుష్టిగా తినేవారు. దొడ్డమ్మ ఆయన పోషణ బాగానే చూసేది.

నాన్నగారి ఉద్యోగంలో ట్రాన్స్ఫర్లు తప్పనిసరి. చదువు, దూరాభారం. నాలుగైదేళ్ళు పెదనాన్న ఇంటికి వెళ్ళనేలేదు. స్కూల్ ఫైనల్ పూర్తయ్యాక సెలవుల్లో వెళితే, ఏదోమార్పు. అదే ఇల్లు, అవే పరిస రాలు, మనుషులూ వారే! కానీ ఏదో మార్పు కొట్టొచ్చినట్టు, పరిసరాలు పాతవిగా, మనుషులు శక్తిహీనంగా... ఎక్కడుంది లోపం?

రెండు రోజులకంటే ఎక్కువ ఉండలేకపోయాను.

ఆ మరుసటి సంవత్సరం దొడ్డమ్మ పోయింది. అప్పటికి పెదనాన్న వయసు యాభైదాటి ఉంటుందేమో. ఈశ్వర్‌కి పన్నెండేళ్ళు. లేటు సంతానం.

పెదనాన్న మళ్ళీ పెళ్ళి చేసుకోలేదు. ఈశ్వర్ వాళ్ళ మామయ్య దగ్గరకి పెంపకానికి వెళ్ళిపోయాడు. తలచెడిన చెల్లెలే పెదనాన్నకు వండిపెట్టేది.

జ్ఞాపకాలు సుళ్ళు తిరుగుతున్నాయి.

"ఇదంతా నీ పొలమేనా పెదనాన్నా?" అడిగాను ఒకమారు వెళ్ళినప్పుడు.

నా వంక చూసి ఓ చిన్ననవ్వు నవ్వారు పెదనాన్న. పెద్దపెద్ద పండు మీసాల మధ్య నుంచి,

"కాదురా. ఇందులో పదోవంతున్నా నా జీవితం సజావుగా గడిచిపోతుంది. మనం వ్యవసాయం చేస్తాం. పంటలో కొంత భాగం వస్తుంది. అంతే?" అన్నారాయన.

**అతడిలో జ్ఞాపకాల సుళ్ళు. బలమైన దేహంతో పొలంగట్లంట తిరుగుతూ శ్రమచేసే పెదనాన్న ఎంత గొప్పవారు. ఆ ఊరెళ్ళినప్పుడల్లా పొలంగట్లపై విహారం, పచ్చని పైరగాలిలో కేరింతలూ, ఆటలూ, చెరకు గానుగలో తీపిబెల్లం పాకం ఆకుడొప్పల్లో వేసుకుని ఆస్వాదించిన అనుభవాలూ ఇప్పటికీ అతన్ని పులకరింపజేస్తాయి. అంతలోనే ఎంత మార్పు? పెదనాన్న జీవితం చూస్తుండగానే ఎందుకు మసకబారిపోయింది?**

ఇంటికి తిరిగి వచ్చేటప్పుడు తను చేస్తున్న ఆ పొలం ఎవరిదో ఆ షావుకారి ఇల్లు చూపించారు. మూడంతస్తుల మేడ. ఆయన పేరు బంగార్రాజట. చిన్నకారు రైతులకు అప్పులు కూడా ఇస్తారట. ఆ తర్వాత మరోమారు పెదనాన్న ఊరు వెళ్ళేసరికి, ఆ మేడలో సగమే మిగిలింది. సగభాగం కొత్తగా ఉంది. మరో అంతస్తు పెరిగింది. ఆ ఇంట్లో పెద్ద కారుంది.

"ఎంతకాలం పెదనాన్నా ఇలా? నువ్వూ ఓ పొలం కొనుక్కోరాదూ" అన్నాను. ఎప్పట్లానే పెదనాన్న నవ్వారు. 'అది మన తరమా' అన్నట్లు.

'తిండికీ బట్టకీ జరుగుబాటవుతోంది. చాలదా' అన్నారాయన.

నాన్నపోయాక ఆయన మరింత దగ్గరయ్యారు నాకు. డెబ్బై అయిదేళ్లు వచ్చేవరకూ అదే పొలం, అదే జీవితం. ఆ తర్వాత అనారోగ్యం. వ్యవసాయం చేయలేక, లాభసాటికాక ఎవరి మాటసాయంతోనో బ్యాంక్ లోను తీసుకుని బండీ, ఎడ్లూ కొన్నారు. బండి బాడుగకు తిప్పితే ఆ వచ్చే డబ్బుతో ఇల్లు గడిచేది. కానీ ఈలోగా ఎద్దు చచ్చింది. బ్యాంక్ వడ్డీ భారమైంది.

ఉద్యోగంలో చిక్కులు, బదిలీలూ... మరో రెండేళ్ళకి గానీ పెదనాన్న దగ్గరకు వెళ్ళలేక పోయాను వెళ్ళానే గానీ, అక్కడి పరిస్థితులు నన్ను కలవరపెట్టాయి. పచ్చడిమెతుకులు, నీళ్ళ మజ్జిగతో ఆయన చేసే భోజనం చూడలేకపోయాను.

అక్కడున్న పెద్ద డాక్టరుకు ఆయన్ను చూపించి అవసరమైన అన్ని పరీక్షలూ చేయించాను.

'గట్టి శరీరమే. కానీ వయసు వచ్చిందికదా, ఇటువంటివి తప్పవు' అంటూ తేల్చేశారు డాక్టరు.

కొన్నాళ్ళపాటు సరిపోయే బలానికి మందులూ, కొంతపైకం ఇచ్చి తిరిగి వచ్చేశాను.

పెదనాన్నకున్న జబ్బేమిటో ఇప్పుడు తెలిసింది.

పేదరికం, పౌష్టికాహార లోపం!

ఒక్క పెద్దనాన్నేకాదు పల్లెల్లో స్వంతభూమి లేక వ్యవసాయ పనులు చేసుకొని బతికే వారందరి పరిస్థితీ అదే. ఇన్నికోట్ల జనాభా, ఇంత విస్తీర్ణమైన భూమి, జీవనదులూ ఉన్న అన్నపూర్ణలాంటి దేశంలో తిండి గింజలు పండించే రైతుల జీవన పరిస్థితి ఇంతేనా?

ప్రభుత్వాలు మారుతున్నాయి.

కానీ రైతుల స్థితిగతుల్లో మార్పు కన్పించటంలేదు.

ఎన్నాళ్ళిలా?

నా ప్రశ్న వెనుక పెదనాన్న పేలవమైన చిరునవ్వే లీలగా కనిపించింది.

**సెల్:94419 40653**



## అప్పుడలా చేయకుండా ఉండాల్సిందట!

'ఒక పొరపాటుకు యుగములు వగచేవు' అన్నాడో సినీ కవి. సరిగ్గా ఇలాగే బాధపడుతోంది శ్రీలంక బ్యూటీ జాక్వెలిన్ ఫెర్నాండెజ్. పద్నాలుగు సంవత్సరాల వయస్సులోనే బాయ్‌ఫ్రెండ్‌తో లిప్‌లాక్ చేసిందట! ఆ తరువాత అతనితో బ్రేకప్ అయిందట! ఇదంతా తెలిసీ తెలియని వయస్సులో జరిగిందనీ, అప్పుడు తనకు ఏమీ తెలియదనీ అంటోంది. ఇప్పుడు అవన్నీ గుర్తుకొస్తుంటే అలా చేయకుండా ఉండి ఉంటే బాగుండేదని అనిపిస్తోందని ఇటీవల ఓ ఇంటర్వ్యూలో చెప్పుకొచ్చింది. ఈ ఇంటర్వ్యూలో చిన్ననాటి డేటింగ్ గురించి చెప్పిందే తప్ప ప్రస్తుత డేటింగుల గురించి మాట్లాడలేదు.

# సౌభాగ్య చక్రం

మార్చి 8 నుంచి
మార్చి 14 వరకు

శ్రీ బిజుమళ్ళ బిందుమాధవశర్మ



### మేషం (మార్చి 21 - ఏప్రిల్ 20 మధ్య పుట్టినవారు)

వేడుకలు, విద్యా విషయాలు, సమావేశాలు, ప్రయాణాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధవారం వేడుకలకు ఏర్పాట్లు చేస్తారు. గృహారంభ, ప్రవేశాలకు అనుకూలం. 9, 10 తేదీల్లో విద్యార్థులకు శుభప్రదం. చిన్నారుల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. 11, 12, 13 తేదీల్లో ఆరోగ్యం పట్ల దృష్టి సారించాలి. వృత్తి, వ్యాపారాల్లో లక్ష్య సాధనకు గత అనుభవం తోడ్పడుతుంది. వైద్యం, పరిశ్రమలు, వ్యవసాయ రంగాల వారికి ప్రోత్సాహకరం. 14న బంధుమిత్రులతో వేడుకల్లో పాల్గొంటారు. రాజకీయ, సినీరంగాల వారికి శుభప్రదం. కొత్త పరిచయాలు లాభిస్తాయి.



### వృషభం (ఏప్రిల్ 21 - మే 21 మధ్య పుట్టినవారు)

బదిలీలు, ఆర్థిక విషయాలు, వృత్తి, వ్యాపారాలు, వేడుకలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధవారం విద్యా సంస్థలతో పనులు పూర్తవుతాయి. బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. 9, 10 తేదీల్లో వేడుకల్లో పాల్గొంటారు. రియల్ ఎస్టేట్, నిర్మాణరంగాల వారు ఆర్థిక విషయాల్లో నిదానం పాటించాలి. 11, 12, 13 తేదీల్లో ఖర్చులు అంచనాలు మించుతాయి. చిన్నారులు, ప్రియతముల విషయంలో శుభపరిణామాలు సంభవం. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. 14న వృత్తి, వ్యాపారాల్లో అదనపు ఆదాయం అందుకుంటారు. బంధుమిత్రులతో వేడుకల్లో పాల్గొంటారు.



### మిథునం (మే 22 - జూన్ 21 మధ్య పుట్టినవారు)

వృత్తి, వ్యాపారాలు, ఆరోగ్యం, వేడుకలు, ఆర్థిక విషయాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం అదనపు ఆదాయం సమకూరుతుంది. ఆర్థిక విషయాల్లో పెద్దలు తోడ్పడతారు. 9, 10 తేదీల్లో ఉద్యోగ వ్యాపారాలకు సంబంధించిన ఒక సమాచారం కలవరపెడుతుంది. వాగ్వాదాలకు దూరంగా ఉండాలి. 11, 12, 13 తేదీల్లో బదిలీలు, మార్పులు కొంత అసౌకర్యం కలిగిస్తాయి. ఉన్నత పదవులు అందుకుంటారు. కుటుంబ వ్యవహారాల్లో శుభపరిణామాలు సంభవం. 14న వృత్తి, వ్యాపారాల్లో సృజనాత్మకంగా వ్యవహరిస్తారు. చిన్నారుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం.



### కర్కాటకం (జూన్ 22 - జులై 22 మధ్య పుట్టినవారు)

చిన్నారులు, విద్య, బదిలీలు, వృత్తి వ్యాపారాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధవారం సమావేశాల్లో కీలకపాత్ర పోషిస్తారు. సంకల్పం నెరవేరుతుంది. 9, 10 తేదీల్లో ఆర్థిక వ్యవహారాల్లో ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. విద్య, ప్రయాణాలకు అవసరమైన నిధులు సర్దుబాటవుతాయి. 11, 12, 13 తేదీల్లో ప్రయాణాలు, చర్చల్లో నిదానం పాటించండి. కాంట్రాక్టులు, అగ్రిమెంట్లు లాభిస్తాయి. శుభవార్త అందుకుంటారు. 14న బంధుమిత్రులను కలుసుకుంటారు. కుటుంబ వ్యవహారాల్లో శుభపరిణామాలు సంభవం.



### సింహం (జులై 23 - ఆగస్టు 23 మధ్య పుట్టినవారు)

బదిలీలు, రియల్ ఎస్టేట్, ఆర్థిక వ్యవహారాలు, వేడుకలపై ఈ వారం శ్రద్ధ పెడతారు. బుధవారం రాజకీయ, సినీరంగాల వారికి ఆర్థికంగా లాభిస్తుంది. ఆధ్యాత్మిక కార్యక్రమాలు ఊరటనిస్తాయి. 9, 10 తేదీల్లో సంస్మరణల్లో పాల్గొంటారు. వాయిదా పద్ధతులపై వస్తువులు కొనుగోలు చేస్తారు. రుణ ప్రయత్నాలు ఫలించకపోవచ్చు. 11, 12, 13 తేదీల్లో ఖర్చులు అంచనాలు మించే అవకాశం ఉంది. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. పెట్టుబడులు లాభిస్తాయి. 14న స్టేషనరీ, రవాణా, బోధన, పర్యాటకరంగాల వారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం.



### కన్య (ఆగస్టు 24 - సెప్టెంబర్ 22 మధ్య పుట్టినవారు)

కుటుంబ వ్యవహారాలు, స్పెక్యులేషన్లు, పెట్టుబడులపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం వేడుకల్లో పాల్గొంటారు. స్పెక్యులేషన్లు లాభిస్తాయి. 9, 10 తేదీల్లో బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. ప్రత్యర్థులపై ఒక కన్నేసి ఉంచండి. ప్రియతములకు సంబంధించి ఒక సమాచారం కలవరపెడుతుంది. 11, 12, 13 తేదీల్లో పందాలు, పోటీలకు దూరంగా ఉండాలి. శ్రీవారు, శ్రీమతి విషయాల్లో శుభపరిణామాలు సంభవం. 14న ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం.



### తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 23 మధ్య పుట్టినవారు)

ఇంటర్వ్యూలు, ప్రేమానుబంధాలు, స్పెక్యులేషన్లపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహకరం. పెద్దల ఆరోగ్యం మెరుగుపడుతుంది. 9, 10 తేదీల్లో వృత్తిపరమైన సమావేశాలు సత్ఫలితాలనిస్తాయి. హోటల్, వైద్యం, రిటైల్ రంగాల వారు ఆర్థిక విషయాల్లో నిదానం పాటించాలి. 11, 12, 13 తేదీల్లో వృత్తి, వ్యాపారాలకు సంబంధించిన ఒక సమాచారం ఆందోళన కలిగిస్తుంది. ఆరోగ్యం మెరుగుపడుతుంది. గత అనుభవంతో లక్ష్యాలు సాధిస్తారు. 14న కొత్త పనుల ప్రారంభానికి అనుకూలం. వృత్తి, వ్యాపారాల్లో ఉత్సాహంగా ఉంటుంది.



### వృశ్చికం (అక్టోబర్ 24 - నవంబర్ 22 మధ్య పుట్టినవారు)

చిన్నారులు, పొదుపు పథకాలు, విద్యా విషయాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధవారం విద్యార్థులకు శుభప్రదం. సంకల్పం నెరవేరుతుంది. 9, 10 తేదీల్లో చిన్నారుల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. వృత్తి, వ్యాపారాల్లో సృజనాత్మకంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. 11, 12, 13 తేదీల్లో ఖర్చులు అధికం. పెట్టుబడులు లాభిస్తాయి. ప్రియతముల వైఖరి ఉల్లాసం కలిగిస్తుంది. 14న దూరంలో ఉన్న ప్రియతముల కలయిక ఆనందం కలిగిస్తుంది. రాజకీయ, సినీ రంగాల వారికి శుభప్రదం.



### ధనుస్సు (నవంబర్ 23 - డిసెంబర్ 21 మధ్య పుట్టినవారు)

ఇల్లు, విద్య, వేడుకలు, ప్రేమానుబంధాలకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధవారం ఆర్థిక విషయాల్లో మీ వైఖరి సమీక్షించుకుంటారు. సంస్మరణల్లో పాల్గొంటారు. 9, 10 తేదీల్లో గృహారంభ ప్రవేశాలకు అనుకూలం. సమావేశాలు, వేడుకలకు ఏర్పాట్లలో కొంత అసౌకర్యం కలుగుతుంది. 11, 12, 13 తేదీల్లో సమావేశాల్లో నిదానం పాటించండి. బదిలీలకు అనుకూలం. పైఅధికారుల వైఖరి ఆనందం కలిగిస్తుంది. 14న వేడుకల్లో పాల్గొంటారు. ప్రముఖులను కలుసుకుంటారు. వృత్తి, వ్యాపారాల్లో మార్పులకు అనుకూలం. పెట్టుబడులు లాభిస్తాయి.



### మకరం (డిసెంబర్ 22 - జనవరి 20 మధ్య పుట్టినవారు)

విద్య, పెట్టుబడులు, బదిలీలు, నిర్మాణాలకు ఈ వారం ప్రాధాన్యమిస్తారు. బుధవారం 9, 10 తేదీల్లో పెట్టుబడులకు సంబంధించిన నిర్ణయాల్లో నిదానం అవసరం. విలువైన పత్రాలు అందుకుంటారు. ఆర్థిక విషయాల్లో సన్నిహితుల సహకారం అందుతుంది. 11, 12, 13 తేదీల్లో పెట్టుబడులకు సంబంధించిన చర్చలు, సమావేశాల్లో నిదానం పాటించండి. విద్యార్థులకు అవసరమైన నిధులు సర్దుబాటవుతాయి. 14న ఇంట్లో సందడి వాతావరణం నెలకొంటుంది. ఇంటర్వ్యూలలో విజయం సాధిస్తారు. ప్రముఖులతో సమావేశాలు ఫలిస్తాయి.



### కుంభం (జనవరి 21 - ఫిబ్రవరి 18 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, సోదరీసోదరుల వ్యవహారాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం వృత్తి, వ్యాపారాల్లో అదనపు ఆదాయం సమకూరుతుంది. 9, 10 తేదీల్లో స్పెక్యులేషన్లలో నిదానం పాటించాలి. ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. 11, 12, 13 తేదీల్లో పందాలు, పోటీలకు దూరంగా ఉండాలి. పెట్టుబడులు లాభిస్తాయి. రుణప్రయత్నాలు సఫలం అవుతాయి. 14న ఆర్థిక వ్యవహారాలకు సంబంధించి కొత్త వ్యూహాలు అమలు చేస్తారు. పెట్టుబడులకు సంబంధించిన చర్చలు ఫలిస్తాయి. రుణాలు మంజూరవుతాయి.



### మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20 మధ్య పుట్టినవారు)

వృత్తి, వ్యాపారాలు పెట్టుబడులపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం ప్రేమానుబంధాలు బలపడతాయి. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. 9, 10 తేదీల్లో ఆరోగ్యం పట్ల శ్రద్ధ వహించాలి. వృత్తి, వ్యాపారాల్లో సన్నిహితుల సహకారంతో లక్ష్యాలు సాధిస్తారు. 11, 12, 13 తేదీల్లో శ్రీవారు, శ్రీమతి విషయాల్లో కీలక నిర్ణయాలు తీసుకుంటారు. వేడుకల్లో పాల్గొంటారు. పందాలు, పోటీలకు దూరంగా ఉండాలి. 14న వేడుకలు, సంస్మరణల్లో పాల్గొంటారు. వైద్యం కోసం అవసరమైన నిధులు సర్దుబాటవుతాయి. పెట్టుబడులు లాభిస్తాయి.

నవ్య




# ప్రమాదంలో శ్రీదేవి?



అతిలోక సుందరి అన్న బిరుదును చివరిదాకా నిలుపుకోవాలన్న తపనే శ్రీదేవిని ప్రమాదంలోకి నెడుతోంది అంటున్నారు బాలీవుడ్ జనాలు. కూతుళ్లతో సమానంగా అందంగా కనిపించడానికి శ్రీదేవి పడుతున్న పాట్లు అన్నీ ఇన్నీ కావట! ఖరీదైన కాస్మోటిక్స్ ప్రతి రోజూ వాడుతోందట! వయస్సు మీదపడుతున్న వారు సౌందర్య ఉత్పత్తులు వాడే సమయంలో కొంచెం సంయమనం పాటించాలి.

కానీ శ్రీదేవి అవేవీ పాటించడం లేదట! ఎంత సేపూ అందంగా కనిపించాలనే తపనతప్ప స్కిన్ గురించిన ఆలోచన లేకుండా పోతోందట! దాంతో త్వరలోనే శ్రీదేవి చర్మసంబంధ సమస్యలు ఎదుర్కో వచ్చు అంటున్నారు. శ్రీదేవి ఇదే పద్ధతి కొనసాగిస్తే అతిలోక సుందరి అన్న బిరుదును శాశ్వతంగా మరిచిపోవాల్సి వస్తుందని వారు హెచ్చరిస్తున్నారు. మీద పడుతున్న వయస్సును దృష్టిలో పెట్టుకొని కొద్దిపాటి మేకప్‌తో హుందాగా కనిపిస్తే బాగుంటుందని వారు సూచిస్తున్నారు.

## వర్మకి కష్టకాలం?

నిత్యం తన ట్వీట్లతో ఎదుటి వారికి చుక్కలు చూపించే రామ్‌గోపాల్‌వర్మకు కష్టకాలం మొదలైందని అంటున్నారు బాలీవుడ్ జనాలు. అదేమంటే....వర్మ ఎక్కువగా వ్యక్తుల జీవితగాథలను సినిమాగా తీస్తుంటాడు. అలా తీసే సమయంలో కొన్ని సందర్భాలలో వ్యక్తుల జీవితంలో జరిగిన నిజ సంఘటనలు మరుగున పడుతుంటాయి. మరికొన్నింటిని వక్రీకరించడం కూడా జరుగుతుంది. ఇలాంటి ఇబ్బందులు ఇక ముందు తలెత్తకుండా ఉండేందుకు ఆయా వ్యక్తుల నుంచి నో అబ్జెక్షన్ సర్టిఫికెట్ తీసుకోవాలని కేంద్రం, ఫిలింబోర్డులు తాజాగా షరతు విధించాయి. ఈ షరతు వర్మకు కచ్చితంగా తలనొప్పిని తీసుకొస్తుంది అంటున్నారు.



## చిన్న సినిమాల వైపు క్రిష్ చూపు?

చిన్న సినిమాలకి దర్శకత్వం వహించడం కాదు. సినిమాలు నిర్మిస్తాడట! 'శాతకర్ణి' సక్సెస్ తరువాత పెద్ద సినిమాలు ఎంత రిస్కో క్రిష్‌కి అర్థమైంది అంటున్నారు సినీజనాలు. ఓ పెద్ద సినిమా బ్లాక్‌బస్టర్ అయినా నిర్మాతకు పది కోట్లకు మించి లాభం రాదు. అదే చిన్న




సినిమా అయితే కనీసం పది నుంచి పదిహేను కోట్లు లాభం వచ్చే అవకాశం ఉంది. ఈ సూత్రాన్ని వంటపట్టించుకున్న క్రిష్ త్వరలోనే ఓ చిన్న సినిమా నిర్మించే ప్రయత్నాల్లో ఉన్నాడట! కొత్త దర్శకులు మంచి కథతో వస్తే వెంటనే నిర్మాణం మొదలు పెడతాను అంటున్నాడు. ఈ విషయంలో క్రిష్ బహుశా మారుతిని ఆదర్శంగా తీసుకొని ఉంటాడని కొందరు చెబుతున్నారు.



## జూ.మీనా మీద ప్రశంసల జల్లు!

నటులు, నటీమణులు తమ వారసులను తెర మీదకు తీసుకొస్తుండడం కొత్తేమీ కాదు. కాకపోతే వారికి ఓ వయస్సు వచ్చిన తరువాత హీరో లేదా హీరోయిన్లుగా పరిచయం చేస్తుంటారు. కానీ మీనా మాత్రం తనలాగే తన కూతురిని కూడా బాలనటిగా తెరకు పరిచయం చేసింది. ఈ చిన్నారి పేరు నైనిక. నైనిక తొలిసారి తమిళ సినిమాలో హీరో విజయ్ కూతురిగా నటించింది. ఈ సినిమాలో నైనిక మొత్తం 40 సీన్లలో నటించింది. ఈ సీన్లన్నింటిలో నైనిక చాలా బాగా నటించిందని తమిళ తంబీలు ఈ చిన్నారిని తెగ మెచ్చుకుంటున్నారు. తన వారసురాలికి వస్తున్న ప్రశంసలు చూసి మీనా తెగ మురిసిపోతోందట! వెండితెరకు జూనియర్ మీనా దొరికిందని అంటున్నారు.



**మా**మూలుగా హీరోయిన్లు సినిమాలు చేయడానికే ఇష్టపడతారు కానీ... నిర్మించడానికీ, రిస్క్ తీసుకోవడానికీ ఇష్టపడరు. అలాంటిది పట్టుమని మూడు పదులు కూడా నిండకుండానే హీరోయిన్ అనుష్క శర్మ నిర్మాతగా మారింది. హీరోయిన్‌గా ఎంత సక్సెస్‌ని అందుకుందో నిర్మాతగా కూడా అంతే విజయం సాధించింది. తను నిర్మాతగా మారడం వెనుక ఎవరి ప్రమేయం లేదని, తనంతట తానే నిర్మాతగా మారానని అంటోంది. తను నిర్మాతగా ఎందుకు మారాల్సి వచ్చిందో ఆమె మాటల్లోనే...

# నిర్మాతగా మారింది అందుకే

## -అనుష్క శర్మ

**నిర్మాతగా మారడానికి కారణం?**

హీరోయిన్‌గా నాకు కొన్ని పరిమితులు ఉంటాయి. కొన్ని సార్లు మనసుకు నచ్చిన కథలు రావు. అయినా కాంప్రమైజ్ కావాల్సి వచ్చేది. అలాంటప్పుడు చాలా బాధ అనిపించేది. నిర్మాత అయితే నాకు నచ్చిన కథతో సినిమా తీయొచ్చుగా అనిపించింది. నేను నిర్మాతగా మారడానికి ప్రధాన కారణం అదే! నాకు సినిమాలు లేక నిర్మాతనయ్యానని చాలా మంది విమర్శించారు. ఎవరేమనుకున్నా నేను ఎందుకు సినిమాలు తీస్తున్నానో నాకు తెలుసు. ఈ విషయంలో ఎవరేమనుకున్నా పట్టించుకోద లుచుకోలేదు. నా మనసుకు నచ్చిన దారిలో వెడతానేతప్ప ఎవరికోసమో నా దారినీ, నా ప్రవర్తననూ మార్చుకోను.

**మీ కొత్త సినిమా 'ఫిల్లౌరి' గురించి**

ఇది ఆత్మల నేపథ్యంలో జరిగే కథ. ఓ యువకుడికి వివాహం కుదురుతుంది. కానీ అతడికున్న దోషం కారణంగా ఓ చెట్టుతో పెళ్ళి జరిపిస్తే ఆ దోషం పోతుందని చెబుతారు. అలాగే ఓ చెట్టుతో ఆ యువకుడికి పెళ్ళి జరుగు తుంది. ఆ చెట్టు మీద ఓ ఆత్మ నివసిస్తూ ఉంటుంది. చెట్టుతో పెళ్ళి జరిగినప్పటి నుంచీ ఆ ఆత్మ ఆ యువకుడితో మాట్లాడడం మొదలెడు తుంది. ఆ ఆత్మ తన గతం అంతా ఆ యువకు డికి చెప్పడం, దానికి ఆ యువకుడు స్పందిం చడం... ఈ నేపథ్యంలో సాగే కథ ఇది. ఆత్మ అనగానే సాధారణంగా భయపడతారు, అది మనకు ఎలాంటి హాని చేస్తుందో అని! కానీ 'ఫిల్లౌరి' సినిమాలో ఆత్మ ఎలాంటి హానీ చేయదు. చాలా ఫ్రెండ్లీగా ఉంటుంది. ఈ సిని మాలో ఆత్మగా నేను చేశాను. ఆ ఆత్మ ఆ యువకుడి ద్వారా తను అనుకున్నది సాధించిందా? అన్నది వెండితెర మీద చూడాల్సిందే!

**నటిగా కన్నా నిర్మాతగానే ఎక్కువ ప్రయోగాలు చేస్తున్నట్టున్నారు?**

వాటికోసమే కదా నిర్మాతగా మారాను. ఒకే మూసలో పోసినట్టు ఉండే కథలు నాకు నచ్చవు. వెరైటీ కథతో వస్తే ఏ రైటర్ కథ అయినా తీసుకుం టాను. ఈ విషయంలో రైటర్లని టార్చర్ పెడతానని కొందరు అంటూంటారు. కానీ మంచి సినిమా





తీయాలన్న ఉద్దేశమే తప్ప రైటర్లను ఇబ్బంది పెట్టాలని నాకు ఉండదు. ప్రతిరోజూ చాలా మంది కథలు చెప్పడానికి వస్తూంటారు. అందరి కథలు వినాలంటే కష్టం కదా! నాకు ఎలాంటి కథ కావాలో ముందే వాళ్లకి చెప్పేస్తాను.

**హాలీవుడ్‌కి వెళ్లే ఉద్దేశం ఉందా?**

అక్కడ సినిమాలు చేయాలన్న ఆలోచన లేదు. ఇక్కడ నాకు బాగుంది. నటిగా, నిర్మాతగా ఫుల్ హ్యాపీ. నచ్చిన కథ దొరికితే అక్కడ సినిమా చేయడం గురించి ఆలోచిస్తాను

**ఇక్కడ హ్యాపీగా లేనివాళ్లే అక్కడ సినిమాలు చేస్తున్నారా?**

ఏ భాషలో చేసినా నటిగా సంతృప్తి పొందడం ముఖ్యం. హాలీవుడ్‌లో సినిమాలు చేస్తూ సక్సెస్ సాధిస్తున్న దీపికా, ప్రియాంకలకు హేట్సాఫ్ చెప్పాల్సిందే! ప్రపంచవ్యాప్తంగా వాళ్లు తమ సత్తాను చాటుతున్నారు. వారి పేరుతో పాటు భారతీయ సినిమా పేరు కూడా మారుమోగుతోంది. అందరికీ అది సాధ్యం కాదు. మరో భాషలో సక్సెస్ సాధించడం అంటే చాలా కష్టం. అంత కష్టమైన ఫీట్ చేయడం వారికి మాత్రమే సాధ్యమైంది.

**సినిమాల్లోకి వచ్చి ఎనిమిది సంవత్సరాలు పూర్తయినట్టున్నాయి?**

మొన్న డిసెంబర్‌కి ఎనిమిది సంవత్సరాలు పూర్తయ్యాయి.

**ఇన్ని సంవత్సరాల మీ ప్రయాణం గురించి...**

సక్సెస్ కన్నా ఫ్లాపులే ఎక్కువ పాఠాలు నేర్పుతాయి. తప్పులు మళ్లీ మళ్లీ చేయకుండా ఎలా ఉండాలో వాటి ద్వారానే తెలుసుకోగలుగుతాం. సక్సెస్ బాధ్యత పెంచుతుంది అంటారు కానీ, ఓవర్ కాన్ఫిడెన్స్ పెంచుతుంది. అది కొన్నిసార్లు మన చేత తప్పులు చేయిస్తుంది. నాకు కూడా అలాంటి అనుభవాలే ఎదురయ్యాయి. కానీ వెంటనే రియలైజ్ అవుతానే తప్ప ఒత్తిడికి గురయ్యి, డిప్రెషన్ లోకి వెళ్లను.

**ఈ ఎనిమిది సంవత్సరాలలో తక్కువ సినిమాలు చేయడానికి కారణం?**

'స్లో అండ్ స్టడీ' అన్నది నేను నమ్మిన సిద్ధాంతం. ఒకేసారి బోలెడన్ని సినిమాలు చేసేసి ఎక్కువ డబ్బు సంపాదించాలన్న కోరిక నాకు మొదటినుంచీ లేదు. నేను బాలీవుడ్‌కి వచ్చిన కొత్తల్లో చాలామంది ఎక్కువ సినిమాలు చేయి, ప్రేక్షకులకు తెర మీద ఎప్పుడూ కనిపిస్తూనే ఉండాలి. లేకపోతే అవకాశాలు రావు అని చెప్పారు. వారి మాటలు పట్టించుకుంటే అభద్రతాభావం పెరుగుతుందే తప్ప సంతోషంగా ఉండలేం. ఎవరెన్ని చెప్పినా నా మనస్సు చెప్పినట్టే నడుచుకుంటాను. నా ఎదుగుదలకు ఇదే కారణం కావచ్చు. ఇప్పటివరకూ చేసిన సినిమాలు సంతోషాన్నే కాదు సంతృప్తిని కూడా ఇచ్చాయి. నటిగా ఫుల్ హ్యాపీ! నా సినిమాలు వెంట వెంటనే విడుదల కాకపోయినా పెద్దగా బాధపడను.

**మీ మీద వచ్చే పుకార్ల గురించి...**

నా ప్రమేయం లేకుండానే వచ్చేస్తుంటాయి. నేను ఎవరితో ఏ ఏ పార్టీలకి వెళ్లాను? ఎవరెవరితో డ్యాన్స్ చేశాను? వాటిమీద రోజుకో గాసిప్ వస్తుంటుంది. నేను ఏమిటో నా కుటుంబానికి తెలుసు. నా సన్నిహితులకు తెలుసు. అలాంటప్పుడు ఇలాంటి పుకార్ల గురించి స్పందించాల్సిన అవసరం లేదు. వర్క్ విషయంలోనైనా, వ్యక్తిగత జీవితంలోనైనా నిజాయితీగా ఉంటాను. అనవసరంగా వ్యాపించే పుకార్ల గురించి పట్టించు కుని నా టైం వేస్ట్ చేసుకోను.

**షారూఖ్‌ఖాన్‌తో రెండోసారి చేస్తున్నట్టున్నారు?**

నా మొదటి సినిమా ఆయనతోనే చేశాను. ఇప్పుడు రెండోసారి చేస్తున్నాను. ఆయనతో మనసు విప్పి మాట్లాడే స్వాతంత్ర్యం నాకు ఉంది. ఆయన చాలా ఇంటెలిజెంట్. ఆయనలా ఆలోచించే వారు, మాట్లాడేవారు చాలా తక్కువ మంది ఉంటారు. ఏ విషయం గురించి అయినా లోతుగా ఆలోచిస్తారు. మంచి సలహా ఇస్తారు. కెరీర్ పరంగా లేదా సినిమా నిర్మాణ విషయంలో ఎలాంటి సందేహాలు వచ్చినా నేను కలిసే మొట్ట మొదటి వ్యక్తి ఆయనే.

**బాలీవుడ్‌లో మీకు పోటీ అని భావించే హీరోయిన్ల గురించి...**

నా పని వరకూ నేను చూసుకుంటాను. అంతే తప్ప ఎవరో నాకు పోటీ అనుకోను. మిగతా వారు ఏఏ సినిమాలు చేస్తున్నారో కూడా నేను పట్టించుకోను. ఎక్కడన్నా కలిస్తే అందరం సరదాగా మాట్లాడుకుంటాం. అంతే తప్ప వారి సినిమాల గురించి అస్సలు మాట్లాడను. ఇతరులతో పోటీ పడను. అలా పోటీ పడితే మనం చేరుకోవలసిన గమ్యం మరిచిపోతాం. ఎదుటి వారిని ఎలా క్రాస్ చెయ్యాలా? అని ఆలోచిస్తాం తప్ప మన గోల్ గురించి ఆలోచించం. అలాగని మిగతా హీరోయిన్ల సినిమాలు చూడనని కాదు. సమయం దొరికినప్పుడల్లా చూస్తూ ఉంటాను.

**స్వీయ నిర్మాణంలో వేరే హీరోయిన్లతో చేసే ఉద్దేశం ఉందా?**

ఇతర హీరోయిన్లతో సినిమా కచ్చితంగా చేస్తాను. నేను తీయబోయే సినిమాలో ఫలానా హీరోయిన్ అయితే బాగుంటుంది అనుకుంటే ఆ హీరోయిన్‌తోనే చేస్తాను. నా సినిమాల్లో నేనే హీరోయిన్‌గా ఉండాలన్న నియమం ఏమీ పెట్టుకోలేదు.

**మూగజీవాల కోసం హోం నిర్మిస్తున్నారట కదా?**

నిజమే! ఆ హోమ్ గురించి స్థలం కొని పెట్టాను. రోడ్డు పక్కన ఉండే మూగజీవాల కోసం, సిక్ అయి ఎవరూ పట్టించుకోని వాటి కోసం ఈ హోమ్ ఏర్పాటు చేస్తున్నాను. త్వరలోనే ఆ పనులు పూర్తవుతాయి. ఓ పక్క నటన, ఓ పక్క నిర్మాణ బాధ్యతలతో కాస్త ఆలస్యం అవుతోంది అంతే!

**బాలీవుడ్‌లో మిమ్మల్ని ఎక్కువగా ప్రభావితం చేసిన వ్యక్తి?**

ఐశ్వర్యారాయ్. తనతో 'యే దిల్ ముష్కిల్ హై' చేశాను. ఆ సినిమాలో తనతో నేను కనిపించే సీను ఒక్కటే ఉంటుంది. అయినా తనంటే చెప్పలేనంత గౌరవం కలిగింది. మనిషి ఎంత అందంగా ఉంటుందో వ్యక్తిత్వం కూడా అంతే అందంగా ఉంటుంది. అలాంటి వ్యక్తులు చాలా అరుదుగా ఉంటారు.

–చిన్ని

ఇంటర్వ్యూ

# తెలుగు భాషకు, తెలుగు పాటకు జీవనరాగం

# డా॥ రహమతుల్లా ఘంటసాల అవధానం

**ఘంటసాలపై అవధానమా? అంటూ ఆశ్చర్యపోతారు తెలియనివారెవరైనా !**
**మరుక్షణంలో మళ్ళీ ఆనందపరవశులైపోతారు .**
**ఇలాంటి కొత్త ఒరవడి అవధానానికి శ్రీకారం చుట్టారు డాక్టర్ ఎస్. రహమతుల్లా.**
**వృత్తిరీత్యా నెఫ్రాలజిస్ట్ . ప్రవృత్తిరీత్యా ఘంటసాల పరిశోధకుడు.**
**అంతకుమించి తెలుగు భాషాభిమాని. అంతే కాదు,**
**ఘంటసాల అవధానంలో జాతీయ రికార్డు స్థాపించారు రహమతుల్లా.**
**పుట్టింది ముస్లిం కుటుంబంలో అయినా, 'హే కృష్ణా ముకుందా.. మురారి.....' అంటూ చిన్నప్పుడే పాటలు పాడేవారు .**

**కుల, మత, ప్రాంతీయ తత్వాలు, భాషా భేదాలు వంటి సంకుచిత ధోరణులు పెచ్చరిల్లిన ఈ తరుణంలో , నిజమైన లౌకిక రాజ్యాంగ స్ఫూర్తితో విశాల భావాలకు అంకితమైన అవధాని రహమతుల్లా .**

**తెలుగు భాషను ప్రేమించిన సుబ్రమణ్య భారతి, శ్రీకృష్ణదేవరాయలు , సి. పి. బ్రౌన్ ఎవరో తెలియక పోయినా, వారిని తలుచుకోలేకపోయినా మన మధ్యవున్న ఇలాంటి మార్గదర్శిని మాత్రం గుర్తిద్దాం .**

**తెలుగు భాష, ఘంటసాల పాటే ఊపిరిగా అద్భుత ధారణశక్తి ప్రదర్శిస్తున్న రహమతుల్లా గురించి......**

ఆంధ్రప్రదేశ్ సరిహద్దుల్లోవున్న ఒరిస్సా పట్టణం పర్లాకిమిడి మా స్వస్థలం. మా నాన్నగారు అబ్దుల్ మజీద్, అమ్మ షఫీవున్నీసాబీబి. నలుగురం అన్నదమ్ముల్లో నేను మూడోవాణ్ణి. నాకు ముగ్గురు అక్కలు. నాన్నగారు బట్టలు, చర్మాల వ్యాపారం చేసేవారు.

మా అన్నయ్యలిద్దరూ వైద్యులు. చిన్నప్పటినుండీ మావన్నీ మెరిట్ స్కాలర్‌షిప్ చదువులే. మెట్రిక్యులేషన్ (11వ తకగతి) వరకు సొంతూళ్ళో చదివి, బరంపురం మహారాజా కృష్ణచంద్ర వైద్యకళాశాల (ఎంకెసిజి)లో 1975లో వైద్యవిద్య పూర్తిచేశాను.

## హే కృష్ణా ముకుందా మురారీ...

నా బాల్య మిత్రుడు గొర్తి జగన్నాథం సంగీతాభిరుచిగలవాడు (జె.వి.రమణమూర్తిగారి అల్లుడు). 'కలసి ఉంటే కలదు సుఖం' చిత్రంలో సుశీలగారు పాడిన "మేలిమి బంగారు మెలిక తిరిగిన విలువ తరిగేనా....అనే పాట నాకెంతో నచ్చింది. ఆ పాట పాడుతూ ఉండేవాణ్ణి. మా స్కూలు హెడ్మాస్టర్ మరువాడ గౌరీశంకరంగారు. జాతీయ ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు గ్రహీత. నా పాటను ప్రోత్సహించేవారు. మంచి సినిమాలు చూడమని డబ్బులిచ్చేవారు. మా నాన్నగారు కూడా అంతే. మంచి కుటుంబ కథా చిత్రాలు చూడమనీ, అందులో మంచిని చూసి నేర్చుకోమనీ ప్రోత్సహించేవారు.

మా కుటుంబం మీద తెలుగుభాషా ప్రభావమే ఎక్కువ. హిందీ సినిమాల ఊసు తక్కువ. చుట్టూ తెలుగు సినిమాలే. ఇంట్లో మేం తెలుగుపాటలు పాడుకునేవాళ్ళం. హే కృష్ణా ముకుందా మురారీ.... అని ఘంటసాల పాట పాడుతుంటే, 'ఒరేయ్ మనం ముస్లిమ్ మతస్తులం, అలాంటి పాటలు పాడకూడదురా' అని ఎప్పుడూ అమ్మానాన్న అడ్డు చెప్పలేదు. ఆ విధమైన మతసామరస్య వాతావరణం, కులమత భాషా భేదాలులేని కుటుంబ జీవితాన్ని మా నాన్నగారు అలవాటు చేశారు. ఆ పెంపకమే నన్ను తెలుగు భాషపైన, ఘంటసాల పాటపైన అవ్యాజమైన ప్రేమాభిమానాలు పెంపొందించుకునేట్టు చేసింది. హైస్కూల్లో పాటలపోటీల్లో పాల్గొనేవాణ్ణి. అటు చదువులోనూ, ఇటు ఆటల్లోనూ ఎన్నో బహుమతులొచ్చేవి. నా పాటకు బహుమతి రాకపోతే ఎక్కడ తప్పుచేశానో, ఎదుటివారు ఎక్కడ బాగా పాడారో... అని నాకు నేనే విశ్లేషించుకునేవాణ్ణి.

## జగదేకవీరుని సినిమా ప్రభావం

సినిమాలు విపరీతంగా చూసేవాణ్ణి. డైలాగ్ డెలివరీ, కెమెరా, లాంగ్‌షాట్, గుర్రంమీద డూప్ వంటి విషయాలు చర్చించుకునేవాళ్ళం. నా స్నేహితుడు సామినేని శివప్రసాద్ ఇవన్నీ ఎక్కడో తెలుసుకుని మా దగ్గర చర్చించేవాడు. అలా నేను చూసిన 'జగదేకవీరుని కథ' సినిమా నాపై తీవ్ర ప్రభావం చూపించింది. ఆ సినిమాలో ఘంటసాల పాడిన 'శివ శంకరీ..శివానంద లహరి... అనే పాట నన్ను తీవ్రంగా కదిలించింది. కాలేజీలో చేరాక విశాలభావం, సాహిత్య విశ్లేషణ అలవడ్డాయి. కాలేజీ లైఫ్‌లో సామినేని శివప్రసాద్, నేను, తాయి వెంకటరెడ్డి, ఇవటూరి బాపేశ్వర్రావు నలుగురం కలిసి సినిమాలు, ఘంటసాల పాటలపై చర్చించుకునేవాళ్ళం. అలా పాటల సాహిత్యంపై అవగాహన పెరిగి పాటను ఆస్వాదించేవాళ్ళం. నేను పాటలు రాసి, వరసలు కడితే వెంకటరెడ్డి పాడేవాడు. బరంపురంలో మెడిసిన్ చేస్తూనే రెండేళ్ళు కర్ణాటక సంగీతం నేర్చుకున్నాను. హౌస్‌సర్జన్ తర్వాత కాకినాడలో సీనియర్ హౌస్మెన్‌షిప్ ఏడాది కోర్సు చేస్తూ డాక్టర్ తమ్మా సూర్యనారాయణ, ఎర్రా డిల్లేశ్వర్రావులతో కలిసి లవకుశ, రహస్యం, గుండమ్మకథ, పూలరంగడు... ఇలా విపరీతంగా ఎన్నో సినిమాలు చూస్తూ, ఘంటసాల పాటలు ఆస్వాదించేవాణ్ణి. అలా ఆ పాటలు, ఆ మ్యూజిక్ నాలో బాగా జీర్ణించుకుపోయాయి. మరోవైపు డాక్టర్ బి.బి.ఆచారిగారు నాతో ఘంటసాల పాటలు పాడిస్తూ నా కంఠానికి సానపెట్టారు. ఇలా బాల్యం నుండి ఎంతోమంది నన్ను ప్రోత్సహించి ఘంటసాల పాటల పరిశోధనవైపు నడిపించారు. అదొక దైవ సంఘటన. ఘంటసాల పాట మధ్యలో ఎక్కడ గుర్తుచేసినా, చిన్న పదం చెప్పినా, కొద్దిగా మ్యూజిక్ వినిపించినా గానీ అది ఏ పాట, సన్నివేశం, హీరో ఎవరు, ఏ సినిమా... లాంటి వివరాలు ఠక్కున చెప్పేసేవాణ్ణి.

## పాతికేళ్ళు ఘంటసాల పాటల సేవ

సొంతవూరు పర్లాకిమిడిలో వైద్యసేవలు చేస్తూ, చైతన్య ఆంధ్ర సాహితి, సంస్కృత సమితి స్థాపించాను. సామవేదం షణ్ముఖశర్మగారి తండ్రి బ్రహ్మశ్రీ సామవేదం రామ్మూర్తిశర్మగారే దీనికి అంకురార్పణ చేశారు. పాతికేళ్ళపాటు ఘంటసాల స్మారకపోటీలు, నన్నయ్య, పోతన, శ్రీశ్రీ, దేవులపల్లి, శ్రీనాథ, విశ్వనాథ, ఆత్రేయ, ఆరుద్ర వంటి కవుల జయంతులు, వర్ధంతులు, నాటకపోటీలు, డాన్స్ పోటీలు నిర్వహిస్తూ కళా సేవ చేశాను. నేటికీ ఈ సంస్థ కొనసాగుతోంది. శ్రీకాకుళం, విజయనగరం, అనకాపల్లి ప్రాంతాల్లో పాటలపోటీలకు నేనే న్యాయనిర్ణేతగా ఉండేవాణ్ణి. దీనివల్ల సంగీత, సాహిత్యాలపై నాకు మంచి పట్టు లభించింది. సొంతంగా 50 లలిత గీతాలు రాశాను.

## ఘంటసాల అవధానాలు

హైదరాబాద్‌లో 2004లో జరిగిన ఘంటసాల అభిమానుల జాతీయ సదస్సు క్విజ్‌పోటీల్లో ప్రథమ బహుమతి లభించింది. అప్పుడే ఘంటసాల గాన సభ నిర్వాహకులు డాక్టర్ కె.వి. రావు, ఎస్వీ.రామారావు గారు ఘంటసాల అవధానం చేయమని ప్రోత్సహించారు. దాంతో 2005 ఫిబ్రవరి 27న పర్లాకిమిడిలో ఘంటసాల పాటలపై ఆష్టావధానం చేశాను. ఆంధ్రప్రదేశ్‌లో మొదటిసారి రాజమండ్రిలో ఆష్టావధానం చేశాను. సినీ రచయిత భమిడిపాటి రాధాకృష్ణగారు 'ఈయనకెంత గుండెధైర్యం!' అంటూ ఎంతో మెచ్చుకున్నారు. 2008లో విశాఖపట్నంలో అష్టావధానం చేసినప్పుడు పృశ్చకపాత్రల్లో వచ్చిన రావికొండలరావు, రాధాకుమారి దంపతుల పరిచయమైనప్పటినుండీ వారు నా అవధానాలకు అనుసంధానకర్తలుగా ఉన్నారు.

## జాతీయ రికార్డ్

నా అవధానంలో మొదట ఎనిమిదిమంది పృశ్చకులు ఉండేవారు. తర్వాత ఆ సంఖ్య పెరుగుతూ ఒకేసారి 50 మందితో చేశాను. వారంతా ఏకకాలంలో ఘంటసాల పాటలపైన తలో ప్రశ్నా అడుగుతుంటే, అడిగేవారి పేర్లు గుర్తుపెట్టుకుని వరుస క్రమంలో సమాధానాలిస్తూ విజయవంతంగా అవధానం పూర్తి చేశాను. ఇలా 2015లో పర్లాకిమిడిలో తెలుగు బుక్ ఆఫ్ రికార్డ్స్ వారి సమక్షంలో ఘంటసాల అవధానం చేసి వారి రికార్డుల్లోకి



## ఘంటసాల ఖైదీ నెంబర్ 7460

**–డా.రహమతుల్లా**

"ఘంటసాలకు వంకాయకూర ఎంతో ఇష్టం. రోజూ అదే వండమని అడిగేవారట. ఆయన మత సామరస్యం ఎంతో గొప్పది. మద్రాసు పర్యటనకు వచ్చిన పాకిస్థాన్ సంగీత విద్వాంసుడు బడేగులామ్ అలీఖాన్, ఆయన పదిమంది బృందానికీ రెండునెలలు తన ఇంట్లోనే వసతి కల్పించి, హిందుస్థానీ సంగీతంలో ఎన్నో మెళకువలు నేర్చుకున్నారు. ఆయన భార్య సావిత్రమ్మ ఎలాంటి అభ్యంతరం చెప్పకుండా అతిథి మర్యాదలు చేశారు.

ఘంటసాలకు నేవీ బ్లూ కలర్ అంబాసిడర్ కారు ఉండేది. ఆ కారు నెంబర్ ఎం.ఎస్.డబ్ల్యు 8929.

ఘంటసాల క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని గుడివాడ, రాజమండ్రి, బళ్ళారిలలో జైలు శిక్ష అనుభవించారు. ఆలీపూర్ జైలులో ఖైదీగా ఉండగా, ఆయనకిచ్చిన నెంబర్ 7460".

రహమతుల్లా ఇంకా ఇలా చెబుతారు.

"ఘంటసాలను నేను చూడలేదు. కాలక్రమంలో ఆయన కుటుంబంతో సాన్నిహిత్యం ఏర్పడింది. ఘంటసాల సతీమణి సావిత్రమ్మ, ఆయన కుమారుడు రత్నకుమార్, కుమార్తెలు శ్యామల, సుగుణ, శాంతి నన్ను ప్రోత్సహిస్తున్నారు.

అపోలో సంస్థలో నెఫ్రాలజిస్ట్‌గా చేస్తూనే హైదరాబాద్ రెజిమెంటల్ బజార్‌లో ఛారిటబుల్ ట్రస్ట్ తరపున ఇరవై రూపాయలకే పేదలకు వైద్య సేవలు అందిస్తున్నాను.

తీరిక సమయంలో ఘంటసాలను స్మరించుకుంటాను. ఘంటసాల అవధానాల వల్ల నాకు కేవలం ఆత్మసంతృప్తి తప్ప, ఎలాంటి ధనలాభం లేదు. సేవాతత్పరతతో భాషకు, పాటకు అంకితమయ్యాను అంతే.

email:dr.srmt@gmail.com



ఎక్కాను. రాజమండ్రి ఆనంకళాకేంద్రంలో తుమ్మిడి రామ్‌కుమార్ ఆధ్వర్యంలో 2012 ఆగస్టు 26న చేసిన నా 'నూరవ ఘంటసాల అవధానం' 'ఇండియా బుక్ ఆఫ్ రికార్డ్స్‌లో నమోదైంది.

### దిగ్గజాల సమక్షంలో చిత్రవిచిత్ర ప్రశ్నలు

దిగ్గజాలవంటి సినీ ప్రముఖుల సమక్షంలో హైదరాబాద్ రవీంద్రభారతి, మద్రాసు ఆస్కా (ఆంధ్రా సోషల్ కల్చరల్ అసోసియేషన్)లలో ఘంటసాల అవధానాలు చేశాను. అక్కినేని నాగేశ్వరరావు, కాంతారావు, ఎస్. జానకి, కోట శ్రీనివాసరావు, మాధవపెద్ది సురేష్ వంటి ఎందరో ప్రముఖులు నా అవధానాలు తిలకించారు. ఇప్పటివరకు 167 అవధానాలు చేశాను. దేవుడు మేలు చేస్తే వందమంది పృశ్చకులతో అవధానం చేస్తాను.

అవధానాల్లో పృశ్చకులు చిత్రవిచిత్రమైన ఊహించని ప్రశ్నలు అడుగుతారు. వాటిని అనుసంధానం చేసుకుని మెరుపు ఆలోచనతో సమాధానాలు చెప్పాలి. అలా నేను అన్నిటికీ సమాధానాలు చెప్పేస్తుంటే, అక్కినేనిగారు నన్ను ఇరకాటంలో పెట్టడానికన్నట్టుగా, ఘంటసాల అన్‌పాపులర్ సాంగ్స్ చెప్పమన్నారు. ఏ పాట చెప్పినా సభలో అభిమానులు అన్‌పాపులర్ కాదు, కాదు అన్నారు. అక్కినేని కూడా నవ్వి ఊరుకున్నారు. అంటే ఘంటసాల పాటలన్నీ ప్రజాదరణ పొందినవేనని అప్పుడు ఋజువైంది. ఘంటసాల విమానంలో పాటలు, దగ్గుల పాటలు, నవ్వుల పాటలు, అక్కినేనికి విమానంలో పాడిన ఘంటసాల పాట, జంతువుల పేర్లు వచ్చేపాటలు, స్త్రీ పాత్రలకు (మాయాబజార్, లక్ష్మమ్మ) ఘంటసాల పాడిన పాటలు, అల్లురామలింగయ్య (జేబుదొంగ, గౌరి), బాలకృష్ణ (రాముడు భీముడు, వీరభద్ర) లకు ఘంటసాల లిప్ మూమెంట్ పెట్టిన పాటలు... ఇలా ఎన్నో చమత్కార ప్రశ్నలకు సమాధానాలు చెప్పాను. లవకుశ చిత్రం స్వర్ణోత్సవాలు, రాధాకుమారిగారి వర్ధంతి సందర్భాల్లో నేను చేసిన అవధానాలు ఎన్నటికీ మరువలేను. ఘంటసాల సావిత్రమ్మగారి సమక్షంలో మద్రాసులో చేసిన అవధానం ఎన్నటికీ మరచిపోలేను. చల్లా సుబ్బారాయుడు సంకలనం చేసిన ఘంటసాల గానచరిత నా అవధానాలకు మూలాధారం.

### తెలుగుభాషతో ముడిపడిన వివాహబంధం !

తెలుగుభాషపై నాకున్న ప్రేమ, అభిమానాల కారణంగానే తెలుగు అమ్మాయిని భార్యగా చేసుకున్నాను. మా తల్లిదండ్రులు ఒరిస్సా లో సంబంధాలు చూస్తుంటే తిరస్కరించాను. నేను తెలుగు మరచిపోతాను, అందువల్ల తెలుగు అమ్మాయినే చేసుకుంటానని పట్టుపట్టి పశ్చిమగోదావరిజిల్లా కొవ్వూరు అమ్మాయిని ఏరికోరి అందరి అంగీకారంతో పెళ్ళి చేసుకున్నాను. నా భార్య ఖుర్షీద్ బేగమ్. నా అభిరుచులకు తగ్గట్టే తెలుగుభాషాభిమానం మెండు. అలా నా వైవాహిక జీవితం కూడా తెలుగుభాషతోనే ముడిపడింది. మాకు ఒకే ఒక కుమార్తె షబానాబాను . హైదరాబాద్‌లో రేడియాలజిస్ట్.

### సచిన్, ఎన్‌టి.ఆర్‌లపై అవధానాలు చేయొచ్చు!

అవధాన ప్రక్రియ ఏకాగ్రతతో కూడినది. మనిషి మనోభావాలకు, ఉద్దీపనలకు సంబంధించినది. మనకు ఆలంబనగా ఉన్న అంశాన్ని తీసుకుని ఎవరైనా చిత్తశుద్ధి, విజ్ఞతలతో రాబోయే కాలంలో సచిన్ టెండూల్కర్, ఎన్.టి.ఆర్ లాంటివారిపై కూడా అవధానాలు చేసేవారు రావొచ్చు! అందులో ఆశ్చర్యం లేదు. దీనివల్ల ఆ ప్రముఖుల గొప్పతనం, వారినుండి నేర్చుకోదల్చిన ఆదర్శ విషయాలతోపాటు విజ్ఞానం కూడా పెరుగుతుంది.

అవధానం చేసేటప్పుడు తన జ్ఞానేంద్రియాలను అతడు తన ఉద్దీపనలకు అనుగుణంగా మార్చుకుని సంసిద్ధమవుతాడు. వ్యక్తికున్న ఏకాగ్రత, విషయ పరిజ్ఞానం, విషయ స్పష్టత, ఆత్మవిశ్వాసం వంటి ఎన్నో అంశాలు అవధానం చేసేవ్యక్తి విజయానికి దోహదం చేస్తాయి.

—రామ్మోహన్

## సుధామ పదగారడి-304

సెల్: 98492 97958

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | ❖ | 3 | 4 | | ❖ | 5 | 6 |
| 7 | h | | ❖ | | ❖ | 8 | h | |
| ❖ | | ❖ | 9 | | 10 | 8 ❖ | | ❖ |
| 11 | ❖ | 12 | | ❖ | 13 | 14 | ❖ | 15 |
| 16 | 11 | | ❖ | ❖ | ❖ | 17 | | h |
| | ❖ | 18 15 | 19 | ❖ h | 20 | h | ❖ | |
| ❖ | 21 | ❖ | 22 | 23 | | 19 ❖ | 24 h | ❖ |
| 25 h | | | ❖ | | ❖ | 26 | h | |
| ❖ | | ❖ | 27 | | | ❖ | | ❖ |

**ఆధారాలు**

**అడ్డం**

1. వసంతోత్సవమే! (2)
3. వర్ణములు (3)
5. మత్తుపదార్థం (2)
7. చాతి లేని చారులతిక (3)
8. కొట్టు (3)
9. ఇంజక్షన్ చేయడానికి వాడేది (3)
12. నల్ల బంగారం (2)
13. ముందు పోయి – దాగిరి (2)
16. తండ్రి తోబుట్టువు (3)
17. వలలునిచేత లో స్త్రీ (3)
18. ముసుగుని ఆద్యంతాలు ఉంచుకోండి చాలు (2)
20. ఆరాటములో కనబడని రాము (2)
22. మృగము (3)
25. పికిల్ (3)
26. తీర్థం తోడిది (3)
27. తుమ్మెద (3)

**నిలువు**

1. గొప్ప ధ్వని (2)
2. సుశీలగా కాదు మరో గాయనిగా (3)
4. డేరా (3)
5. అడ్డు, అవరోధం (3)
6. కోవెల (2)
9. లజ్జ (2)
10. జిగిబిగిలో బిగిలేదు (2)
11. ఎల్లప్పుడూ (3)
12. గుండీ (3)
14. సన్ననిపుల్ల (3)
15. జూదము (3)
19. నిక్కము (2)
20. సాధుజంతువు (2)
21. గోచీ, కౌపీనం (3)
23. మంచు (3)
24. వీలు కానిది, సాధ్యపడనిది (3)

### పదగారడి-303 సమాధానాలు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 సూ | ర్య | 2 గ్ర | హ | ణం | | 3 వే | ఉ | 4 మి |
| తు | | హ | | | 5 చె | లి | | త్రు |
| డు | | బ | | 6 జ్వ | | ము | | డు |
| | 7 ఆ | లం | 8 పు | రం | | 9 ద్ర | 10 వం | |
| 11 చి | డ | | రా | | 12 చిం | | 13 కా | ఫీ |
| | 14 ది | 15 వా | ణం | | 16 త | 17 న | య | |
| 18 మే | | లు | | 19 చ | | వ | | 20 జి |
| న | | 21 మా | ర్గ | ము | | లి | | ల |
| 22 పే | డు | పు | | 23 రు | చి | క | ర | ము |

Printed and Published by **VEMURI RADHAKRISHNA**, Managing Director on behalf of Aamoda Publications Pvt. Ltd., Published at Plot No:76, Ashwini Layout, Huda Heights, Jubilee Hills, Hyderabad - 500 033, Phone No: (040)23558233/44, Fax No: (040) 23558288 and Printed at Aamoda Press, Survey No: 70/1 & 2, Vedurupavuluru Village, Mustabad Grama Panchayathi, Gannavaram Mandal, Vijayawada, Krishna District, PIN: 521 107 on behalf of Aamoda Press, R.S No:191/3, Ward No:43, Donka Road, Patamata, Vijayawada 520 010, RNI No: APTEL/20047/12594, Editor : **A.N.JAGANNADHA SARMA**

# ఆయన చాలా స్పెషల్

–మియా జార్జి

**పరభాషా నాయికలు టాలీవుడ్‌ని ఏలారు, ఏలుతున్నారు. అలా వచ్చిన వారిలో మియా జార్జి ఒకరు. అందం అభినయం ఉన్న ఈ మలయాళీ భామకు ఇప్పటివరకూ తమిళ, మలయాళం కలిపి దాదాపు 20 సినిమాల్లో నటించిన అనుభవం ఉంది. తొలిసారి 'యమన్' డబ్బింగ్ సినిమా ద్వారా తెలుగు ప్రేక్షకుల ముందుకు వచ్చింది. వాస్తవానికి తెలుగులో నా మొదటి సినిమా 'ఉంగరాల రాంబాబు'. కానీ దాని విడుదల ఆలస్యం కావడంతో 'యమన్' మొదటి సినిమా అయింది అంటున్న మియా జార్జితో...**

**మీ గురించి...**

కేరళలోని కొట్టాయం సమీపంలోని పాల గ్రామం మాది.

**'యమన్' మీ మొదటి సినిమానా?**

కాదు. 'ఉంగరాల రాంబాబు' సినిమాలో సునీల్ పక్కన చేశాను. కొన్ని కారణాల వలన ఆ సినిమా విడుదల ఆలస్యం కావడంతో 'యమన్' నా మొదటి సినిమా అయింది.

**'యమన్' సక్సెస్ ఎంజాయ్ చేస్తున్నట్టున్నారు?**

డబ్బింగ్ సినిమా అయినా తెలుగు ప్రేక్షకులు బాగా ఆదరించారు. ఈ సినిమాలో బాగా చేశావని అందరూ మెచ్చుకుంటుంటే ఆనందంగా ఉంది.

**విజయ్ ఆంటోనితో చేయడం ఎలా ఉంది?**

ఇది మొదటి సినిమా కాదు. ఇంతకు ముందు ఆయనతోనూ, దర్శకుడు జీవా శంకర్ గారితోనూ చేశాను. ఇది నా రెండవ సినిమా. విజయ్‌గారి సక్సెస్ అంతా ఆయన కథలు ఎంపిక చేసుకోవడంలోనే ఉంటుంది. ఎప్పటికప్పుడు డిఫరెంట్ కథలు సెలెక్ట్ చేసుకుంటూ ఉంటారు. ఆయనతో సినిమా చేస్తే చాలా విషయాలు తెలుసుకోవచ్చు. తోటి నటీనటులకు చాలా మర్యాద ఇస్తారు. మిగతా వారితో పోలిస్తే ఆయన చాలా స్పెషల్.

**'ఉంగరాల రాంబాబు' గురించి చెప్పండి.**

మంచి కుటుంబ కథా చిత్రం ఇది. సునీల్‌గారితో చేయడం మంచి అనుభూతిని మిగిల్చింది. సంప్రదాయబద్ధంగా కనిపిస్తాను. నా పాత్ర అందరికీ నచ్చుతుంది.

**భావన ఇన్సిడెంట్ గురించి...**

తెలియగానే చాలా షాక్ అయ్యాను. తనూ నేనూ ఒక సినిమాలో చేశాం. చాలా కలుపుగోలుగా మాట్లాడుతుంది. తను సీనియర్ అయినా ఆ భావం ఎక్కడా కనిపించదు. తన విషయంలో నాకు ఒకటే ఆనందం అనిపించింది. మామూలు అమ్మాయిలా ఇంట్లో కూర్చొని బాధపడకుండా తనకు జరిగిన అన్యాయం గురించి బయటి ప్రపంచానికి చెప్పింది. తన ధైర్యం నాకు నచ్చింది. షూటింగ్ సమయంలో వెహికల్స్ ఇస్తారు. కానీ వాటికి సరైన సెక్యూరిటీ ఇవ్వరు. అందువల్లే ఇలాంటి సంఘటనలు జరుగుతున్నాయి. భావన తరువాత ఎంతోమంది తమకు గతంలో జరిగిన అన్యాయాల గురించి ఇప్పుడు నోరు విప్పుతున్నారు. బయటకు చెబుతున్నవారు సరే! చెప్పని వారు, చెప్పుకోలేని వారూ ఇంకెంత మంది ఉన్నారో అనిపిస్తుంది. భావనలాగా తిరగబడితేనే దోషులకు శిక్ష పడుతుంది.

**ఎలాంటి క్యారెక్టర్లు చేయాలనుకుంటున్నారు?**

నాకంటూ ఓ గుర్తింపు తీసుకువచ్చే పాత్రలు చేయాలనుంది. రెగ్యులర్‌గా చేసే పాత్రలు నాకు నచ్చవు. స్పెషల్‌గా అనిపించాలి. ఇప్పటి వరకూ అలాంటి రోల్సే చేస్తున్నాను. బేసిక్‌గా నేను క్లాసికల్ డ్యాన్సర్‌ని. నృత్య ప్రధాన పాత్ర చేసే అవకాశం వస్తే తప్పకుండా చేస్తాను.

**మీకు నచ్చిన హీరో హీరోయిన్లు...**

హీరోల్లో ఒక్కొక్కరిదీ ఒక్కో స్టయిల్. ప్రత్యేకించి ఇష్టమని చెప్పడం కష్టం. హీరోయిన్లలో నిత్యామీనన్ అంటే చాలా ఇష్టం. తన నటన నచ్చుతుంది. చాలా విషయాల్లో తనే నాకు ఆదర్శం.

**తెలుగులో ఒప్పుకున్న సినిమాలు?**

చాలామంది కథలు చెబుతున్నారు. వేటికీ ఓకే చెప్పలేదు. త్వరలోనే తెలుగులో ఓ సినిమా చేసే అవకాశం ఉంది. వాటి వివరాలు తరువాత చెబుతాను. తెలుగు నేర్చుకుంటున్నాను. అంతకుముందు చాలా అవకాశాలు వచ్చాయి కానీ, భాష ఇబ్బంది అవుతుందన్న ఉద్దేశంతో వాటిని వదులుకున్నాను. ఏ భాషలోనైనా సరే, చేస్తాను.

–దేవి



| | | |
|---|---|---|
| 28. | తులసి నిత్యపూజ, తులసీఉపయోగాలు | 10-00 |
| 29. | శ్రీ చక్ర రహస్య విజ్ఞానమ్ | 36-00 |
| 30. | శ్రీచక్ర పూజావిధానం(పెద్దది) | 36-00 |
| 31. | లక్ష్మీ - గౌరీ నిత్యపూజ | 10-00 |
| 32. | శ్రీ సరస్వతీ నిత్యపూజ | 10-00 |
| 33. | శ్రీ దుర్గానిత్యపూజ | 10-00 |
| 34. | కాలభైరవ నిత్యపూజ | 10-00 |
| 35. | శివపూజ | 10-00 |
| 36. | వీరభద్ర పూజ | 10-00 |
| 37. | ఆంజనేయ నిత్యపూజ | 10-00 |
| 38. | నాగేంద్ర స్వామి పూజ | 10-00 |
| 39. | సుబ్రహ్మణ్య నిత్యపూజ | 10-00 |
| 40. | రామదేవుని కథ | 10-00 |
| 41. | శివదేవుని కథ | 10-00 |
| 42. | లక్ష్మీనరసింహపూజ | 10-00 |
| 43. | వేంకటేశ్వరపూజ | 10-00 |
| 44. | బ్రహ్మంగారి నిత్యపూజ | 10-00 |
| 45. | సూర్య నిత్యపూజ | 10-00 |
| 46. | నవగ్రహ నిత్యపూజ | 10-00 |
| 47. | రుక్మిణీ కల్యాణం | 25-00 |
| 48. | ఉమామహేశ్వర వ్రతం | 36-00 |
| 49. | శ్రీ కామేశ్వరీ వ్రతం | 36-00 |
| 50. | 16 సోమవారముల వ్రతము | 25-00 |
| 51. | పార్వతీకల్యాణం | 25-00 |
| 52. | సహస్రకమలవర్తి వ్రతము | 25-00 |
| 53. | పంచముఖ ఆంజనేయ పూజావిధానము | 36-00 |
| 54. | అష్టనాగపూజ | 36-00 |
| 55. | పూజలు ఎందుకుచేయాలి ? | 36-00 |
| 56. | ఏ దేవునికి ఏపుష్పాలతో పూజించాలి? | 36-00 |
| 57. | ఏ దేవునికి ఏప్రసాదం నైవేద్యం పెట్టాలి? | 36-00 |
| 58. | ఏదేవునికి ఏవిధముగాదీపారాధనచెయ్యాలి? | 36-00 |
| 59. | ఏదేవునికి ఎన్ని ప్రదక్షిణలుచేయాలి ? | 36-00 |
| 60. | హనుమద్ వ్రతం | 36-00 |
| 61. | పంచాయతన పూజ | 63-00 |
| 62. | 28 వ్రతములు | 120-00 |

